# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

మార్చ్ 2007 68 రు. 10

- ఫోకస్ : ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం నూట యాభై ఏళ్లు - మూడు వ్యాసాలు
- కేంద్ర, రాష్ట్ర బడ్జెట్లు
- శాసనమండలిపై రెండు వ్యాసాలు
- తెలుగుభాషా ఉద్యమం
- తెలుగు సినిమా వజ్రోత్సవాలు
- ఐ.ఐ.టి. పేరిట ప్రాంతాల మధ్య చిచ్చు

వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

వార్షిక చందా: రు.120 విడి ప్రతి : రు. 10

68 మార్చ్ 2007

*సంపాదకీయం*

# ఆమ్ ఆద్మీ ఏడీ? ఎక్కడ?

**స్థూ**ల జాతీయ ఆదాయం, ఎగుమతులు, విదేశీ మారకద్రవ్యం, పారిశ్రామికోత్పత్తి పెరుగుదలల గురించి పాడిందే పాడిన చందాన వినిపిస్తూ వచ్చిన పాలకులు వ్యవసాయాభివృద్ధి గురించి, దాని కీలకపాత్ర గురించి కొత్త పాట వినిపించడం ప్రారంభించేసరికి, 2007-08 బడ్జెట్‌లో ఈ కొత్త పాట లీలగానైనా వినిపిస్తుందేమోనని కళ్లింత చేసుకొని చూడబోతే మళ్లీ అదే పాతపాటే. వ్యవసాయానికి ఏదో ఒరగబెడుతున్నట్లు పదిహేను నిమిషాల పాటు ఓ పెద్ద లిస్టు చదివారు, కాని పద్దుకు కేటాయింపు పెంచింది కేవలం వెయ్యి కోట్లు మాత్రమే. ఆ పెరుగుదలను ద్రవ్యోల్బణం మింగేస్తుంది. అంతే ఎక్కడ వేసిన గొంగళి అక్కడే. స్వామినాథన్ మొదలుకొని, ఆర్థిక, వ్యవసాయ శాస్త్రవేత్తలంతా పెదవి విరిచారు. వ్యవసాయానికి విదిలించింది ఎంగిలి మెతుకులే. మన్‌మోహన్ సింగ్, అహ్లూవాలియా, చిదంబరం, రంగరాజన్ లాంటి ప్రపంచ బ్యాంక్ జీ హుజూర్లు దేశాన్ని పాలిస్తుంటే, గమనం మరోలా ఉంటుందని అనుకోవడం మన తప్పు. అందరూ ఆశగా ఎదురుచూసిన వడ్డీ రేటు తగ్గింపు ఊసేలేదు. తగ్గింపులు, ప్రోత్సాహకాలు అన్నీ పారిశ్రామిక వేత్తలకే. పారిశ్రామిక రంగంలో చిన్నచిన్న మినహాయింపులు తొలగిస్తారన్న ఆశకూడా నిరాశే అయ్యింది. కనీసం ఉమ్మడి కార్యక్రమం కాకెత్తుకుపోయింది. ఇదివరకటి బడ్జెట్లలా ముందు వ్యవసాయాన్ని ప్రస్తావించకుండా విద్య, వైద్యం గురించి ప్రస్తావిస్తే ఏమో అనుకున్నాం గాని ఇలా ఆ రంగాలకు వెన్నుపోటు పొడుస్తారనుకోలేదు. కేటాయింపుల పెంపుదల సరే, మొత్తం ఖర్చులు లేదా జిడిపిలో వాటి శాతం చూడబోతే అయ్యవారి నట్టిల్లే.

అసంఘటిత, సంఘటిత కార్మికులకు శఠగోపం. పోట్లు పేదలకు; వరాలు సంపన్నులకు. మౌలిక సౌకర్యాలకు 14 లక్షల 50 వేల కోట్లు అవసరమవుతాయని అంచనాలే గాని, ఆచరణ ప్రైవేట్‌పరం. ద్రవ్యోల్బణం వచ్చే ఏడాది కూడా మనలను వెంటాడుతుందని స్పష్టం చేశారు చిదంబరం. ఎవరో వస్తారు, ఏదో చేస్తారు అన్నట్లు బడ్జెట్ వస్తుంది, ఏదో జరుగుతుందని ఆశించాం. అడియాశే ఎదురయ్యింది. బడ్జెట్లు, చట్టసభలు ప్రజలను వారి బాధలనుండి విముక్తి కలిగిస్తాయా? బైటపడవేసేది ఇలాగేనా? ఆర్థిక పరిస్థితి మూడు పువ్వులు, ఆరు కాయలుగా ఉందని, ఇదంతా మా ప్రభుత్వ ప్రతాపమని బస్తీమే సవాల్ అంటూ గత మూడు సంవత్సరాలుగా ఆర్థిక పరిస్థితి పుంజుకొందంటే అది తమ విధానాల వల్లనేనని జబ్బలు చరుచుకొన్నారు. రెవెన్యూ ఆదాయం పెరిగింది, కార్పొరేటు పన్నుల చెల్లింపులు, ఎగుమతులు, విదేశీ మారకద్రవ్య నిల్వలు అన్నీ ఆకాశం వైపు చూస్తున్నాయని గణాంకాలతో సహా నిరూపించారు. నిజం, దేశ ఆర్థిక పరిస్థితి చాలా మెరుగైంది. సంతోషం, కాని దేశంలోని సామాన్యుల మాటేమిటి? వారికేమి ఒరిగింది? వోట్లు వాళ్లవి; ఫలితాలు సంపన్నులకా? కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి రాగానే కనీస ఉమ్మడి కార్యక్రమాన్ని ఆర్భాటంగా ప్రకటించి ఆకాశంలో చంద్రుణ్ణి చూపించారు. కాని ఈ బడ్జెట్ చూస్తే దాన్ని తుంగలో తొక్కినట్లు స్పష్టమవుతుంది.

(మిగతా 5వ పేజీలో...)

# లోపలి పేజీల్లో...



## ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం - నూటయాభై ఏళ్లు

1857లో జరిగిన తిరుగుబాటుకు 150 ఏండ్లునిండాయి. ఆనాటి ప్రముఖ చారిత్రక ఘటనను నేడు దేశం స్మరించుకుంటున్నది. 1857ను గూర్చి పునర్మూల్యాంకనం జరుగుతున్నది. విద్వద్గోష్ఠులు, ప్రత్యేక సంచికలు, గ్రంథాలు వెలువడుతున్నాయి. చరిత్ర అధ్యయనంలో ఉన్న సౌలభ్యం ఇదే. చరిత్ర రచనలో అంతిమ వాక్యం, తీర్పు ఉండవు. నికార్సయిన ఆధారాలపై చరిత్ర రచిస్తారు. కొత్త ఆధారాలు లభించే కొద్దీ, నూతన చారిత్రక పరిశోధనా పద్ధతులు రూపొందినప్పుడు, గత ఘటనలపై తిరిగి బేరీజు వేసుకోవడం జరుగుతుంది. ఇది అవసరం కూడా.

### ఫోకస్ : ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం - నూటయాభై ఏళ్లు



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.


**వీక్షణం**

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 66843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్ : వై. రామచంద్రం 9949391028
కంపోజింగ్ & లే ఔట్ : సి. రాజశేఖర్

## పాఠకుల వీక్షణం

వల్లంపాటి వెంకటసుబ్బయ్యగారు ఇక లేరు అనే వార్త అధ్యాపక వర్గాన్ని, సాహిత్యాభిమానులనూ దుఃఖసాగరంలో ముంచివేసింది. ఆ వార్త (సంస్మరణ) వీక్షణం ద్వారా తెలిసింది. ఆయన స్వతహాగా ఎంత అందంగా ఉంటారో ఆయన హృదయం, మనసు కూడా అందమైనది. ఆయన ఎవరినీ ఎప్పుడూ నొప్పించినవాడు కాదు. ఆంగ్ల, ఆంధ్ర సాహిత్యానికి ఆయన లేకపోవడం తీరని లోటు. అశ్రునయనాలతో

**– కాకుటూరు నాగరాజా రావు**
యూసఫ్‌గూడ

'ప్రభుత్వ పథకాలు – ఒక పరిశీలన' అనే వ్యాసం మీరు ఎందుకు అచ్చు వేసినారో మాకు తెలియలేదు. ఎందుకంటే అసలు అది వ్యాసం కూడా కాదు. ఒక పేజీ వివరణ, ఒక పేజీ పట్టిక ఉన్నాయి. సంక్షిప్తీకరణ అని కూడా గమనిక ఉంది. పూర్తి వ్యాసం ఎట్లా ఉన్నదో తెలియదు. మీ పత్రికలో అచ్చయిన దాని ప్రకారం మాత్రం రచయిత్రి ఏమి చెప్పదలచుకున్నారో అర్థం కాదు. అసలు ప్రభుత్వం ఎప్పుడైనా నిధుల కేటాయింపుల గురించి, పథకాల గురించి పూర్తి నిజాలు ప్రకటిస్తుందా? తెలియజేయగలరు.

**– పి. రామమోహన్‌రెడ్డి**
నల్లగొండ

*(...3వ పేజీ తరువాయి)*

*రైల్వే బడ్జెట్ విషయానికొస్తే పాప్యులిస్టు పథకాల మాట విన్నాం కాని పాప్యులిస్టు బడ్జెట్ మాట వినటం ఇదే మొదటిసారి. బడ్జెట్ సీజన్ వస్తూందంటే బెదిరిపోయే సామాన్య ప్రజలు, ఈసారి చార్జీలు తగ్గించటం, అనేక సౌకర్యాలు కల్పించటం, పారిశ్రామికవేత్తలకు కూడా రాయితీలు, వరుసగా నాలుగో సంవత్సరం ఛార్జీలు పెంచకుండా బడ్జెట్ ప్రవేశపెట్టడం గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డులోకెక్కాల్సిన పరిణామం. లాలూ అభినందనీయులు. నేనే ప్రధానినవుతానని అపుడపుడంటూ వస్తున్నారు. అందుకు సోపానాలు నిర్మించుకొంటున్నారా? అనూహ్యంగా రు. 20 వేల కోట్లు లాభాలకు అసలు సిసలు కారకులైన కార్మికుల గురించి ఏమీ మాట్లాడకపోవటం, రైలు ప్రమాదాలు, రోడ్డు రవాణాతో పోటీ, రైల్వే ప్రమాదాల నుంచి రక్షణ, గత బడ్జెట్‌లో హామీ ఇచ్చిన గాంగ్‌మెన్లకు సౌకర్యాలు, ఉద్యోగాల ఖాళీల భర్తీ, షష్టిపూర్తి చేసుకొన్న, లేదా శతవసంతాలు చూచిన వంతెనలు, తాతలనాడు వేసిన రైలుపట్టాలు – పొంచిఉన్న ఇన్ని ప్రమాదాల ఊసెత్తకుండా బడ్జెట్ ప్రవేశపెట్టడం అసలు సమస్యలనుంచి పలాయనం చిత్తగించడమే.* ◆

### రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

- సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

**– సర్క్యులేషన్ మేనేజర్**
9949391028

### *గమనిక*

*కేంద్ర బడ్జెట్ మీద స్పందన కొరకు ఈ సంచిక మామూలుగా వెలువడవలసిన దానికన్న నాలుగురోజులు ఆలస్యంగా వెలువడుతున్నది. వచ్చే సంచిక నుంచి యథాతథంగా మొదటి తేదీకల్లా మీకు చేరుతుంది.*

*– సం.*

# కొత్తపుస్తకాలు










- **తెలంగాణ చరిత్ర పునర్నిర్మాణం** - సన్నాహక సమావేశ పత్రాలు - తెలంగాణ హిస్టరీ సొసైటీ ప్రచురణ - 78 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : పరవస్తు లోకేశ్వర్, 12-2-709/5/1/సి/1, నవోదయ కాలనీ, మెహదీపట్నం, హైదరాబాద్ - 500 026. సహచర, దిశ, నవోదయ పుస్తక కేంద్రాలలో.
- **ఎరుపెక్కిన పత్తిపూలు** - పత్తి శివప్రసాద్ - స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ - 100 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : పత్తి శివప్రసాద్, 4-3-86, సోమవారపేట వీధి, నిర్మల్ - 504 106. ఆదిలాబాద్ జిల్లా.
- **ఉగ్గుపాలు** - చిన్న పిల్లల కథలు - భూపాల్ - స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ - 115 పేజీలు, 1/8 డెమీ, రు. 50.
- **అభివ్యక్తి** - కవితా విమర్శ - గుడిపాటి - స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ - 127 పేజీలు, 1/8 డెమీ, రు. 50.
- **నాలుగో కన్ను** - జూలూరు గౌరీశంకర్ - స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ - 36 పేజీలు, 1/8 డెమీ, రు. 10.
- **గుక్క** - కాసుల ప్రతాపరెడ్డి కవిత్వం - స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ - 33 పేజీలు, 1/8 డెమీ, రు. 15.
- **ఇదీ మన తెలుగు** - డా. ద్వా.నా. శాస్త్రి - చుక్కా రామయ్య విద్యాపీఠం ప్రచురణ - 53 పేజీలు, 1/8 డెమీ, రు. 25.
- **చరిత్ర ఖజానా** - అలనాటి నాణేల అంతరంగం - డా. డి. రాజారెడ్డి - చుక్కా రామయ్య విద్యాపీఠం ప్రచురణ - 95 పేజీలు, 1/8 డెమీ, రు. 50.
- **చదువుల సారం** - విద్యా వ్యాసాలు - ఎ. రాజాహుస్సేన్ - చుక్కా రామయ్య విద్యాపీఠం ప్రచురణ - 164 పేజీలు, 1/8 డెమీ, రు. 75.
- **ఎరుక** - సాహిత్య వ్యాసాలు - పెన్నా శివరామకృష్ణ - చుక్కా రామయ్య విద్యాపీఠం ప్రచురణ - 120 పేజీలు, 1/8 డెమీ, రు. 50.

ఈ ఎనిమిది పుస్తక ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ - 44, అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు.









# కేంద్ర బడ్జెట్ వ్యవసాయరంగాన్ని గట్టెక్కిస్తుందా?

**- వి. హనుమంతరావు**

ఈ వ్యాసాన్ని మీరు చదివేనాటికి కేంద్ర బడ్జెట్ (2007-08) ప్రవేశపెట్టడం జరిగిపోయే ఉంటుంది. వ్యవసాయం ప్రాముఖ్యత గురించి ప్రధాని మొదలుకొని వ్యవసాయార్థిక శాస్త్రవేత్తలు, ప్రణాళికా సంఘం, రైతుసంఘాలు, రాజకీయ పార్టీలు పలుమార్లు ప్రస్తావించటం, స్వామినాథన్ కమీషన్ నివేదికపై దేశవ్యాపితంగా జరిగిన చర్చ, పత్రికల్లో విస్తృతంగా సంపాదకీయాలు, వ్యాసాల ప్రచురణ, ఈ నేపథ్యంలో బడ్జెట్ ప్రవేశపెట్టడంతో, అందరి దృష్టి వ్యవసాయంపై బడ్జెట్‌లో కేటాయింపులు, విధాన ప్రకటనల కోసం ప్రజలంతా ఆశగా, ఆతృతతో ఎదురు చూస్తారు. 1991లో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టిన నాటి నుంచి వ్యవసాయ రంగం సంక్షోభంలో కొట్టుమిట్టులాడుతుంది కాబట్టి, పదహారు సంవత్సరాల సంక్షోభాన్ని ఒక్క బడ్జెట్ ప్రతిపాదనలతో పరిష్కరించేస్తుందని ఎవరూ ఆశించరు. కాని సరైన దిశలో ముందడుగు వేసిందా అని చూడటం అత్యాశ కానేరదు. అందులోనూ ఒకపక్క బహుళజాతి సంస్థలు, రెండో పక్క కార్పొరేట్లు వ్యవసాయ రంగాన్ని కబ్జా చేసుకొని, రైతాంగాన్ని, ముఖ్యంగా చిన్న, సన్నకారు రైతాంగాన్ని ఈ రంగం నుంచే నిష్క్రమింప చేయాలని వారు చేస్తున్న ప్రయత్నాలకు ప్రత్యక్షంగా, పరోక్షంగా కేంద్రం, రాష్ట్ర ప్రయత్నాలకు వత్తాసు పలుకుతున్న నేపథ్యంలో, ఈ బడ్జెట్‌లో అలాంటి రైతులకు రక్షణ లభిస్తుందా అని ఎదురుచూడడం సహజం అయితే, ఇప్పుడు చూస్తున్న సంక్షోభం పూర్వాపరాలు, స్వరూప స్వభావం తెలుసుకొని ఉంటే, బడ్జెట్ ప్రతిపాదనలు ఎంత మేరకు సంక్షోభాన్ని పరిష్కరిస్తాయనే విషయం తెలుసుకోవడానికి వీలవుతుంది. ఆ నేపథ్యాన్ని అందచేయటమే ఈ వ్యాసం లక్ష్యం.

దేశ ఆర్థిక వ్యవస్థ పుంజుకోవాలంటే వ్యవసాయభివృద్ధే పునాది. సంస్కరణలు ప్రవేశపెట్టిన ఫలితంగా ఈ పునాదులు కదలిపోయాయి. 1980వ దశకంలో మొత్తం తిండి గింజలు పెరుగుదల 3.54 శాతం, ఇతర వ్యవసాయ పంటలు 4.84 శాతం పెరిగితే, సంస్కరణలు అమలులోకి వచ్చిన 1990వ దశకంలో 1.66 శాతానికి, 2.36 శాతానికి పడిపోయాయి. తిండి గింజలు ఉత్పాదకత కూడా 80వ దశకంలో 548 కిలోలు పెరగగా, 90వ దశకంలో 314 కిలోలకు తగ్గి, 2000-2004 మధ్య నాలుగేళ్ల కాలంలో 61 కిలోలు మాత్రమే పెరిగింది. ప్రపంచ సగటు ఉత్పాదకత కన్నా, దేశంలో ఉత్పాదకత తక్కువగా ఉంది. నానాటికి తీసికట్టు నాగాంభొట్లుగా వ్యవసాయం క్షీణిస్తుందని పై గణాంకాలు తెలియచేస్తున్నాయి.

ఈ రంగాన్ని పట్టిపీడిస్తున్న సమస్యలు ఈ నాటికివి కావు. సంస్కరణలు ప్రవేశపెట్టినప్పటి నుంచి వారసత్వంగా వస్తున్నాయి. 1. ప్రభుత్వ పెట్టుబడులు తగ్గటం, 2. ఉత్పత్తి, ఉత్పాదకత తగ్గటం, 3. సహజ వనరులైన భూమి, నీరు సక్రమంగా వినియోగించేయక పోవటం, 4. గిట్టుబాటు ధర లభించక పోవటం. ఈ సమస్యలనే నేషనల్ సాంపిల్ సర్వే మరో కోణం నుంచి వ్యాఖ్యానించింది. 'సామాన్య రైతు కుటుంబం సగటు వార్షిక ఆదాయం రు. 6,500కు మించి అందకపోవడానికి - అతని సామాజిక స్థితికి పొంతన లేని సాంకేతిక పరిజ్ఞానాలు కూడా ముఖ్య కారణం. ఇదే విషయాన్ని ప్రొఫెసర్ స్వామినాథన్ కూడా చెప్పారు. దేశ జనాభా పెరుగుదల రేటు 1.9 శాతం కాగా, ఆహారధాన్యాల ఉత్పత్తి రేటు కేవలం 1.5 శాతంగా ఉండటం వెనుక ప్రభుత్వ విధానాలతో పాటు సాంకేతిక పరిజ్ఞాన లోపం కూడా ఉందని గమనించాలి. మన దేశంలో కేవలం 0.9 శాతం మంది రైతులు మాత్రమే నిపుణుల ద్వారా సలహా పొంది వ్యవసాయం చేస్తున్నారు.

వ్యవసాయ సంక్షోభం అంటే కేవలం పెట్టుబడులు పెట్టకపోవటం, పంటలు తగ్గడమేకాదు. ఈ సంక్షోభం రైతుల నిత్య జీవనం మీద చూపిస్తున్న ప్రతికూల ప్రభావం, అంతకన్నా ముఖ్యంగా రైతుల మనోభావం మీద దెబ్బతీయటం. నేషనల్ సాంపిల్ సర్వే ప్రకారం 40 శాతం మంది రైతులు వ్యవసాయం కొనసాగించడానికి ఇష్టపడటం లేదనే తేలింది. వ్యవసాయం లాభసాటిగా ఉండకపోగా భుక్తికూడా పెట్టకపోతే, వాళ్లే బతికుంటే బలుసాకైనా తిని బతకొచ్చన్నట్లు వ్యవసాయం నుంచి నిష్క్రమిస్తే, ఆ స్థానాన్ని బహుళజాతి సంస్థలు, కార్పొరేట్ సంస్థలు ఆక్రమించవచ్చునని ఆ వర్గాలు కాసుకొని ఎదురు చూస్తున్నాయి. ఇది రెండు పరిణామాలకు దారి తీస్తుంది. ఒకటి తిండి గింజల పంటల నుంచి పళ్లు, ఫలాలు, పువ్వులు పెంచి విదేశాలకు ఎగుమతి చేసి లాభాలు పోగేసుకోవచ్చు. తిండి గింజల పంట తగ్గితే వాటిని అభివృద్ధి చెందిన దేశాల నుంచి దిగుమతి చేసుకోవాల్సిన పరిస్థితికి, అంటే ఒక నాటి పి.ఎల్. 480 కింద దిగుమతులు చేసుకోవాల్సిన పరిస్థితికి దేశం దిగజారుతుంది. అమెరికా పంట పండుతుంది. 1991లో ప్రపంచ బ్యాంకు ఈ పద్ధతిని ప్రవేశపెట్టాలని భారతదేశానికి సలహా ఇచ్చింది. ఈ విధానాన్ని మన పాలకులు తు.చ. తప్పకుండా అమలు చేయడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. ఇటీవల ప్రధాని రాష్ట్రానికి వచ్చినప్పుడు రాష్ట్ర ముఖ్యమంత్రి వ్యవసాయం మీద ఆధారపడే రైతుల సంఖ్యను తగ్గించాలని సలహా ఇచ్చారు కూడా.

ఇక్కడే కేంద్ర సైన్స్ శాఖ మంత్రి కపిల్ సిబాల్ ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన సైన్స్ కాంగ్రెస్‌లో చెప్పిన నాలుగు మాటలు ఉటంకించటం సమయోచితంగా ఉంటుంది. "దేశాల సరిహద్దులను చెరిపేసి, అన్ని దేశాల మీద వారి అధికారాన్ని ప్రతిష్ఠించి, వారి ప్రయోజనాలను విస్తరించుకోవటం ప్రపంచీకరణ లక్ష్యం. ప్రపంచ మార్కెట్లపై పెత్తనం సాగించటం వారి ఉద్దేశం. ప్రపంచ వాణిజ్య సంస్థ ఫలితంగా భారతీయ రైతులు వారి ఎగుమతులకు సరైన ధరలను రాబట్టుకోలేక పోతున్నారు. నూనె గింజలు ఉత్పత్తిలో సుమారుగా స్వయం పోషకత్వం సాధించుకోనున్న తరుణంలో చవగ్గా వంట నూనెల దిగుమతులు అనుమతించటం జరిగింది. 1996-97 నుంచి 2003-04 మధ్యకాలంలో వ్యవసాయ దిగుమతులు 375 శాతం పెరిగాయి. వాటి విలువ 300 శాతం పెరిగింది. ఇలాంటి దిగుమతుల

విలువ జిడిపిలో శాతంగా ఆదే కాలంలో మూడు శాతం కన్నా తక్కువ స్థాయి నుంచి 4.34 శాతానికి పెరిగింది". (హిందూ, 4 జనవరి 2007).

"ఇలా పళ్లో, పువ్వులు పండించడానికి పునుకొంటే, 15-20 రెట్లు రసాయనిక ఎరువులు కావాల్సి వస్తాయని, కనీసం పదిరెట్లు నీరు భూగర్భం నుంచి తోడాల్సి వస్తుంది" (ప్రముఖ వ్యవసాయ కాలమిస్టు దేవేందర శర్మ). ఆయన ఇంకో విషయం చెప్పారు. ఉద్యానవన ఉత్పత్తుల వ్యాపారుల అవసరాల కోసం 1,50,000 కోట్లు పెట్టుబడి పెట్టడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉంది కాని రైతులను రుణాల ఊబినుంచి బయటపడడానికి ఇష్టపడకపోవటం ప్రభుత్వ రైతు వ్యతిరేక విధానాలకు ఒక దృష్టాంతం.

నేటి దుస్థితికి స్వామినాథన్ కమీషన్ ఐదు కారణాలను గుర్తించింది. అసంపూర్తిగా అమలు చేసిన భూ సంస్కరణలు, సాగునీటి లభ్యత, నాణ్యత, ప్రస్తుత వ్యవసాయ సాంకేతిక శక్తి సామర్థ్యాల వినియోగం గరిష్ట స్థాయికి చేరడం, వ్యవస్థాగత రుణాలు అందుబాటు, గిట్టుబాటు ధరలు అందించగల మార్కెటింగ వ్యవస్థ, మరొక ముఖ్యమైన అవరోధం రాజ్యాంగంలోనే ఉన్నది. రాజ్యాంగం ప్రకారం వ్యవసాయం రాష్ట్రాల బాధ్యత. కాని ఈ రంగానికి సంబంధించిన ప్రతి విషయం - ఎంత పంట పండించాలి, ఎరువులు, పురుగు మందులు, ఉత్పత్తి కనీస ధర, ఉత్పత్తి పంపిణీ, ఫుడ్ కార్పొరేషన్ - కేంద్రం నిర్దేశిస్తుంది. కాగా పెత్తనం కేంద్రానిది, బాధ్యత రాష్ట్రాలది.

సగటు రైతు జీవితం ఎంత దయనీయంగా ఉందో చూడండి. వస్త్ర పరిశ్రమలో పని చేసే కార్మికుని జీతం, బోనస్ తదితర సౌకర్యాలు కలిపి ఏడాదికి రు. 60,000 సంపాదిస్తాడు. కార్ల పరిశ్రమలో కార్మికుని జీతం అంతకు రెట్టింపు ఉంది. అంత ఆదాయాన్ని చిన్న, సన్నకారు రైతు సంపాదించాలంటే, అతని భూమి వైశాల్యం ప్రస్తుతం మీద నాలుగు రెట్లు పెరగాలి. పాలకులు స్వయం ఉపాధిని ప్రోత్సహిస్తామని, అటువంటి వారికి సహాయం అందిస్తామని ప్రకటనలు చేస్తుంటారు. రైతులు స్వయం ఉపాధి అలవంబిస్తుంటే వారికి సాయం అందించటం పోయి, కార్మికులకు ఉపాధి, జీతాలు, చట్ట బద్ధంగా గారంటీ ఇవ్వటం. ఇది ఏం సమానత్వం? ఇది కార్మికులకు అధిక ఆదాయం సంపాదించడాన్ని వ్యతిరేకించటం కాదు, రైతుకు అంత ఆదాయం లభించాలనేదే దాని వాదన.

ఒక వేళ తిండి గింజలు పుష్కలంగా లభ్యమయ్యాయనే అనుకొందాం. సమస్య స్వపరిష్కారమై పోతుందా? మనం తినే తిండిలో పోషకాహార విలువలుండాలి. పాలు, కూరగాయల వంటి వాటిలో పోషకాహార విలువలు లభిస్తాయి. 1997 నేషనల్ సాంపుల్ సర్వే ప్రకారమే అప్పటికీ, ఇప్పటికీ ఆ పోషకాహారం లభ్యం కావటం లేదు. శరీరం అలసిపోయేలా పని చేసేవారికి 2400 కాలరీలు, ఇతరులకు 2100 కాలరీల పోషకాహార విలువలున్న ఆహారం తినాలి. అలాంటి తిండి లభించాలంటే మరో నాలుగు కోట్ల టన్నుల ఆహార ధాన్యాలు అవసరమవుతాయి. కాని ఇప్పుడే 50 లక్షల టన్నులు దిగుమతి చేసుకొంటే గాని రోజు గడిచే పరిస్థితి లేదు.

ఇదేదో రాబోయే బడ్జెట్ (2007-08) ప్రవేశపెట్టిన నాటికి దేశంలో వ్యవసాయ రంగం ఉన్న పరిస్థితి చిత్రణ అనుకొంటే పొరపాటే. గత పదిహేను సంవత్సరాలుగా ఇదే పరిస్థితి. ఉదాహరణకు 2006-07 బడ్జెట్ ప్రవేశ పెట్టినప్పుడు నేను రాసిన విశ్లేషణను చూడండి. "పిట్ట కొంచెం కూత ఘనం అనేది సామెత. కాని 2006-07 బడ్జెట్‌ను ప్రవేశ పెడుతూ చిదంబరం చేసిన ఉపన్యాసం విన్న తర్వాత కూతఘనం, పిట్ట కొంచెం" అని తిరగ రాయాలనిపిస్తుంది. బడ్జెట్‌లో ఎలాంటి కేటాయింపులు చేస్తారో అని చూడబోతే పేలని టపాకాయలా తుస్సుమంది. ఈ రంగం విషయంలో హర్షించతగినదొకటే ఒకటి. రైతులకు ఇచ్చే రుణాల మీద వడ్డీ తొమ్మిది శాతం నుంచి ఏడు శాతానికి తగ్గించడం. కార్లు, స్కూటర్లు కొనుక్కొనేవారికి అయిదు శాతం వడ్డికిచ్చి, రైతుల నించి ఏడు శాతం వసూలు చేయడాన్నేమనాలి? నేషనల్ సాంపుల్ సర్వే ప్రకరమే అలాంటి రైతులు 27 శాతం మాత్రమే. 51 శాతం రైతులకు బ్యాంకులు రుణాలు ఇవ్వటం లేదు. అంటే ప్రతి నలుగురు రైతుల్లో ఒక్కరికి వడ్డీ తగ్గింపు వర్తిస్తుంది. వచ్చే ఆర్థిక సంవత్సరంలో ప్రణాళిక కేటాయింపు రు. 2,54,041 కోట్లలో వ్యవసాయం, తత్సంబంధిత రంగాల వాటా రు. 7585 కోట్లు. కేవలం వ్యవసాయం మాత్రమే తీసుకొని చూస్తే లావుగా ఉన్నవాడు, సన్న బడిపోయినట్లుంటింది. ప్రస్తుత ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన మొదటి సంవత్సరంలో స్థూల జాతీయాదాయంలో భాగంగా అంతకు ముందు ప్రభుత్వం 2003-04లో ఎంత శాతం పెట్టుబడి పెట్టిందో, 2004-05లో కుడా అంతే; అంటే సుమారుగా జిడిపిలో 0.5 శాతం. వ్యవసాయానికి పెద్దపీట వేస్తామన్నారు. ఇదేనా? రాబోయే ఆర్థిక సంవత్సరంలో రు. 1,75,000 కోట్లు రుణాలివ్వటం జరుగుతుందని మరో ఆకర్షణీయ ప్రకటన.. ఈ రుణం ప్రభుత్వం తన బొక్కసం నుంచి ఇస్తుందా ఏమిటి? బ్యాంకులిస్తున్నాయి. బడ్జెట్‌లో వ్యవసాయానికి చేసిన కేటాయింపు మొత్తం, బడ్జెట్‌లో కేవలం ఒక్క శాతమేనని అద్వాని విమర్శించారు. గ్రామీణ జనాభాలో 70 శాతం మంది ఆధారపడే వ్యవసాయానికి, స్థూల జాతీయాదాయానికి 20 శాతం సమకూర్చే వ్యవసాయానికి ఒక్క శాతం కేటాయింపా? చెరువుల మరమ్మత్తుల కోసం రు. 4481 కోట్ల ఖర్చువుతుందని, ఈ ఖర్చుతో 20 వేల చెరువులు మరమ్మతు అవుతాయని అన్నారు. ఇది కేవలం పథకం మాత్రమే. ఒక్క మన రాష్ట్రంలోనే 70 వేల చెరువులున్నాయి. ఇదొక రంగుల కల మాత్రమే."

ఇదీ గత బడ్జెట్ నేపథ్యం. దీనిని గమనంలోకి తీసుకొని రేపు ప్రవేశపెట్టబోయే బడ్జెట్ వ్యవసాయానికి ఏమి వొరగబెడతారో చూసుకోవచ్చు.

### వ్యవసాయంలో పెట్టుబడులు

గేదెకు మేత వేస్తే పాలు ఇస్తుంది. వ్యవసాయంలో పెట్టుబడి పెడితేనే అభివృద్ధి సాధ్యమవుతుంది. ఈ రంగంలో ప్రభుత్వ పెట్టుబడులను పరిశీలించినపుడు వ్యవసాయ రంగంలో పెట్టిన మొత్తం పెట్టుబడిలో ప్రభుత్వ పెట్టుబడుల శాతం 1993-94లో 32.3 శాతం ఉంటే 2003-04 నాటికి 23.6 శాతానికి తగ్గిపోయింది. పట్టిక - 1 చూడవచ్చు.

వ్యవసాయం మీద ప్రభుత్వ ఖర్చు అన్నప్పుడు ఆ రంగానికి వివిధ శాఖల ద్వారా ఇస్తున్న సబ్సిడీలను కూడా గమనంలోకి తీసుకోవాల్సి ఉంటుంది. ప్రస్తుత ధరల్లో ఆ సబ్సిడీలు ఏ మేరకు ఉన్నాయో, పట్టిక - 2 తెలియచేస్తుంది.

ప్రభుత్వం వ్యవసాయానికి ఇస్తున్న సబ్సిడీ బాగానే ఉందే, ప్రతి సంవత్సరం పెరుగుతుందే అని ఎవరికైనా అనిపించవచ్చు, కాని

| పట్టిక - 1<br>వ్యవసాయం, తత్సంబంధిత రంగాల్లో<br>ప్రభుత్వ, ప్రైవేట్ పెట్టుబడులు<br>(కోట్లు రు.) (స్థిర ధరలు) | | | |
|---|---|---|---|
| సంవత్సరము | మొత్తం పెట్టుబడి | ప్రభుత్వ పెట్టుబడి | ప్రైవేట్ పెట్టుబడి |
| 1993-94 | 15249 | 4918 | 10331 |
| 1994-95 | 16785 | 5369 | 11416 |
| 1995-96 | 17689 | 5322 | 12367 |
| 1996-97 | 18326 | 5150 | 13176 |
| 1997-98 | 18294 | 4503 | 13791 |
| 1998-99 | 17470 | 4444 | 13026 |
| 1999-00 | 20024 | 4756 | 15268 |
| 2000-01 | 19069 | 4435 | 15374 |
| 2001-02 | 20360 | 5488 | 14872 |
| 2002-03 | 21500 | 4760 | 16740 |
| 2003-04 (త్వరతగతి అంచనా) | 24186 | 5899 | 18487 |
| మూలం :- అగ్రికల్చరల్ స్టాటిస్టిక్స్ ఎట్ ఎ గ్లాన్స్ 2005 | | | |

ఎరువులకిస్తున్న సబ్సిడీ రైతులకివ్వటం లేదు, ఎరువుల కర్మాగారాలకు వెళుతుంది. అలాగే వ్యవసాయానికిస్తున్న మొత్తం సబ్సిడీ, కొద్దిమంది ఎగుమతి దారులకిస్తున్న సబ్సిడి కన్నా తక్కువే. ఇంత సబ్సిడీ ఇచ్చినా, పండించే రైతుకు గిట్టుబాటు ధర లభించడం లేదన డాక్టర్ స్వామినాథన్ అంటున్నారు.

### వ్యవసాయం - ఉపాధి

ఈ రంగాన్ని మరో కోణం నుంచి పరిశీలించవచ్చు. ఏ దేశంలోనైనా ఉపాధి కోసం వ్యవసాయం మీద ఆధారపడడం తగ్గి

| పట్టిక - 2<br>వ్యవసాయ సబ్సిడీలు<br>(కోట్లు రు.) | | | | | |
|---|---|---|---|---|---|
| సంవత్సరం | ఎరువులు | విద్యుచ్ఛక్తి | నీటి పారుదల | ఇతరాలు | మొత్తం సబ్సిడీ |
| 1993-94 | 4562 | 2400 | 5872 | 1235 | 14069 |
| 1994-95 | 5769 | 2338 | 6772 | 1246 | 16125 |
| 1995-96 | 6735 | 1977 | 7931 | 1034 | 17677 |
| 1996-97 | 7578 | 8356 | 4937 | 3819 | 26050 |
| 1997-98 | 9918 | 4937 | 10318 | 983 | 26156 |
| 1998-99 | 11596 | 3819 | 11827 | 1182 | 28424 |
| 1999-00 | 13244 | 4276 | 11487 | 1937 | 30944 |
| 2000-01 | 13800 | 6056 | 13756 | 835 | 34447 |
| 2001-02 | 12595 | 9342 | 13309 | 978 | 36224 |
| 2002-03 | 11015 | 7354 | 15401 | 1259 | 35029 |
| మూలం : అగ్రికల్చరల్ స్టాటిస్టిక్స్ ఎట్ ఏ గ్లాన్స్, 2005 | | | | | |

తయారీ రంగం మీద ఆధారపడడం అభివృద్ధి లక్షణం. కాని మన దేశంలో వ్యవసాయం, పరిశ్రమల రంగాలను వదిలిపెట్టి సేవా రంగాన్ని అభివృద్ధి చేయటం మీద ప్రభుత్వం కేంద్రీకరించటం ఒక నేరమైతే, కనీసం వ్యవసాయం నుంచి పారిశ్రామిక రంగం మీదనైనా ఆధారపడటం జరగలేదు. అందువల్ల వ్యవసాయాధార కార్మికుల తలసరి ఉత్పత్తి తగ్గిపోవటం, అలాగే తలసరి ఆదాయం తగ్గటం జరిగింది. కాగా, జిడిపిలో వ్యవసాయం వాటా ఉపాధి శాతం తగ్గింది.

| జిడిపిలో వ్యవసాయం శాతం, ఉపాధి శాతం<br>(1993-94 ధరల ప్రకారం) | | |
|---|---|---|
| | జిడిపిలో వ్యవసాయం శాతం | ఉపాధి కల్పనలో వ్యవసాయం శాతం |
| 1972-73 | 44.8 | 73.9 |
| 1993-94 | 33.5 | 63.9 |
| 1999-00 | 27.6 | 60.2 |

వ్యవసాయేతర కార్మికులతో పోల్చి చూస్తే వ్యవసాయ కార్మికులు పేద రైతుల ఉత్పాదక శక్తి నాలుగోవంతు మాత్రమే. దీనర్థం ఈ కార్మికులందరూ సోమరిపోతులని కాదు, వారికి ఉపాధి లభించే రోజులు చాలా తక్కువ. ఆ కారణంగా వారి ఉత్పాదకత తక్కువగానే ఉంటుంది. వ్యవసాయ కార్మికులు, పేద రైతులు వ్యవసాయాన్నే అంటిపెట్టుకొని ఉండాల్సి వస్తుంది. ఉన్న పంట భూమి విస్తీర్ణం రబ్బరులాగ సాగే అవకాశం లేదు. ఉన్న భూమి మీదే వారంతా సర్దుకోవాల్సి రావటంతో కమతాలు మరీ చిన్నవైపోతున్నాయి. దేశంలో కమతాల సంఖ్య 1960-61 లో 510 లక్షలుండగా, 1991-92 నాటికి 930 లక్షలకు పెరిగాయి. అదే సమయంలో వారు సాగు చేసే భూమి విస్తీర్ణం 1330 హెక్టార్లనుంచి 1250 లక్షల హెక్టార్లకు తగ్గింది. కమతం సైజు 2.63 హెక్టార్ల నుండి 1.34 హెక్టార్లకు పడిపోయింది. అంత చిన్న కమతం మీద కుటుంబం అంతా బతకటం కష్టం కాబట్టి వారు పేదరికపు రేఖ కిందకు జారిపోతున్నారు. తూర్పు ఆసియా దేశాల్లో ఇలా జరక్కపోగా భూమి యజమాన్యంలో సమతుల్యత సాధించటం కారణంగా ఆ దేశాల ఆర్థిక పరిస్థితి మన కన్నా ఎంతో మెరుగ్గా ఉంది. తమకున్న చిన్న, సన్నకారు కమతాల మీద బతుకు బండి నడవటం కష్టం కాబట్టి, పెద్ద రైతుల వద్ద కౌలుకు తీసుకోవటం జరిగింది. అయితే మూంజువాణీ కౌలు పద్ధతి విస్తరించడంతో ప్రభుత్వ రికార్డుల్లో కౌలుకిచ్చిన భూమి విస్తీర్ణం 1953-54లో మొత్తం పంట భూమి 20 శాతం ఉంటే, 1992-93లో ఎనిమిది శాతానికి తగ్గిపోయింది. ఇప్పుడింకా తగ్గిపోయివుంటుంది. వ్యవసాయ వ్యవస్థ ఇలా ఉండగా, ఉన్న భూమి మీద బతుకు బండి లాగించలేక అవస్థ పడుతూంటే, అర్ధాకలితో కాలం గడుపుతుంటే మీరు పువ్వులు, పండ్లు కూరగాయలు పండించి, ఎగుమతి చేసి ఆదాయం పెంచుకోండంటూ పాలకులు పార్టీలు చెప్పటం చూస్తుంటే, మోకాలు నొప్పికి తలకాయ వైద్యం చేసినట్లుంది. పాలకుల దృష్టిలో రైతులంటే ఎవరో సులువుగానే గ్రహించవచ్చు.

### ఎగుమతులు - దిగుమతులు

వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతి, దిగుమతుల శాతం పడిపోవటం గుర్తించాల్సిన మరో తిరోగమన పరిణామం. ఆర్థిక సంస్కరణలు ప్రవేశ

# ఉట్టి కెగుర లేనమ్మ స్వర్గానికి నిచ్చెనలు వేసిందట

**- వి. హనుమంతరావు**

"అది బలుపు కాదు, వాపు" "ఉట్టి కెగుర లేనమ్మ స్వర్గానికి నిచ్చెనలు వేసిందట". 2007-08 రాష్ట్ర వార్షిక బడ్జెట్‌ను చూచినపుడు ఈ సామెతలు గుర్తుకు వచ్చాయి, మీకూ వచ్చే ఉంటాయి.

80 వేల కోట్ల రూపాయల బడ్జెట్ అంటే, 30 వేల కోట్ల రూపాయల ప్రణాళిక అంటే జనమంతా కళ్లు తిరిగి పడిపోతారనో, లేదా ఉబ్బితబ్బిబ్బయి పోతారనో ప్రభుత్వం అనుకొందేమో తెలియదు. 1956లో మన రాష్ట్రం ఏర్పడినప్పుడు మన బడ్జెట్ కేవలం రు. 90 కోట్లు మాత్రమే. అలా పోల్చి చూచినప్పుడు ఇది నిజంగా లాంగ్ జంపే. కాని 2005-06లో సుమారు 60 వేల కోట్లు బడ్జెట్‌లో కేటాయిస్తే పదివేల కోట్ల రూపాయలు ఖర్చు చేయక, చేయలేని ప్రభుత్వం ఇప్పుడు 80 వేల కోట్ల బడ్జెట్ సమర్పించిందంటే, ఇది జరిగే పనేనా అని అనిపించటం లేదూ? 2005-06 కాగ్ నివేదిక చూస్తే సుమారుగా నలభై పద్దుల్లో, ఏ పది పద్దులో తప్ప, మిగతా పద్దులన్నింటిలోనూ కోతలే. ఇంకో విషయం, ఈ భారీ కేటాయింపును ద్రవ్యోల్బణం తారాజువ్వలా పైకి ఎగసిపోతున్న నేపథ్యంలో విశ్లేషించుకొంటే రబ్బరు బుడగ గాలి తీసేసినట్లవుతుంది.

ప్రతీ సంవత్సరం బడ్జెట్ ప్రవేశ పెట్టినప్పుడల్లా ఇది అంకెల గారడీ అని ప్రతిపక్షాలు విమర్శిస్తూ వచ్చాయి. ప్రతిపక్షాలేమిటి, ఖుద్దున వైఎస్ ప్రతిపక్షంలో కూర్చొన్నప్పుడు అదే విమర్శ చేస్తూ వచ్చారు. ఈ విమర్శ చాలా రోటీన్‌గా నాకనిపించేది. కాని ఈ సారి మాత్రం ఈ బడ్జెట్‌కు ఆ విమర్శ అక్షరాలా నప్పుతుంది. అనేక రంగాలకు ముఖ్యంగా సామాజిక, సంక్షేమ నీటిపారుదల రంగాలకు భారీ కేటాయింపులు చేసి, గత ఏడాది కన్నా గణనీయంగా కేటాయింపులు పెంచి సామాన్యుణ్ని బిత్తర పరిచే ప్రయత్నం కావాలనే జరిగిందనేది కేటాయింపు గణాంకాలు స్పష్టం చేస్తున్నాయి. నీటి పారుదల రంగానికి రు. 13 వేల కోట్లు, ప్రణాళికకు 30 వేల కోట్లు, విద్య, వైద్య రంగాలకు రు. 2726 కోట్లు కేటాయించామని ప్రకటించటంలో ప్రచార పటాటోపం కొట్టోచ్చినట్లు కనపడుతుంది. కాబట్టి దాని సంగతేమిటో వివరంగా చూద్దాం.

నీటి పారుదల రంగం కేటాయింపు 13 వేల కోట్లకు పెంచడాన్ని గురించి డప్పుమోత గట్టిగా వినపడుతోంది. ప్రస్తుత సంవత్సరం, కేటాయింపుతో పోలిస్తే రాబోయే సంవత్సరం ప్రణాళికలో మూడు వేల కోట్లు అదనంగా ఖర్చు చేయనున్నామని, 2005-06 తో పోలిస్తే రెట్టింపు కేటాయింపు జరిగిందని గణాంకాలు చెబుతున్నాయి.

కాని ఆ గణాంకాలే అసలు విషయాన్ని బహిర్గతం చేస్తున్నాయి. 2006-07 ప్రణాళికలో మొత్తం కేటాయింపులో 51 శాతం ఈ శాఖకు కేటాయించగా (స.అం.), 2007-08లో ఈ శాతం 43కు దిగజారిపోయింది. 2005-06తో పోల్చి చూసుకొన్నా 0.5 శాతం నుంచి 0.43 శాతానికి తగ్గింది. అంకెల్లో చూస్తే రు. 6672 కోట్ల నుంచి 13 వేల కోట్లకు పెరిగి నోట్లు కనుపిస్తున్నా, ఆచరణలో తక్కువ ఖర్చే అవుతోంది.

ఇదే రంగానికి రెవెన్యూ పద్దు కింద ఖర్చు లెక్కలు చూస్తే, అంటే పరిపాలనా సంబంధమైన ఖర్చు లెక్కలు చూస్తే 2004-05లో మొత్తం ఖర్చులో ఈ పద్దు కింద పెరిగింది. అంటే పరిపాలన ఖర్చు పెరుగుతుంది; ఆస్తుల సృష్టికి ఖర్చు తగ్గుతుంది. అయితే, ఒక విషయం అంగీకరించాలి. పెట్టుబడి పద్దు కింద ఖర్చు మాత్రం అంకెల్లో చూస్తే, మొత్తం పెట్టుబడి ఖర్చులో సింహభాగం నీటి పారుదల రంగానికే ఖర్చు కాబోతుంది. చెప్పొచ్చేదేమంటే బడ్జెట్ కేటాయింపులను పైపైన చూచి సంతృప్తి చెందకుండా కాస్త వెనకాముందూ ఆలోచించుకోవాలి.

రెవెన్యూ లోటు భారిగా తగ్గినందుకు సంతోషించాలి. అయితే, 2008-09 ఆఖరు నాటికి ప్రపంచ బ్యాంకు ఆదేశం మేరకు

---

పెట్టిన తర్వాత మొత్తం ఎగుమతుల్లో వ్యవసాయ ఉత్పత్తుల శాతం 1990-91లో 18.49 శాతం నుంచి 2003-04 (తాత్కాలిక) లో 12.21 శాతానికి దిగజారగా, దిగుమతులు 4.86 శాతం నుంచి 5.85 శాతానికి పెరిగాయి. దిగుమతులు పెరగటానికి వంట నూనెల దిగుమతి ఒక ముఖ్య కారణం. ఇప్పుడు 50 లక్షల టన్నుల గోధుమలు దిగుమతి చేసుకోవాల్సిన పరిస్థితికి దేశం దిగజారింది. తిండి గింజలు పండించకుండా ఇతర వ్యవసాయోత్పత్తులు పెంచటం మనకు రుణాలిస్తున్న దేశాల షరతు కాబట్టి, దిగుమతులు పెరిగే సూచన లెక్కువనిపిస్తున్నాయి.

వ్యవసాయం నేలచూపులు చూడడం ప్రారంభించి 15 సంవత్సరాలైంది. ఈ రంగాన్ని పాలకులు ఎలా దిగజారుస్తూ వచ్చారో రిజర్వ్ బ్యాంక్ డిప్యూటి గవర్నర్ డాక్టర్ రాకేష్ మోహన్ బ్యాంక్ నవంబర్ బులెటిన్‌లో విశ్లేషించారు. "గత కొన్ని సంవత్సరాలుగా వ్యవసాయ రంగ పరిస్థితి బాగాలేదు. పదవ ప్రణాళిక మొదటి నాలుగేళ్లలో జిడిపిలో ఈ రంగం వాటా నాలుగు శాతం లక్ష్యం కాగా సంవత్సరానికి సగటున రెండు శాతం మాత్రమే సాధ్యమైంది. దీనికి ముఖ్య కారణం గోధుమ, పంచదార, పప్పుల పంటల ఉత్పత్తి స్తంభించిపోవటం. అలా స్తంభించిపోవడానికి వ్యవసాయంలో పెట్టుబడుల క్షీణతే కారణం. 1999-2000 స్థిరధరల ప్రకారం ఈ పెట్టుబడి 1999-2000లో రు. 43,473 కోట్లు ఉంటే 2004-05లో రు. 43473 కోట్లకు తగ్గింది. ఈ తగ్గుదల వల్ల జిడిపిలో పెట్టుబడి శాతం 1999-2000లో 2.2 శాతం నుంచి 1.7 శాతానికి పడిపోయింది. దేశంలో జిడిపి ఎనిమిది శాతం ఆ పైనా పెరగాలంటే, ఈ క్షీణతను నివారించాలి."

దురదృష్టం ఏమంటే ఈ పెద్దమనిషి ఈ రోజున చేసిన విశ్లేషణను వ్యవసాయార్థిక శాస్త్రవేత్తలు, ప్రతిపక్ష పార్టీలు, ముఖ్యంగా వామపక్షాలు దశాబ్దకాలం నుంచి చెబుతూనే వచ్చాయి. వేలాది మంది రైతులు ఆత్మహత్యలు చేసుకొనే దాకా పాలకులకు మెలకువ రాలేదు. 11వ ప్రణాళికలో ఏదోవూడ బొడి చేస్తాం అంటున్నారు. దాని రూపురేఖలెలా ఉంటాయో, రేపు 28వ తేదిన ప్రవేశపెట్టబోయే 2007-08 బడ్జెట్‌లో కనిపిస్తుందేమో వేచిచూద్దాం. ◆

ఎఫ్.ఆర్.బి.ఎం. చట్టాన్ని ఆమోదించిన దాని ప్రకారం జీరో లోటు బడ్జెట్ ఉండాలనే కత్తినెత్తిన వేలాడుతున్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఆ మేరకు ఎకౌంటింగ్ పద్ధతుల్లో ఏం మతలబు చేసి, ఈ లోటు బడ్జెట్ తగ్గింపును చూపిస్తున్నారో బడ్జెట్ పుస్తకాలను అధ్యయనం చేయాల్సి ఉంటుంది.

రాబోయే సంవత్సరం వార్షిక ప్రణాళిక కేటాయింపుల్లో కూడా ఇదే ధోరణి వ్యక్తమయింది. ఈ విశ్లేషణలో పొందుపరచిన పట్టికను చూస్తే, మొత్తం 20 శాఖల్లో నాలుగైదు మినహాయించి, మిగతా శాఖలన్నింటికీ గత సంవత్సరంతో పోల్చి చూస్తే కోతలే. 2006-07 ప్రణాళికలో చేసిన కేటాయింపులతో పోలిస్తే, సవరించిన అంచనాల ప్రకారం ఏ ఒక్క శాఖకు కేటాయించిన శాతం మొత్తం పూర్తిగా ఖర్చు కాలేదు. నడుస్తున్న సంవత్సరంలో చేసిన కేటాయింపులు ఖర్చు చేయలేని అశక్తతనూ వ్యక్తం చేసిన ప్రభుత్వం రాబోయే సంవత్సరంలో ఘనంగా కేటాయింపులు (ఈ సంచిక కేటాయింపులు దగ్గర పడుతున్న ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని చేసినట్లే అనిపిస్తుంది) చేసి, భారీగా ప్రజల కోసం ఖర్చు చేయబోతున్నాం అంటే ప్రజలేమీ చెవుల్లో పువ్వులు పెట్టుకొని లేరని, రాష్ట్రంలో వివిధ వర్గాల ప్రజలు వారి ప్రదర్శనలు, ప్రకటనలు అక్కడక్కడ తిరుగుబాట్లు, వారి అసంతృప్తి జ్వాలలవెల్లువ తెలియ చేస్తున్నాయి. ఒక్క సామాజిక, సంక్షేమ పథకాలకు మాత్రం చేసిన కేటాయింపు శాతం పెరిగినట్లు కనిపిస్తుంది. అయితే, ఈ కేటాయింపుల ఘనత పైన పటారం లోన లోటారం అని, ఆ పద్దు కింద చేసిన కేటాయింపులు, నడుస్తున్న సంవత్సరంలో కేటాయించిన సొమ్ములను ఖర్చు చేసిన తీరు పరిశీలిస్తే అర్థమవుతుంది. ఆఖరకు, ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనారిటీలకు చేసిన కేటాయింపు శాతం కూడా తగ్గించారంటే, 7.90 శాతం నుంచి 4.87 శాతానికి తీవ్ర కోతకు గురయిందంటే, ఎంతటి కీలకమైన లోటు బ్యాంకును పాలకవర్గం దూరం చేసుకుంటుందో విదితమవుతుంది. వారిని దృష్టిలో ఉంచుకొని, గృహ నిర్మాణానికి చేసిన హెచ్చు కేటాయింపులు వారిని మోసపుచ్చలేవు. ఎందుకంటే, గృహ నిర్మాణ పథకాలు అమలు అవుతున్న తీరు వారి కళ్లముందే కనిపిస్తుంది.

బడ్జెట్ అత్యంత నిరాశకు గురి చేస్తున్నది. నిరుద్యోగ సమస్య పట్ల ప్రభుత్వ వైఖరి, ఐ.టి. రంగంలో లభ్యమయ్యే కొద్దిపాటి ఉద్యోగావకాశాలు, అసలు సమస్యను గోటితో కూడా మీటలేవు. రాబోయే కాలంలో నిర్మాణ రంగం చాలా కీలక పాత్ర వహిస్తున్న నేపథ్యంలో ఐ.టి. ఉద్యోగ వెంపర్లాట తీవ్రమైన మానవవనరుల కొరతకు దారితీస్తుందని హెచ్చరించాలి.

(అనారోగ్యం దృష్ట్యా ఐసియులో మృత్యువుతో పోరాడి హాస్పిటల్ నుంచి బయటపడిన రోజునే పత్రికల్లో బడ్జెట్ వార్తలు మాత్రం చూచిన స్పందన ఈ వ్యాసం) ◆

**వార్షిక ప్రణాళిక 2007-2008 - వివిధ రంగాలకు కేటాయింపులు**

| క్ర. సం. | రంగం | 2006-2007 | | 2007-2008 |
|---|---|---|---|---|
| | | బడ్జెట్ అంచనా | సవరించిన అంచనా | బడ్జెట్ అంచనా |
| **1** | **2** | **3** | **4** | **5** |
| I | వ్యవసాయం, అనుబంధ రంగాలు | 59443.43 (3.04) | 594443.43 (3.01) | 69748.82 (2.32) |
| II | గ్రామీణాభివృద్ధి | 110754.90 (5.66) | 110754.90 (5.62) | 150133.14 (5.00) |
| III | ప్రత్యేక ప్రాంతం అభివృద్ధి | | | |
| IV | నీటిపారుదల, వరద నివారణ | 1000000.00 (51.15) | 1000000.00 (50.71) | 1297360.00 (42.23) |
| V | విద్యుచ్ఛక్తి | 10800.97 (0.55) | 10800.97 (0.55) | 25914.47 (0.86) |
| VI | పరిశ్రమలు, ఖనిజాలు | 35837.64 (1.83) | 25837.64 (1.82) | 47301.27 (1.58) |
| VII | రవాణా శాఖ | 94663.13 (4.84) | 94663.13 (4.80) | 142896.97 (4.76) |
| VIII | కమ్యూనికేషన్స్ | | | |
| IX | విజ్ఞానం, టెక్నాలజీ, పర్యావరణం | 113.64 (0.01) | 113.64 (0.01) | 313.64 (0.01) |
| X | సాధారణ ఆర్థికసేవలు | 62934.18 (3.22) | 77684.18 (3.93) | 168323.84 (5.61) |
| బి | సామాజిక సేవలు | 564902.78 (28.89) | 566706.18 (28.75) | 1081568.62 (36.04) |
| 1 | విద్య, క్రీడలు, కళ, సంస్కృతి | 74927.75 (3.83) | 74927.75 (3.80) | 94664.50 (3.15) |
| 2 | వైద్యం - ప్రజారోగ్యం | 53574.24 (2.74) | 53655.64 (2.72) | 76027.84 (2.53) |
| 3 | మంచినీటి సరఫరా - పారిశుధ్యం | 56171.62 (2.87) | 56171.62 (2.84) | 83186.00 (2.77) |
| 4 | గృహనిర్మాణం | 119031.00 (6.09) | 119031.00 (6.04) | 485317.00 (16.17) |
| 5 | పట్టణాభివృద్ధి | 76910.86 (3.93) | 76910.86 (3.90) | 146458.39 (4.88) |
| 6 | సమాచార ప్రచార రంగం | 500.00 (0.03) | 500.00 (0.03) | 1500.00 (0.05) |
| 7 | ఎస్.సి., ఎస్.టి., బి.సి. మైనారిటీల సంక్షేమం | 154431.17 (7.90) | 156153.17 (7.90) | 146102.21 (4.87) |
| 8 | కార్మికులు - ఉపాధి | 1741.91 (0.09) | 1741.91 (0.09) | 1575.84 (0.05) |
| 9 | సామాజిక భద్రత - సంక్షేమం | 16495.33 (0.84) | 16495.33 (0.84) | 21736.84 (0.72) |
| 10 | పౌష్టికాహారం (స్త్రీల అభివృద్ధి-శిశు సంక్షేమం) | 11118.90 (0.57) | 11118.90 (0.56) | 25000.00 (0.83) |
| సి | సాధారణ సేవలు | 15739.87 (0.81) | 15739.87 (0.80) | 17792.62 (0.59) |
| | **మొత్తం** | **1955190.54 (100.00)** | **1971743.94 (100.00)** | **3001353.89 (100.00)** |

# ప్రజాస్వామ్య పరిరక్షణకు శాసనమండలి - ఆవశ్యకత

- డా. రక్కిరెడ్డి ఆదిరెడ్డి

బ్రిటిష్ పాలనను నిరసించి, స్వాతంత్ర్యాన్ని సంపాదించి, ప్రజాస్వామిక వ్యవస్థ స్థాపించుకున్న తరువాత ఇతర ప్రజాస్వామిక దేశాల ననుసరించి మన నాయకులు, పాలకులు దేశానికి ఒక చక్కని రాజ్యాంగాన్ని రూపొందించారు. రాజ్యాంగం దేశానికి మౌలికశాసనం. ప్రభుత్వానికి మూలచట్టం. అందుకే రాజ్యాంగ నిర్మాతలు ఆచరణాత్మక మయిన, సలక్షణమయిన రాజ్యాంగ నిర్మాణాన్ని ధ్యేయంగా పెట్టుకొని, ప్రపంచంలోని ప్రజాస్వామిక రాజ్యాంగాలను అన్నింటినీ అధ్యయనం చేసి, వాటిలో మన దేశ పరిస్థితులకు సరిపడే అంశాలను గ్రహించి, వాటిని మన రాజ్యాంగంలో తగిన చోట్ల పొందుపరిచారు.

భారత రాజ్యాంగం 1950, జనవరి 26 నుంచి అమలులోకి వచ్చింది. భారతదేశం రిపబ్లిక్ విధానాన్ని అనుసరించి సర్వసత్తాక ప్రజారాజ్యంగా జాతి, మత, కుల, వర్ణ వివక్షత లేకుండా సమానహక్కులు గల ప్రజలతో కూడిన రాజ్యాంగంగా ఏర్పడింది. ప్రజల శ్రేయస్సు కోసం ప్రజాభిప్రాయాన్ని అనుసరించి ప్రజల యోగక్షేమాలు పెంపొందింపచేసే పరిపాలనా విధానాన్ని ఏర్పరచే విధంగా మన రాజ్యాంగాన్ని రూపొందించినట్లు తెలుస్తుంది.

భారత రాజ్యాంగం సర్వస్వామ్యంతో కూడిన ప్రజాస్వామిక రిపబ్లిక్, లిఖిత రాజ్యాంగం, సమాఖ్య రాజ్యాంగం, బాధ్యాతయుత ప్రభుత్వం, శ్రేయోరాజ్యం, లౌకిక రాజ్యం, ప్రాథమిక హక్కులు, ప్రాథమిక విధులు, ఆదేశ సూత్రాలు మొదలైనవి మౌలిక లక్షణాలు గలిగిన విశిష్టమైన రాజ్యాంగం.

**శాసనసభలు**

కేంద్రంలో పార్లమెంట్ ఉన్నట్లు రాష్ట్రాలలో శాసనసభలున్నాయి. 168వ రాజ్యాంగ ప్రకరణం ప్రతి రాష్ట్రానికి ఒకటి లేక రెండు సభలతో కూడిన శాసనసభ ఉంటుంది. ప్రస్తుతం అయిదు రాష్ట్రాలలో 1) ఉత్తరప్రదేశ్, 2) బీహార్, 3) జమ్ము - కాశ్మీర్, 4) కర్నాటక, 5) మహారాష్ట్ర రాష్ట్రాలలో రెండు శాసనసభలు అమలులో ఉన్నాయి. ఇక ఆంధ్రప్రదేశ్‌లో కూడ శాసనమండలి రానున్నది.

రాష్ట్ర శాసనసభలో దిగువ సభను లేదా విధాన సభ అని, ఎగువ సభని శాసనమండలి లేక విధానమండలి అని అంటారు.

169వ ప్రకరణం ప్రకారం ఒక రాష్ట్రానికి ఎగువసభను ఏర్పాటు చేయమని లేక రద్దు చేయమని ఆ రాష్ట్ర శాసనసభ 2/3 వంతుల మెజారిటీతో తీర్మానించి పార్లమెంట్‌కు నివేదించవచ్చు. పార్లమెంట్ అందుకు అనుగుణంగా శాసనం చేసి ఆ రాష్ట్రానికి శాసనమండలి ఏర్పరుచుకుంటుంది. లేదా రద్దు చేయనూవచ్చు. ఈ పద్ధతి ప్రకారం ఆంధ్రప్రదేశ్‌కు 1957లో శాసనమండలి ఏర్పాటయింది. పంజాబ్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో శాసనమండలి రద్దు అయింది.

శాసనమండలి సభ్యుల సంఖ్య ఆ రాష్ట్ర శాసనసభ మొత్తం సభ్యులలోని 1/3 వంతు సభ్యుల సంఖ్యకు మించరాదు. శాసనమండలి సభ్యుల సంఖ్య 40 కన్నా తక్కువ ఉండరాదు.

శాసనమండలి సభ్యులలో 1/3 వంతు సభ్యులను శాసనసభ్యులు ఎన్నుకొంటారు. 1/3 వంతు సభ్యులను స్థానిక సంస్థల సభ్యులు, 1/12 వంతు సభ్యులను పట్టభద్రులు, 1/12 వంతు సభ్యులను ఉపాధ్యాయులు ఎన్నుకుంటారు. మిగిలినవారిని సాహిత్యం, శాస్త్రం, కళలు, సంఘసేవ మొదలయిన రంగాలలో ప్రసిద్ధులయిన వారిని గవర్నర్ నామినేట్ చేస్తాడు. రాజ్యసభ వలె శాసనమండలి శాశ్వత సభ సభ్యులలో 1/3 వంతు ప్రతి రెండు సంవత్సరాలకు పదవీ విరమణ చేస్తారు. సభ్యుల పదవీకాలం ఆరు సంవత్సరాలు. సభా కర్యాక్రమ నిర్వహణకు సభ్యులు తమలో ఒకరిని ఛైర్మన్‌గానూ, ఒకరిని డిప్యూటి ఛైర్మన్‌గానూ ఎన్నుకుంటారు.

శాసనమండలి సభ్యులుగా ఉండటానికి ఆ వ్యక్తి భారతీయ పౌరడై ఉండాలి. 30 సంవత్సరాల కన్నా ఎక్కువ వయస్సు ఉన్నవారే ఉండాలి. పార్లమెంట్ నిర్ణయించే ఇతర అర్హతలు ఉండాలి. శాసనసభలో 500కు మించకుండా, 60కి తగ్గకుండా జనాభాను బట్టి సభ్యులు ఉంటారు. వయోజన ఓటింగు ప్రాతిపదిక మీద, ప్రాదేశిక నియోజక వర్గాల నుంచి సభ్యులు ఎన్నికవుతారు. శాసనసభ పదవీ కాలం అయిదు సంవత్సరాలు. 42వ రాజ్యాంగ సవరణ ఈ పదవీ కాలాన్ని 6 సంవత్సరాలకు పొడిగించింది. 44వ సవరణ తిరిగి 5 సంవత్సరాలకు తగ్గించింది. పదవీ కాలానికి ముందే శాసనసభను గవర్నర్ రద్దు చేయవచ్చు. నియోజక వర్గాలలో కొన్ని షెడ్యూల్డు కులాలు, జాతులకు ప్రత్యేకంగా కేటాయించడం జరుగుతుంది. ఆంగ్లో ఇండియన్‌లకు తగిన ప్రాతినిధ్యం లభించలేదని గవర్నర్ భావిస్తే వారి ప్రతినిధులను శాసనసభ సభ్యులుగా నామినేట్ చేస్తాడు. శాసనసభా సభ్యుడిగా ఉండే వ్యక్తి భారతీయ పౌరులె, 25 సంవత్సరాలకు ఎక్కువ వయస్సు ఉన్నవారై ఉండాలి, పార్లమెంట్ నిర్ణయించే ఇతర అర్హతలు ఉండాలి.

సభా కార్యక్రమం నిర్వహణకు సభ్యులు తమలో ఒకరిని స్పీకరుగా మరొకరిని డిప్యూటీ స్పీకరుగా ఎన్నుకొంటారు.

కార్యక్రమ నిర్వహణలో, ఆర్థిక వ్యవహారాల్లో హక్కుల విషయంలో రాష్ట్ర శాసనసభల అధికారాలు, పరిస్థితులు పార్లమెంట్ అధికారాలు, పరిస్థితులను పోలి ఉన్నాయి. కొన్ని విషయాలలో మాత్రం పార్లమెంట్‌కు శాసనసభకు తేడాఉంది. రెండు సభల మధ్య బిల్లులను ఆమోదించటంలో ఏర్పడే ప్రతిష్టంభనను సంయుక్త సమావేశం ద్వారా పరిష్కరించటానికి వీలులేదు. ఆర్థిక బిల్లు కాని ఇతర బిల్లులుకాని శాసనసభచే ఆమోదం పొంది శాసన మండలిచే తిరస్కరించబడనపుడు లేదా మూడు నెలల

వరకు శాసనమండలి చేత ఆమోదించబడనపుడు, లేదా శాసనసభకు అంగీకారం కాని సవరణలు చేయబడినపుడు, శాసనసభ తిరిగి ఆ బిల్లును ఆమోదించి శాసనమండలికి పంపుతుంది. శాసనమండలి తిరస్కరించినా, శాసనసభకు అంగీకారంగానూ సవరణలతో ఆమోదించకపోయినా, ఆ బిల్లు రెండు సభలచేత ఆమోదింపబడినట్లు భావించడం జరుగుతుంది. కాబట్టి శాసనమండలి ఆర్థిక బిల్లు కాని ఇతర బిల్లులను మొదటిసారి మూడు నెలల వరకు, రెండోసారి ఒక నెల వరకు మాత్రమే తాత్కాలికంగా నిలుపగలదు. ఆర్థిక బిల్లును శాసనమండలి 14 రోజులు పాటు మాత్రమే నిలుపగలదు.

**రాజ్యాంగం రాష్ట్ర శాసనసభల మీద కొన్ని పరిమితులను పెట్టింది.**

1) రాజ్యసభ 2/3 వ వంతు మెజారిటీతో రాష్ట్ర జాబితాలో ఒక అంశం జాతీయ ప్రాధాన్యతకలదని తీర్మానిస్తే దాని మీద పార్లమెంట్ ఒక సంవత్సరం పాటు చట్టాలు చేయవచ్చు.
2) కొన్ని రకాల బిల్లులు రాష్ట్రపతి అంగీకారం లేనిదే శాసనసభలో ప్రవేశ పెట్టడానికి వీలులేదు
3) కొన్ని రాష్ట్ర చట్టాలు రాష్ట్రపతి ఆమోదం లేనిదే చలామణి కావు.
4) అత్యవసర పరిస్థితి కాలంలో రాష్ట్రాల అధికారాల మీద పార్లమెంట్ చట్టాలు చేయవచ్చు.
5) రాష్ట్రాలలో రాజ్యాంగ యంత్రాంగం విఫలమైనప్పుడు రాష్ట్ర అధికారాలు మొత్తం మీదగానీ కొన్నింటి మీదగానీ రాష్ట్రపతి సలహాపై పార్లమెంట్ చట్టాలు చేస్తుంది.

1957 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విధాన మండలి బిల్లుకు పార్లమెంట్ ఆమోదముద్ర వేసింది. 90 మంది సభ్యులతో కూడిన ప్రథమ సభ 1958 జులైలో ఏర్పాటు చేసారు. ఏర్పడిన నాటి నుండి 1985 కౌన్సిల్ వరకూ కాంగ్రెస్ సభ్యుల ఆధిపత్యం కొనసాగింది. కమ్యూనిస్టులు, జనసంఘ్, ఉపాధ్యాయులు, పట్టభద్రులు కూడా ఎన్నుకోబడ్డారు.

1960 నుంచి 1970 వరకు కొంత మంది స్వతంత్రులు జనతా పార్టీ నుంచి కూడా కొంత మంది సభ్యులు ఎన్నికైనప్పటికీ కాంగ్రెస్ పార్టీ వారి ఆధిపత్యం కారణంగా సభలో వీరు రాణించలేక పోయారు. ఛైర్మన్, వైస్ ఛైర్మన్ కూడా కాంగ్రెస్ పార్టీ నుండే ఎన్నికైనారు. మండలి యందు ఆరోగ్యవంతమైన సంభాషణలు చోటుచేసుకున్నాయి. 1980 వరకు కౌన్సిల్ బాగానే నడిచింది. ఆ తర్వాత 1983లో ఎన్.టి.ఆర్. రాజకీయ రంగప్రవేశంతో రాష్ట్ర రాజకీయాలలో పెనుమార్పులు చోటుచేసుకున్నాయి.

రాష్ట్ర శాసనసభలో 2/3 వంతు మెజారిటీతో తెలుగుదేశం ఎన్నిక కాగా మండలిలో మాత్రం కాంగ్రెస్ వారి ఆధిపత్యం కొనసాగింది. ఒకానొక పరిస్థితిలో ఛైర్మన్, వైస్ ఛైర్మన్‌లపై తెలుగుదేశం అధినేత ఆరోపణలు చేసారు. అప్పటి విధాన మండలిలో ప్రతిపక్షనేతగా రోశయ్య వ్యవహరించారు.

సరిగ్గా సుమారు 27 సంవత్సరాల అనంతరం తెలుగుదేశం ప్రభుత్వం విధానమండలిని రద్దు చేస్తూ రాష్ట్ర అసెంబ్లీలో బిల్లు ప్రవేశ పెట్టి 1985 మే లో విధాన మండలిని రద్దు చేసారు. ఇందుకు ప్రజలపై అధికభారంతో పాటు విధానపరమైన నిర్ణయాలు తీసుకొవటంలో జాప్యం, సుమారు ఏటా 60 లక్షల ప్రభుత్వ ఖర్చు అనే సాకుతో రద్దు చేసారు.

**ముగింపు**

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో రెండు సభల సంప్రదాయం ఈ నాటిది కాదు. మన పార్లమెంట్‌లో రెండు సభలున్నాయి. ఒకటి పెద్ద సభ. అదే రాజ్యసభ. రెండోది లోక్‌సభ. రెండు సభల అవశ్యకత దృష్ట్యా ఇప్పటికే దేశంలో అయిదు రాష్ట్రాలలో ఉభయ సభలున్నాయి. పెద్ద రాష్ట్రాలలో శాసనసభకు తోడు శాసనమండలి ఉండాలని మన రాజ్యాంగం అవకాశం ఇచ్చింది. దీనికి ప్రత్యేక కారణాలున్నాయి. ఏదైనా ఒక బిల్లు చట్టరూపంలోకి వచ్చే ముందు దాని లోతుపాతులు సమగ్రంగా చర్చించే వేదికలు అవసరం. ఆదరాబాదరాగా కేవలం దిగువ సభలోనే చర్చలు జరిపి చట్టం తేవడం వలన కొన్ని లోటుపాట్లకు అవకాశం ఉంటుందని రాజ్యాంగ పెద్దలు భావించారు. అందుకే ఎగువ సభలోనూ సమగ్ర చర్చ ద్వారా బిల్లులపై పరిపూర్ణ చర్చ జరుగుతుంది. పెద్దల సభలో ఆయా రంగాల్లో నిష్ణాతులైన వారుంటారు. అన్ని వర్గాల వారికి అందులో ప్రాతినిధ్యం ఉంటుంది. వారు చేసే చర్చలు మరింత అర్థవంతంగా ఉండి సమగ్రత చోటుచేసుకుంటుంది. ఇదే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనూ ఎగువసభ (శాసనమండలి) ను పునరుద్దరించనున్నారు. రాష్ట్రంలో ఎగువసభ పున:ప్రారంభం ద్వారా ప్రజాస్వామ్యం పరిఢవిల్లుతుందని చెప్పవచ్చు.

పెద్ద రాష్ట్రాల్లో కౌన్సిల్ ఉండటం ఆనవాయితీగా వస్తున్నది. దేశంలో ఇప్పటికే అయిదు రాష్ట్రాల్లో కౌన్సిల్ ఉండగా, అయిదో పెద్ద రాష్ట్రం అయిన ఆంధ్రప్రదేశ్‌లోనూ కౌన్సిల్ పునరుద్ధరణ ఏ విధంగా చూసినప్పటికీ సముచిత నిర్ణయమే. కౌన్సిల్‌లో దాదాపు 90 మంది సభ్యులుంటారు. వారి వలన ప్రభుత్వం పై పడే ఆర్థిక భారం పెద్దగా ఉండదు. రాష్ట్ర బడ్జెట్‌పై ఈ ప్రభావం అతి కొద్దిగా ఉంటుంది. మన బడ్జెట్ మొత్తంలో కౌన్సిల్ కోసం జరిగే వ్యయం నామమాత్రమే. ఈ మాత్రం నిధులు భరించలేని స్థితిలో రాష్ట్రం లేదు. కౌన్సిల్‌కు సభ్యులుగా వచ్చేవారి సేవలు ఎంతో ఉపకరిస్తాయి. పైగా నేరుగా శాసనసభకు ఎన్నికయ్యేందుకు అవకాశం లేని బడుగు, బలహీనవర్గాలకు చెందిన కొందరికి కౌన్సిల్‌లో సభ్యత్వం లభించే వీలుంది. వీరు తమతమ వర్గాల సమస్యలను శాసనమండలిలో చర్చించి వారి అభ్యున్నతికి కృషి చేసేందుకు మంచి వేదికగా ఈ ఎగువ సభ ఉపకరిస్తుంది. మేధావులకు తోడు కొన్ని కులాలు, వర్గాల వారు నేరుగా ఎన్నికల బరిలో దిగి ఈ రాజకీయాలను ఎదుర్కొని చట్టసభలకు వచ్చే అవకాశం లేని వారికి కౌన్సిల్ ద్వారా చట్టసభలలో ప్రవేశించే అవకాశం లభిస్తుంది. స్థానిక సంస్థల ప్రతినిధులు, టీచర్ల ప్రతినిధులకు అవకాశం ఉంటుంది. ఆయా రంగాల్లో విశిష్ట సేవలందిస్తున్న వారిని, కళాకారులను నామినేట్ చేస్తారు. సమాజంలోని అన్ని వర్గాలకు కౌన్సిల్‌లో ప్రాతినిధ్యం ఉండి చర్చలు మరింత అర్థవంతంగా సాగుతాయి. రెండు సభల విధానం ప్రజాస్వామ్య పరిపుష్టికి దోహదం చేస్తుంది. ◆

# విధానమండలి - ఉపాధ్యాయ ప్రతినిధి కర్తవ్యాలు

- వడ్డెపల్లి మల్లేశం

శాసనమండలిలో ఉపాధ్యాయ నియోజకవర్గాల నుండి ప్రతినిధులను ఎన్నుకోవడానికి అధికారిక ప్రక్రియ ప్రారంభమైన నేపథ్యంలో అనేక సంఘాల ప్రతినిధులు పోటీచేయడానికి ముందుకొస్తున్నారు. ఈ సందర్భంలో విజ్ఞులైన, సామాజిక స్పృహ కలిగి సామాజిక ప్రయోజనాన్ని ఆశించే ఉపాధ్యాయులు ఎలాంటి అభ్యర్థిని ఎన్నుకోవాలి? ఏ సంఘానికి ప్రాధాన్యతనీయాలి? కౌన్సిల్‌లో వీరు చేయబోయే పనేమిటి? ఏ విలువలకు ఈ ప్రస్థానం? అనేక ప్రశ్నలు ఉదయిస్తుండడం సహజం.

ఈ సందర్భంలో విద్యారంగ నేపథ్యాన్ని, అభ్యర్థి నాయకత్వ ప్రతిభ, దృక్పథంలను ఉపాధ్యాయుల ప్రస్తుత సంక్షోభం, పోరాట పటిమ మొదలగు వానిని ప్రధానంగా దృష్టిలో పెట్టుకోవడంతో పాటు ఆ సంఘ సామాజిక నేపథ్యాన్ని కూడా పరిశీలించడం ప్రతి ఉపాధ్యాయుని తక్షణ కర్తవ్యం.

విధాన మండలి ఏర్పాటు ద్వారా విద్యారంగంలో ఆశించే మార్పులు అనేకం ఉన్నా అవి ఏ మేరకు సఫలమవుతాయనే విషయాన్ని పక్కనబెడితే ప్రభుత్వ పాలనా రంగంలో దాదాపు 126 శాఖలుండి 12 లక్షల పై చిలుకు రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు ఉంటే కేవలం విద్యా రంగంలో పని చేస్తున్న ఉపాధ్యాయులకు మాత్రమే ఎందుకు శాసనమండలిలో స్థానం కల్పించినట్లు?

విద్య సామాజిక మార్పుకు పనిముట్టుగా ఉండి దానిని అందించే ఉపాధ్యాయుడు పురోగతికి, సామాజిక చైతన్యానికి ప్రతినిధిగా వ్యవహరిస్తూ మేధావిగా, ప్రజల మనిషిగా, సామాజిక బాధ్యత తీసుకునే వ్యక్తిగా ముద్రపడడం, సమాజ ఆమోదం పొందడం ప్రధానమైన కారణంగా మనం భావించవచ్చు.

పరిశీలనాతత్వం, పరిశోధన, విచక్షణ, సమాజం పట్ల మమకారం, సామాన్య జనానికి అందుబాటులో ఉండడం ఈ భావనకు మరింత బలం చేకూర్చుతున్న అంశాలు.

ఎలాంటి నాయకత్వం కావాలి? ప్రజల ఆకాంక్షలు, మనోభావాలు, ఆలోచనలను ఆచరణలోకి తీసుకువచ్చే వ్యవస్థ లేదా నాయకత్వం కావాలి. విద్యారంగానికి వర్తింప చేసుకున్నపుడు విద్యారంగ ప్రయోజనం కోసమే పనిచేసే నాయకత్వాన్ని ఎన్నుకోవాల్సి ఉంది.

**ఉపాధ్యాయ ప్రతినిధి కర్తవ్యం**

విద్యారంగం నేడు సంక్షోభంలో చిక్కుకుంది.

- విద్యారంగం పరిరక్షణకు ఆటంకంగా పరిణమించిన ప్రభుత్వ విధానాలు, చట్టాలను నిలువరింపచేయడానికి పోరాడాలి.
- ఉపాధ్యాయులకు సమకూర్చ వలసిన ప్రయోజనాలను ప్రభుత్వం నుండి సక్రమంగా అమలయ్యేలాచూచి కోల్పోతున్న సౌకర్యాలను పునరుద్ధరించడానికి చర్చ ద్వారా దృష్టికి తీసుకెళ్లాలి.
- లోపభూయిష్టమైన విద్యారంగాన్ని మెరుగుపరచడానికి తగు నిర్మాణాత్మక సూచనలు ఇవ్వాలి.
- విద్యా ప్రైవేటీకరణను అరికట్టడానికి అందుబాటులో గల అవకాశాల ద్వారా, సభ్యులను కలుపుకొని ఒత్తిడి తెచ్చి ప్రభుత్వాన్ని ఒప్పించాలి.
- విద్యారంగానికి బడ్జెట్ కెటాయింపుల పెంపుకు కృషిచేయాలి.
- ప్రజాపాలనకు సంబంధించి పేదరికం, గ్రామీణ జీవితం, వ్యవసాయరంగం, కార్మిక హక్కులకు సంబంధించి ప్రభుత్వ పాలసీలపై ప్రజా పక్షపాతిగా నిలబడాలి.
- ప్రజా ఉద్యమాలకు మద్దతు ఇచ్చి విద్యారంగ ప్రయోజనాలకు విభిన్న వర్గాల మద్దతు కూడగట్టగలగాలి.
- శాసనమండలి బయట జరుగుతున్న ఉపాధ్యాయ ఉద్యమాలకు సంఘీభావం తెల్పి మండలిలో చర్చకు పెట్టాలి.
- అప్రెంటిస్ పేరున కొనసాగుతున్న వెట్టిచాకిరి నిర్మూలనకు కృషి చేయాలి.
- సమగ్రమైన విద్యారంగ అభివృద్ధికి, ప్రభుత్వానికి తగు సూచనలు ఇవ్వాలి.

**విలువలు**

- వృత్తి నిబద్ధత, సామాజిక బాధ్యత ప్రధానంగా గల ఉపాధ్యాయుల చైతన్యానికి నాయకత్వం వహిస్తూ ప్రభుత్వరంగంలోనే విద్య కొనసాగించి బడుగువర్గాల పిల్లలకు కనీస ఉచితవిద్య, ఉన్నత విద్య అందించుటకు తద్వారా అసమానతలు లేని సమసమాజ స్థాపనకు దారితీసే ఉన్నత విలువలు ఎం.ఎల్.సి. అభ్యర్థికి ప్రధానంగా ఉండాల్సి ఉంది.

**విద్యారంగంలో నెలకొన్న కొన్ని చేదు నిజాలు**

- ఉపాధ్యాయులకు ఉమ్మడి సర్వీస్ రూల్స్ లేవు.
- 54,000 ఉపాధ్యాయుల నియామకం లేకుండానే బోధన కొనసాగుతుంది.
- ఎలాంటి శిక్షణ లేకుండా 46,544 విద్యావాలంటీర్ల ద్వారా మొక్కుబడి బోధన కొనసాగుతుంది (శాశ్వత నియామకాలు చేయకుండా)
- 54 శాతం పాఠశాలలకు ఆటస్థలాలు, 46 శాతం పాఠశాలలకు మరుగుదొడ్ల సౌకర్యం లేదు. బాలికలకు మరుగుదొడ్లు లేని పాఠశాలలు 70 శాతం కాగా 81 శాతం పాఠశాలలకు విద్యుత్, 27 శాతం పాఠశాలలకు నీటి సౌకర్యం లేదు.
- 1.9.2004 తర్వాత నియామకమైన వారికి పెన్షన్ సౌకర్యం తీసివేశారు.
- అనేక పోస్టులను షిఫ్టు, తగ్గింపు చేయడం జరిగింది.
- విద్యార్థి ఉపాధ్యాయ నిష్పత్తిని పెంచి సిబ్బంది మిగులు చూపుతున్నారు.
- ఉన్నత విద్యారంగంలో ఇప్పటికే విద్య ప్రైవేటీకరించబడి చదువు

# తెలుగు భాషోద్యమం

- జి. ప్రభాకర్

ఇటీవల తెలుగుభాష విషయమై పెద్ద చర్చ జరుగుతోంది. తెలుగుభాష పరిరక్షణ, దాని అభివృద్ధి విషయమై కొత్త కొత్త అంశాలు, కోణాలు, రంగంమీదికొస్తున్నాయి. తెలుగుభాష పరిరక్షణ దాని అభివృద్ధి లక్ష్యంతో రాష్ట్రంలోని అధికార భాషా సంఘం ఇటీవల చేబడుతున్న కొన్ని చర్యలు, చేస్తున్న కొన్ని ప్రతిపాదనలు ఈ చర్చకు నేపథ్యంగా ఉంటున్నాయి. తమిళం లాగానే మన తెలుగు భాషను సైతం ప్రామాణిక భాషగా కేంద్రం గుర్తించాలని రాష్ట్ర అధికార భాషా సంఘం కేంద్రానికి విజ్ఞప్తి చేస్తోంది. ఈ సందర్భంగా తెలుగుభాష ప్రాచీనత యోగ్యతలను వివరిస్తూ చాలా విషయాలు చర్చకొచ్చాయి. కనుక మన భాష సైతం తమిళం వలెనే ప్రామాణిక భాషగా గుర్తింపుకు అన్ని రకాలా అర్హమైనదేనని, ఎటొచ్చీ మన రాజకీయ పార్టీలు ప్రత్యేకించి మన రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయంలో తగినంత శ్రద్ధాశక్తులు ప్రదర్శించటం లేదనే విమర్శలు సైతం వచ్చాయి. ఆ విషయం అలా ఉంచితే, రాష్ట్ర ప్రభుత్వ సచివాలయంతో మొదలుకొని అన్ని ప్రభుత్వశాఖల్లోను, కోర్టులలోను తెలుగు భాషవాడకాన్ని ప్రోత్సహించాలని, దాన్ని తప్పనిసరి చేయాలనే ప్రతిపాదనలు సైతం వచ్చాయి. అన్నింటికి మించి 'తెలుగు మాధ్యమంలోనే విద్యా బోధన' అనే ప్రతిపాదనపై పెద్ద చర్చ కొనసాగుతోంది.

మొత్తంపై విషయ చర్చ బహుముఖీయంగాను సంక్లిష్టంగాను ఉంటున్న మాట వాస్తవం. ఈ చర్చలోకి వెళ్లే ముందు, అసలు విషయాల్ని పక్కతోవలు పట్టించే భావోద్వేగ స్వభావం కలిగుండే మాతృ, పితృ, భ్రాతృ తదితర శబ్దాల ప్రయోగాన్ని సౌలభ్యం కోసం కాస్త దూరంగా ఉంచుదాం. అందుకని 'మాతృభాష' కు బదులు 'స్వంత భాష' అనే మాట్లాడుకుందాం. ఇందులో ఎలాంటి ఇబ్బంది లేదని గుర్తిద్దాం. ఇకిప్పుడు ఈ చర్చలో వివాదాస్పదమైనవిగా ముందుకొస్తున్న ముఖ్యవిషయాలేమిటో చూద్దాం.

1) ఏ కారణాల వల్ల నైతేనేమి పరభాష ఆంగ్లం పట్ల మొగ్గుదల అనేది స్వంత భాష పరిరక్షణకి, వికాసానికి ఆటంకంగా ఉంటుందనే అభిప్రాయం. 2) ఆంగ్లభాషా వ్యామోహం, దాన్ని సమర్థించడం వలసబానిసత్వ లక్షణం, సామ్రాజ్యవాద అనుకూలం. ఇది స్వభాష విద్రోహం అనే అభిప్రాయం. 3) ఆంగ్లాన్ని మొత్తంగా నిరాకరించాల్సిన పనైతే లేదు గాని, విద్యామాధ్యమంగా ఆంగ్లమే ఉండాలనడం, అదే ప్రాథమిక విద్యాదశ నుండే ఉండాలనడం తగదు. ఇది స్వంతభాషకు నీళ్లొదుకోవడమే. 4) నేటి ప్రపంచీకరణ వాతావరణంలో స్వంతభాష పరభాష అనే చాదస్తాలతో పనిలేదు. అవసరాన్ని తీర్చగల దాన్ని అందిపుచ్చుకుని ముందుకి పోవడమే శ్రేయస్కరం అనే అభిప్రాయం.

---

'కొంటుండగా' కాన్సెప్ట్ పాఠశాలల పేరున ప్రభుత్వం ప్రైవేటీకరణలో భాగంగా ప్రాథమిక విద్యను 3000 పాఠశాలలు స్థాపించాలని పూనుకోవడం పేద పిల్లలను బడికి దూరం చేయడమే.

**ఎన్నుకునే ముందు చూడాల్సిన సంఘ అభ్యర్థి నేపథ్యం**

విద్యారంగంలోని పైన తెలిపిన చేదు నిజాలను ప్రభుత్వం ముందు పెట్టాలంటే అభ్యర్థి, సంఘ నేపథ్యం ప్రధానమే.

- ప్రజల ఆకాంక్షల కనుగుణంగా రాజకీయ నిర్ణయాల్లో తీర్మానాలు చేయగలగాలి.
- శాస్త్రీయ విద్య, కామన్‌స్కూల్ విధాన అమలుకై పోరాడే సంస్థ అయి ఉండాలి.
- విద్యారంగ ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్వహించే సంఘాన్ని చూడాలి.
- సదస్సులు, సెమినార్‌ల ద్వారా వృత్తి నిబద్ధత, సామాజిక బాధ్యతతో పాటు, సామాజిక స్ఫూర్తిని అందించే సంస్థను ఆలోచించాలి.
- పాఠ్యాంశాలు, బోధనా కర్తవ్యాల పట్ల శిక్షణలు ఇచ్చి సమాజ భాగస్వామ్యంను ఆశించి కలిసిపోయే సంస్థను పరిశీలించాలి.
- సామాజిక, విద్యారంగ అసమానతల కోసం ఉద్యమించే సంస్థ అయి ఉండాలి. పాలకవర్గాల కొమ్ముకాసే వారి పట్ల జాగ్రత్తగుండాలి.
- సమరశీల ఐక్య ఉద్యమాలను స్వాగతించి కృషి చేసే సంస్థ కావాలి.
- ప్రైవేట్ రంగంలో సైతం ఉపాధ్యాయుల వృత్తి భద్రతకు పోరాడిన సంస్థను చూడాలి.
- అధికారులు, ప్రజాప్రతినిధుల అవినీతికి అడ్డుకట్ట వేస్తున్న సంస్థను పరిగణనలోకి తీసుకోవాలి. (తాత్కాలిక పనులు మాత్రమే కాదు)
- ఆత్మహత్యలు, ఆకలిచావులు, రైతు, కార్మిక ప్రయోజనాలకు సంఘీభావం తెలిపి, ఆత్మస్థైర్యాన్ని పెంచడానికి కృషి చేస్తున్న సంస్థ అయి ఉండాలి.

ఇక అభ్యర్థి పోరాటపటిమగలవాడుగా, విద్యారంగ ప్రయోజనాలకోసం నిరంతరం తపించేవాడుగా, విద్యా వ్యతిరేక విధానాలను వ్యతిరేకించేవాడుగా, అవినీతికి దూరంగా, ఉపాధ్యాయుల, విద్యారంగ సగటు అంశాలకు సైతం స్పందించేవాడుగా, సమయాన్ని కెటాయించి, నిరాడంబరంగా అందుబాటులో ఉండేవాడుగా ఉన్నపుడే అంతో ఇంతో మనం ఆశించేవి నెరవేరుతాయి.

ప్రపంచబ్యాంకు షరతులు, మనపాలకుల పరాధీనతత, ప్రభుత్వం విద్యారంగం పట్ల సంక్షేమ బాధ్యత విస్మరించడం, నిరంతరం ట్రైనింగ్‌లు, రిపోర్టులు, సర్వేలు, సమావేశాల పేరున టీచర్లను పని చేయకుండా, స్వేచ్ఛ లేకుండా చేస్తూ ప్రభుత్వం పబ్బం గడుపుకుంటోంది. ఫలితాలపై షరతులు పెట్టి, విద్యార్థుల సామాజిక నేపథ్యాన్ని పట్టించుకోక హాస్టల్లను దుస్థితికి నెడుతున్న ప్రభుత్వ వ్యతిరేక విధానాలను ఏ మేరకైనా ఆపగలిగితే ఎం.ఎల్.సి గా మన బాధ్యత కొంతవరకైనా నిర్వహించినట్టే. ◆

5) ఇంగ్లీషు సాంగత్యంతో, ఇంగ్లీషు చదువుతో సమాజంలో ఒక స్థాయికి ఎదిగొచ్చిన వారు తమ పిల్లల్ని ఇంగ్లీషు చదువులే చదివిస్తూ, వారిని విదేశాలకి సైతం పంపుతూ అక్కడ వారిని ఉన్నత చదువుల్లోను, ఉన్నతోద్యోగాలలోను స్థిరపరచుకుంటున్నారు. అలాంటి వాళ్లంతా ఇక్కడ తెలుగుభాష పరిరక్షణ, వికాసాల గూర్చి ఆందోళనలు ఆర్భాటాలు చేయడం ఏమిటి? వీరి లక్ష్యశుద్ధి, చిత్తశుద్ధి ఏపాటివి? తమవలెనే ఇంగ్లీషు చదువులతో కొంతబాగుపడిన వారిని, అలానే బాగు పడాలనుకొనే అశేష బడుగువర్గాల వారిని బాగుపడకుండా నిరోధించే కుట్ర కాదా ఇదంతా – అనే అభిప్రాయం. 6) 'తెలుగుతల్లి' తెలంగాణ ప్రజలకు తల్లి కాజాలదు. తెలంగాణ ప్రజలకు 'తెలంగాణ తల్లి' ఉందనే అభిప్రాయం. 7) 'తెలుగు' తెలంగాణ ప్రజల భాష, ప్రస్తుత రాష్ట్రంలోని తెలంగాణేతర ప్రాంతాల వారి భాష తెలుగు కాదు 'ఆంధ్రం' అనే అభిప్రాయం.

ఇవీ ముఖ్య వివాదాంశాలు. వీటి గుణదోషాల చర్చలోకి వెళ్లే ముందు భాషకు సంబంధించిన మౌలికాంశాలను పరిశీలించాల్సి ఉంటుంది. ఇంతకూ 'భాష' అంటే ఏమిటి? భావ వ్యక్తీకరణకు మాధ్యమం. ఏ భాషైనా ఇంతే తప్ప ఇంతకు మించి ఇంకేమీ కాదు. అయితే వివిధ దేశాలు, ప్రాంతాలు, జాతులు, తెగలు ఎవరికి వారు ఎక్కడికక్కడ తమ స్వంత భాష చుట్టూతా రకరకాల భావోద్వేగాల్ని అల్లుకుంటూ దాన్ని తమ సంస్కృతిలో ఒక విడదీయరాని భాగంగా మలుచుకుంటారు. తమ భాషతో ఒక విడదీయరాని బంధాన్ని పెంచుకుంటారు. కనుక ఎవరి భాష వారికందం, ఆనందం, గొప్ప తీపి. ఇతరులు దాన్ని కొంచెం చేసి మాట్లాడితే నొచ్చుకుంటారు, కోపగిస్తారు, ప్రతిఘటిస్తారు. ఇదంతా అర్థం చేసుకోదగ్గదే! కాని, ఒకానొక భాష సాపేక్షంగా ఎక్కువ విస్తృతిని, ప్రభావశీలతని సంతరించుకోగా మరో భాష వెనుకబడిపోయి, పరిమితులకి లోనైపోయి ఉండడం లాంటి తేడాల్ని కేవలం భావోద్వేగ చట్రంలో బిగించి చూస్తేనే సరిపోదు, అర్థం కాదు. అందుకు నేపథ్యంగా పనిచేసిన వివిధ వస్తుగత పరిస్థితుల్ని, కారణాల్ని మనం పరిశీలించాల్సి ఉంటుంది.

భాషకు సంబంధించిన మరో మౌలికాంశం ఏమంటే, ప్రతి భాష యొక్క ప్రథమ, ప్రధాన రూపం అలిఖిత, మౌఖిక (వాడుక) రూపమే. లిపితో కూడిన దాని లిఖిత రూపం ద్వితీయం, అప్రధానమే. దీనర్థం భాష సమకూర్చుకున్న అక్షరసంపదను తక్కువచేసి చెప్పడం ఎంతమాత్రం కాదు. అక్షరం భాష సిగలో కలికితురాయే, కాదనలేం. అక్షరావిర్భావం భాషాభివృద్ధిలో నిర్ద్వంద్వంగా గొప్ప మలుపే. కాని, అక్షరావిర్భావానికి ముందే భాషలో భావుకత ఉంది, సాహిత్యముంది, శాస్త్ర విజ్ఞానముంది. ఇవన్నీ తరువాత్తరువాతనే అక్షరంలో ఒదుగుతూ వచ్చాయి. ఆదినుంచీ భాషలో పోగవుతూ వచ్చిన ఆ ముడిసరుకులన్నీ, ఆ ముద్దబంగారమంతా తరువాత్తరువాత అక్షరపరికరాలతో నగిషీలు సంతరించుకున్నాయి. భాష ఉన్నత రూపం అయిన సాహిత్యం, అలానే సంగీతం, నాట్యం కూడ (ఆటపాటలు) మొదట శ్రమ జనితాలు తప్ప మేధో జనితాలు కావు. భాషాభివృద్ధిలో లిపి కనుగొనడం తొలిమలుపైతే, వ్యాకరణాన్ని సమకూర్చుకోవడం మలిమలుపని చెప్పొచ్చు. కాని, లిపి, వ్యాకరణాలతోనే భాషా వికాసం సాధ్యమని మనం పొరబడరాదు. భాషకి మూలధాతువు ప్రజల్లోని 'పలుకుబడి'. ప్రజల పలుకుబడిని విస్మరిస్తూ, లేక చిన్నచూపు చూస్తూ చేసే వ్యాకరణ విన్యాసాలు పాండిత్య ఆర్భాటాలు భాషలోని జీవసారాన్ని హరించేస్తాయి. కనుకనే 'వాడుకభాష' కోసం గిడుగు, గురజాడ లాంటి భాషా సంస్కరణాభిలాషులు ఛాందసవాద పండితమూకతో తీవ్రంగా ఘర్షించారు. ప్రజల ప్రాపుకి, ప్రజల పలుకుబడికి దూరమైన ఏ భాషా ఎంతో కాలం మనజాలదు. ఇందుకు సంస్కృతానికి మించిన ఉదాహరణ లేదు. సంపద్వంతమైన వ్యాకరణాన్ని నిర్మించుకున్న, అపార సాహిత్యాన్ని సృష్టించుకున్న భాష సంస్కృతం. కాని, అది వందల సంవత్సరాలపాటు జనసామాన్యానికి వెలిగా ఉంటూ కులీన, పండిత, పాలకవర్గాల బంగారు పంజరంలో చిలకగానే ఉండిపోయింది. కనుకనే అదీనాడు ఒక 'మమ్మీ' గానే మన ముందు మిగిలింది.

ఇక విషయచర్చలోని వివాదాస్పద అంశాల గూర్చి చూద్దాం. 'తెలుగేముద్దు – ఆంగ్లం వద్దు' అనేది ఒక ధోరణి కాగా, ఆంగ్ల భాషా పరిజ్ఞానం నేడు తప్పనిసరి అవసరమనేది మరో ధోరణి. ఇంగ్లీషు పట్ల ఒక అవ్యాజమైన ఆకర్షణ అనేది మనలో ఉండటం అసహజమూ కాదు, యాదృచ్ఛికమూ కాదు. సుదీర్ఘ వలసపాలన పర్యవసానంగా ఆ వలసభాష మనల్ని చాలానే ప్రభావితం చేసింది. ఏమున్నా లేకున్నా నాలుగు ఇంగ్లీషు ముక్కలొస్తే ఎలాగోలా నెట్టుకు పోవొచ్చునే అభిప్రాయం మనలో జనాంతికంగానే ఉంది. అవసరం లేకపోయినా, సందర్భం కాకపోయినా మనలో చాలామంది స్వంత భాషలో మాట్లాడుతూనే మధ్యమధ్యలో ఆంగ్లాన్ని ఆశ్రయిస్తూ ఉంటారు. ఈ విషయంలో మన సినీతారలు, టీవీ యాంకర్ల గూర్చి చెప్పనే అక్కర్లేదు. ఇదంతా ఇంగ్లీషు పైన మోజని కొట్టిపారేయలేం. ఇంగ్లీషుతో పరిచయం, దాంట్లో ప్రావీణ్యం అనేవి ఎవరికైనా అదనపు అర్హతగా చెలామణి అవుతున్న స్థితిని మనం నిరాకరించలేం, అది వాస్తవం. ఇంతకంటే ప్రధానం ఏమంటే – ఇంగ్లీషు రాకుంటే ఆధునిక శాస్త్ర, సాంకేతిక రంగాలకు దూరం అయిపోతామనే ఆందోళన, ఆధునిక విద్యా ఉపాధి అవకాశాలను అందిపుచ్చుకోలేమనే భయం మనలో ఉంటున్నాయి. కనుక స్వంత భాష తెలుగుపై చిన్నచూపు లేకపోయినా, ఆంగ్లాన్ని మరి కొంత పెద్దగా చూడాలనే ధోరణి ఒకటి మనలో పనిచేస్తోంది. విద్యామాధ్యమంగా ఆంగ్లమే ఉండాలనడం, అదీ ప్రాథమిక విద్యాదశ నుండే ఉండాలనడం ఈ కారణంగానే. కాగా, అదే జరిగితే ఇక తెలుగుభాషకి నీళ్లొదులుకోవడమేనంటూ మరికొందరు ఆందోళన చెందుతున్నారు.

ఇదంతా చూస్తుంటే, కొన్ని రకాల భ్రమలకి ఆశలకిలోనై ఉంటున్న మనం వాస్తవికతని పట్టించుకోకుండా వాదనకోసమే వాదనలు చేసుకుంటున్నామనిపిస్తోంది. 'విద్య లేని వాడు వింత పశువు', 'సకల సంపదల్లో విద్య సంపదే ఘనం' 'అన్ని దానాల్లో విద్యాదానమే గొప్ప'. ఎంత గొప్ప సూక్తులు. కాని, వాస్తవికత ఏమిటి? ఏంచేసైనా సరే డబ్బు, ఆస్తులు పోగేసుకుంటున్నవారు సర్వాన్నీ శాసించే వాళ్లుగా ఉంటుండటం నేటి నిజం. విద్యను సైతం ఒక మాధ్యమంగా వాడుకుంటూ అనేకమంది 'విద్యాదాతలు'(!?) అపర కుబేరులైపోతున్న స్థితి నేటి వాస్తవం. 'ఎంత దానం చేసినా తరగని సంపద విద్యా సంపద' అనేది ఆర్యోక్తి. విద్యను ఎంత దానం చేస్తే సంపదను అంతగా

పోగేసుకోవచ్చనేది నేటి కార్పొరేట్ ఆర్యుల సూక్తి. నేడు విద్య నికార్సయిన వ్యాపారసరకుగా మారిపోయింది. పుట్టకొక్కుల్లా పుట్టుకొస్తున్న ప్రైవేట్ కార్పొరేట్ విద్యా సంస్థలు, ఘనత వహించిన మన 'ప్రజా' ప్రభుత్వాల విద్యా విధానాల్ని, కోర్టు తీర్పుల్ని సైతం శాసిస్తున్నాయి. అన్ని విషయాలలో అడుగడుగునా ప్రైవేట్‌కి దాసోహంకావడం, దన్నుగా నిలవడం ఇవాళ అన్ని పార్టీల ప్రభుత్వాల విధానంగానే ఉంటోంది. సర్కారీ బడులు, కళాశాలలు అనాథ శిశువుల్లాగ మారిపోతుండడానికి, అక్కడి చదువులు చెల్లని నాణేలు అయిపోతుండడానికి వెనుక కారణం ఇదే. రేపిక విశ్వవిద్యాలయాలు కూడ ప్రైవేట్‌న పడనున్నాయట. ఇకప్పుడు విద్యావ్యాపారం కొత్త పుంతలు తొక్కుతుంది, మరింత 'అభివృద్ధి' అవుతుంది. మన ప్రభుత్వాలు ఒక పక్క స్వయంగా, ఉద్దేశపూర్వకంగానే, ప్రణాళికాబద్ధంగానే ప్రభుత్వ విద్యాలయాల్ని అక్కడి చదువుల్ని సర్వనాశనం చేసేస్తూనే, మరో పక్క 'సంపూర్ణ అక్షరాస్యతా సాధన' 'నిరక్షరాస్యతా నిర్మూలన' గూర్చి ప్రచార ఊదర సాగిస్తూ ఉంటాయి. ఇందులో ఏదో వైరుధ్యం ఉన్నట్టు మనం పొరబడకూడదు. నిజానికిందులో చక్కని సమన్వయమే తప్ప వైరుధ్యం అంటూ ఏమీ లేదు. ఎందుకో చూద్దాం. కాల్గేట్ టూత్‌పేస్ట్, లక్స్ సబ్బు, పెప్సీకోలా, నిర్మాపౌడర్ తరహాలో మన ప్రభుత్వాలు సంపూర్ణ అక్షరాస్యత, నిరక్షరాస్యతా నిర్మూలన నినాదాలపై ప్రచారం చేయిస్తుంటాయి. పని మాన్పించేసి బడికి పంపిస్తే చాలు, తమ కామందు కూతురు లాగేనే తమ బిడ్డ సైతం రేపోమాపో డాక్టరో, ఇంజనీరో అయిపోతుందన్నట్టుగా పరవసించిపోయే పనిమనిషి ఇల్లాల్ని మనం ఈ ప్రచార ఘట్టాల్లో చూస్తూ ఉంటాం. ఏడ్వలేక నవ్వుకుంటుంటాం. చదువుకోమని సుద్దులు చెప్పడమే కాదు, తమ పిల్లల్ని బడికి పంపకుండా పనుల్లోకి తోలే తల్లిదండ్రుల్ని శిక్షార్హుల్ని చేస్తామంటూ ప్రభుత్వం బెదిరిస్తుంది. అంటే ఈ పనికిమాలిన చదువులు మా పిల్లలకు అక్కర్లేదనేనా ఆ తలిదండ్రులు వారిని బడికి పంపటం లేదు? లేక 'మాకీ చదువులొద్దు – మా పనిపాట్లే మాకు ముద్దు' అని ఆ బడుగు పిల్లలు మారాం చేస్తున్నారనుకోవాలా? విషయాల్ని ఇలా తరచి ఆలోచించే అవసరం మన ప్రభుత్వాలకి ఉండదు. ఈ విషయమై ఇప్పుడు మన ప్రభుత్వాల ముందు తక్షణ కర్తవ్యం ఒక్కటే. 'పనికొచ్చే అక్షరాశ్యుల్ని' త్వరత్వరగా తయారు చేసి అందించాలి. ఇది ఈ ప్రభుత్వాల్ని నియంత్రిస్తున్న వారి అవసరం, డిమాండ్, శాసనం.

దాన్ని మన ప్రభుత్వాలు కాదనలేవు, కాదనవు. తలూపి, తలొగ్గి మరీ తదనుగుణంగా నడుచుకుంటాయి. తదనుగుణంగా విధానాలు రూపొందిస్తాయి, వాటిని ఖచ్చితంగా అమలు చేస్తాయి. ఈనాడు దేశ విదేశాల్లో ఇబ్బిడిముబ్బిడిగా పుట్టుకొస్తున్న కాల్‌సెంటర్లు, బి.పి.ఓ. ప్రాజెక్టులనబడే కార్ఖానాల్లో రోజుకి ఎనిమిది గంటలు కాదు పద్దెనిమిది గంటలు పైగా పనిచేయాల్సిన లక్షలాది అక్షర కార్మికులు అవసరం అవుతున్నారు. కనుక 'అక్షరాస్యత' పెంపుదలకి మన ప్రభుత్వాలు చేస్తున్న కృషి వృథాప్రయాస అనుకోలేం. అది సార్థకమే. పోతే, ఈ మధ్య మన ప్రభుత్వాలు ప్రభుత్వ పాఠశాలల్లో కూడ ఆంగ్లమాధ్యమాన్ని ప్రవేశ పెడతామంటున్నాయి. అదీ ప్రాథమిక విద్యాదశ నుంచేనట. ఎందుకట? ఇదేమంత అర్థం చేసుకోలేని విషయం ఏమీ కాదు. మన మాజీ చంద్రబాబు ప్రభుత్వమే కాదు, తాజా రాజశేఖరరెడ్డి ప్రభుత్వం సైతం 'సేవారంగం' కి ఇస్తున్న ప్రాధాన్యత ప్రచారాలు విషయాన్ని మనకు అరటి పండు ఒలిచి పెట్టినట్టు అర్థం చేయిస్తాయి. 'వ్యవసాయం శుద్ధ దండగ', 'ఇప్పుడే ఇజమూ లేదు ఒక్క టూరిజం తప్ప' అనే చంద్రబాబు సూక్తి ముక్తావళి మన చెవుల్లో గింగురుమంటూనే ఉంది. ఇకిప్పుడు రాజశేఖరరెడ్డిదీ అదే పాట, అదే బాట. మరింతగా కొత్తపుంతలు తొక్కుతోంది కూడ. 'సేవరంగం' ప్రాధాన్యత గూర్చి, అది అందించే ఉపాధి అవకాశాల గూర్చి రాజశేఖర రెడ్డి ప్రభుత్వం ఊదరగొడుతోంది. 'సేవారంగం' అంటే మహాసాత్వికంగా, నాజూకుగా, ప్రేమ దయ జాలువారుతున్నట్టు అనిపిస్తుంది కదా. కాని, ఈ రంగమంతటా ఉండేది పచ్చి వ్యాపారం నిలువు దోపిడీ తప్ప వేరు కాదు. దగా, దౌర్జన్యం, క్రూరవ్యాపార దోపిడీలకి వేస్తున్న మేలి ముసుగే 'సేవ'. ఇందుకు రుజువులు, సాక్ష్యాలు, వివరాలు అవసరం లేదు. సామాన్య ప్రజల బతుకుబాధలన్నీ ఇందుకు సజీవసాక్ష్యాలే.

విద్య, వైద్యం, సాగునీరు, తాగునీరు ఇవన్నీ ఫక్తు వ్యాపార సరుకులైపోవడం నేటి నిజం. యుద్ధ బీభత్సాన్ని సైతం మరిపించే తీరులో రాష్ట్రాన్ని గడగడలాడిస్తున్న చికున్‌గున్యా, డెంగ్యూ జ్వరాల బారిన పడి చనిపోయిన వారంతా ప్రజలకందే వైద్య ఆరోగ్యసేవలకి మృతసాక్ష్యులు. కాగా జీవచ్ఛవాల్లా బతుకుతున్న వారంతా సజీవ సాక్ష్యులే కదా. ఘరానా రాజకీయ నాయకుల దన్ను, అధికారదండధరుల అండ ఉన్నవాళ్లు వ్యక్తులుగా, ముఠాలుగా, కంపెనీలుగా, కార్పొరేషన్లుగా అడవుల్ని, కొండల్ని, వ్యవసాయ భూముల్ని, ఇసకదిబ్బల్ని, వల్లకాడుల్ని, సముద్రతీరాల్ని, ఆకాశాన్ని, పాతాళాన్ని అన్నింటినీ దురాక్రమించేస్తున్నారు. సామాన్య ప్రజల్ని తన్ని తరిమేస్తున్నారు. పేదల శవాలు కాల్చడానికి పూడ్చడానికి అడుగు జాగా సైతం లేకుండా చేస్తున్నారు. ఈ అమానుష నరహంతక బేహార్లు రేపు గాలిని వెలుతురుని సైతం కబ్జా చేసేసి ప్లాస్టిక్ ప్యాకెట్లలో, సీసాల్లో సీల్‌చేసి మరీ అమ్మకంపెడతారు. వాటిల్లో కూడా పట్టుదినుసులు, నూనె, కిరసనాయిలు, విత్తనాలు, మందులు, పురుగు మందులు లాగానే రకరకాల కల్తీలు నకిలీలు షరా మామూలే. కాని, దాన్ని అమ్మకం అని, వ్యాపారం అని అనరు. అదంతే.. 'సేవ' అంటారు. ఇలాంటి 'గాలిసేవలు', 'వెలుతురు సేవలు' అందుకోడానికి మనం ఇప్పటి నుండే మానసికంగా సిద్ధం కావాలి. ఇలాంటి 'సేవలు' అందుకుంటూ ప్రజలు తరించేట్టు సర్వ జాగ్రత్తలూ తీసుకుంటూ మన ప్రభుత్వాలు, చట్టాలు, కోర్టులు, పోలీసు యంత్రాంగం అబ్బురపరచే సమన్వయంతో పని చేస్తుంటాయి. ఈ సేవలందించే సేవక్ కంపెనీలకీ, సేవక్ కార్పొరేట్లకీ అనుక్షణం సహకారాన్ని అడగకుండానే అందిస్తాంటాయి. సేవలందుకునే ప్రజలు కిమ్మనకుండా ఇలాంటి 'సేవ'లన్నింటినీ అనుభవించేట్టు చేస్తాయి.

ఇలా 'సేవారంగం' విశ్వరూపం గూర్చి చెబితే పెద్ద గ్రంథమై పోతుంది, గనుక ఇంతటితో ఆపుదాం. 'సేవారంగం' అంటే ముసుగేసుకున్న వ్యాపార రంగం తప్ప వేరు కాదని చెప్పుకుంటే సరిపోతుంది. ఈ రంగంలోకి ఇప్పుడు బడాబడా దేశవాళీ, విదేశీ కంపెనీలు జోరుగా ప్రవేశిస్తున్నాయి. కాల్‌సెంటర్లు, బి.పి.ఓల గూర్చి ముందే చెప్పుకున్నాం కదా. ఇవే కాదు, ప్రజల నిత్యజీవితావసరాలైన

సరుకులన్నింటినీ ఒకే చోట అమర్చి అమ్మటం ద్వారా ప్రజలకి అపార సేవాసౌకర్యాలందించడానికి 'మహామాల్స్' వచ్చేసాయి. ఇక మనం చిల్లర కొట్టు చిట్టమ్మల్ని, చింతామణి సుబ్బిశెట్టిల్ని మరచిపోవాలి. చిల్లర వ్యాపారాన్ని బడా కంపెనీలు బంధిస్తున్నాయి. ప్రపంచంలోనే అతిపెద్ద రిటైల్ (చిల్లర) వ్యాపార సంస్థ అయిన 'వాల్-మార్ట్' 'భారతీ ఎంటర్‌ప్రైజెస్' అనే దేశవాళీ కంపెనీతో ఒప్పందం కుదుర్చుకుని దేశీయ రిటైల్ మార్కెట్‌లోకి ప్రవేశిస్తోంది. ఇప్పటికే మన రాష్ట్రంలో అంబానీలకి చెందిన ఒక మహామాల్ తన వ్యాపారాన్ని తెరచింది (రిలయన్స్). రిలయన్స్‌తో పాటు టాటా, భారతీ, ఆదిత్య బిర్లా వంటి బడాదేశీయ కంపెనీలు మెట్రో, టెస్కోలాంటి విదేశీ బహుళజాతి కంపెనీలు మన దేశీయ చిల్లర మార్కెట్‌ని ఆక్రమించనున్నాయి. ఈ 'మహామాల్స్' ద్వారా ఈ దిగ్గజ కంపెనీలు తమ 'సేవల్ని' దేశం నలుమూలలకే గాక విదేశాలలో సైతం విస్తరింపజేయాలి కదా.

మరి ఈ గొప్పగొప్ప సేవా కార్ఖానాలలో పనిచేయడానికి 'పనివారు' (వారిని కార్మికులనలేం, వారికెలాంటి కార్మిక హక్కులు, కార్మిక చట్టాలు వర్తింపు కావు గనుక) కావాలి కదా. ఈ 'పనివారు' సాంప్రదాయక కార్మికుల్లా చింకిరిమంకిరిగా ఉండడానికి వీల్లేదు కదా. వీరంతా 'అక్షరాస్యచిలకలై' ఉండాలి. పైగా ఇంగ్లీషు అక్షరాస్య చిలకలై కూడా ఉండాలి. తెలుగు అక్షరాస్య చిలకలు ఇక్కడ చెలామణి కావు. అందుకని చిలకపలుకుల ఇంగ్లీషు అక్షరాస్యుల్ని ఆఘమేఘాల మీద తయారు చేసి అందించాల్సిన బరువు, బాధ్యతలు మన ప్రభుత్వాలపై పడ్డాయి. అక్షరాస్యత పెంపు గూర్చి, ప్రభుత్వ పాఠశాలల్లో సైతం ప్రాథమిక విద్యాదశ నుంచే ఆంగ్లమాధ్యమాన్ని ప్రవేశపెట్టడం గూర్చి, 'సేవారంగం' ప్రాధాన్యత గూర్చి రాజశేఖర రెడ్డి ప్రభుత్వం ఎందుకంతగా హంగామా చేస్తుందో ఇప్పుడు చక్కగానే అర్థమవుతుంది. అంటే మనల్ని న్యూటన్లు, డాల్టన్లు, ఐన్‌స్టీన్లు, రామన్‌లు, జగదీష్ చంద్రబోస్‌లు, రామానుజంలో, విశ్వేశ్వరయ్యలు, ద్వారకానాథ్ కొట్నీసులుగా చేసేయడానికి గాని లేక మనల్ని షేక్స్పియర్లు, మిల్టన్‌లు, షెల్లీలు, వర్డ్స్‌వర్తలు, కార్లైలుగా మార్చేయడానికి గాని ఇంగ్లీషు మాధ్యమం రావడం లేదు. కేవలం 'చిలకపలుకుల ఆంగ్ల అక్షరాస్యుల్ని' తయారు చేయడమే లక్ష్యంగా వస్తోంది. ప్రైవేట్, కార్పొరేట్ విద్యాలయాల్లో ఆంగ్ల మాధ్యమంలో 'చదువుకొనే' స్తోమత గల వారు ఇలా 'చిలకల్లా' పనిచేయడానికి అంత తేలిగ్గా సిద్ధపడిపోరు. వారి చూపులు, అంతకంటే వారి తలిదండ్రుల చూపులు ఎప్పుడూ అమెరికా, బ్రిటన్ లాంటి విదేశాల మీదే ఉంటాయి. అంటే వారంతా విదేశాలకే పోతున్నారని, అక్కడ ఎంత గొప్పగా ఉంటున్నారని చెప్పడం కాదు. వారి ఆశలు, ఆలోచనలు అలా ఉంటాయని చెప్పడానికే. నిజానికి వారిలో అత్యధిక శాతం మంది పాపం వారి ఆశలన్నీ అడియాశలై ఎక్కడికక్కడ సర్దుకుపోతూనే ఉన్నారు. అలాంటి వారిలా లేనిపోని ఆశలు అంచనాలు పెట్టుకోకుండా 'మేమిందుకోసమేగా ఉన్నాం' అన్నంత సంసిద్ధతతో సర్దుకుపోగల ఆంగ్ల అక్షరాస్యతా చిలకలు పుట్టుకొచ్చేది ప్రభుత్వ పాఠశాలలనుంచే.

ప్రభుత్వ పాఠశాలల్లో ఆంగ్లమాధ్యమాన్ని ప్రవేశపెట్టాలనే ప్రభుత్వ ఆలోచన నేపథ్యం క్లుప్తంగా ఇది తప్ప వేరు కాదు. సరే, ఈ మాత్రం సైతం మనకెంతో అవసరమే కదా? అంటే నిజమే, ఈ మాత్రం కోసం సైతం అర్రులు చాచే దయనీయ స్థితిలో మనముంటున్న మాట వాస్తవమే. కాని, ఈ మాత్రం దానికీ స్వంత భాషని (తెలుగు) కాదని ప్రాథమిక దశనుంచే ఆంగ్లమాధ్యమాన్ని ఆహ్వానించాల్సిన అవసరమైతే లేదు. ఎప్పటిలానే ఉన్నత పాఠశాల దశవరకు ఆంగ్లాన్ని ఒక సబ్జెక్ట్‌గా చదువుకుంటూ అటుపై ఆంగ్ల మాధ్యమాన్ని అందుకోవచ్చు. కార్పొరేట్ కార్ఖానాల్లో పనివారుగా చేయడానికి ఆ మాత్రం సరిపోతుంది. లేదూ, అంతకంటే ఉన్నత స్థాయికి ఎదగాలనే సంకల్పబలం, కృషి ఉన్నవారికి కేవలం మాధ్యమం మాత్రమే ఆటంకం అయిపోదు. అలాంటి వారు మాధ్యమాటంకాన్ని సుళువుగానే అధిగమించగలరు. లేత వయసు నుంచే ప్రారంభమయ్యే బుద్ధి వికాసానికి, వివిధ విషయాల్ని సుళువుగా ఆకళింపు చేసుకోడానికి స్వంతభాష ఉపకరించినంత చక్కగా పరభాష ఉపయోగపడదు. అందుకని ఆటకంగానే ఉంటుంది, హానీ చేస్తుంది.

ఇప్పటివరకు మనం మాట్లాడుకున్నదంతా బడిలోకి వెళ్లగలిగి కనీసం హైస్కూల్ స్థాయివరకైనా చదువుకోగల అవకాశాలున్న వారి గురించే. ఈ మాత్రం అవకాశాలు కూడా లేని అభాగ్య బడుగుజీవులే మనలో ఎక్కువ మంది. బడి ముఖంకోసమే ముఖం వాచిపోయే దళితులు, ఆదివాసీలు, ఇంకా గ్రామీణ ప్రాంతాల్లోని నిరుపేదలెందరో. అలాంటి వారికి బడిని, అక్షరాల్ని పరిచయం చేయడమే అసాధ్యమైపోతుంటే, ఇక వారికి ఆంగ్ల మాధ్యమంతో తప్ప తెలుగు మాధ్యమంతో పనిలేదని, తెలుగు మాధ్యమంతో వీరికి ఘోర అపచారం జరిగిపోతుందని చెప్పడం విస్మయం కలిగించే విషయం. 'కూడే లేదురా కొడుకా అంటే కోడి కూరేసుకు తినేస్తానులేమ్మా' అన్నట్టుందిది.

పోతే ఇంగ్లీషు పట్ల అభిమానం ఆకర్షణ కలిగుండటమే వలసబానిస తత్వమని, సామ్రాజ్యవాద అనుకూలత అని ఎద్దేవా చేయడం ఎంతమాత్రం సమర్థనీయం కాదు. ఒక్క ఇంగ్లీషే కాదు, చైనీస్, జర్మన్, జపనీస్, ఫ్రెంచ్ లాంటి వివిధ విదేశీ భాషల్లో ప్రవేశం ప్రావీణ్యం అభిలషణీయం, అభినందనీయం, ప్రయోజనకరం కావా? అయితే వాటికోసం స్వంతభాషను విస్మరించాలా? అది తగని పని. స్వంతభాష పట్ల గౌరవాభిమానాలు ప్రదర్శించని వాళ్లని ఇతరులు సైతం హర్షించరు. స్వభాషా దురాభిమానం పరభాషా ద్వేషం తగవు గాని, స్వభాషాభిమానం తప్పు కాదు. పైగా అది అత్యంత అవసరం కూడ. ఈ విషయంలో మనం మన ఇరుగుపొరుగు రాష్ట్రాల నుండి అలానే ఇతర దేశాల నుండి నేర్చుకోవాల్సి ఉంది. కేరళ, తమిళనాడు, పశ్చిమబెంగాల్ లాంటి రాష్ట్రాల ప్రజలకి, ఇంగ్లీషుతోని సాంగత్యం, మనకంటే తక్కువేమీ కాదు. అయితే వారు తప్పదనుకుంటే తప్ప మనలాగా ఇంగ్లీషు వాడకానికి ఉత్సాహపడరు. రష్యా, చైనా, జర్మనీ, జపాన్ నాయకుల్ని చూస్తుంటాం. వారంతా తమ విదేశీ పర్యటనలలో తమవెంట తప్పనిసరిగా దుబాసీలను తీసుకుపోతుంటారు. ఎందుకంటే వారు తప్పనిసరిగా వారివారి స్వంత భాషల్లోనే మాట్లాడుతుంటారు. వారికి ఇంగ్లీషు రాకనా? లేక స్వంత భాషలో మాట్లాడటం వారు గొప్పగా భావిస్తారు గనుకనా? ఈ రెండూ కారణాలు కానేకావు. అసలు కారణం ఏమంటే, స్వంత భాషలో మన వ్యక్తీకరణకు ఉండే సౌలభ్యం, స్పష్టత, ఖచ్చితత్వం, నిర్దుష్టత పరభాష ద్వారా రాబట్టలేం. ఇది ఎవరి విషయంలోనైనా, ఎంతటి వారి విషయంలోనైనా వాస్తవమేనని గ్రహించాలి. కాగా, రష్యా, చైనా, జపాన్,

జర్మనీ లాంటి దేశాలు తమతమ భాషల్ని కాదని, ఆంగ్లానికి దాసోహం అనటం లేదు. అయినా ఆయా దేశాలలో విద్యావైజ్ఞానిక రంగాలు, శాస్త్ర సాంకేతిక రంగాలు అమెరికా బ్రిటన్‌లకు ధీటుగాను కొన్ని సందర్భాలలో అంతకంటే ఎక్కువగా కూడా పరిఢవిల్లుతూనే ఉన్నాయి. కనుక ఆధునిక శాస్త్ర సాంకేతిక రంగాలలో రాణింపుకి ఆంగ్లాన్ని ఆశ్రయించడమే శరణ్యం అని అనుకోవాల్సిన పని లేదు. కాగా, అందుకోసం స్వంతభాషని వదలుకోవాల్సిన అవసరం అంతకంటే లేదు.

ఇక తమ పిల్లల్ని చక్కగా ఇంగ్లీషు చదువులు చదివించుకుని, విదేశాలకి సైతం పంపి అక్కడ ఉన్నత చదువుల్లోను, ఉన్నతోద్యోగాలలోను స్థిరపరచుకున్న వాళ్లు తెలుగు భాష అవసరం గూర్చి, గొప్పదనం గూర్చి మాట్లాడుతున్నారు. వారు మాత్రం ఇంగ్లీషు చదువులతో పైపైకి పాకేస్తారు, ఇతరులు మాత్రమే తెలుగునే నెత్తికెత్తుకుని మడుగునీరులా పడుండాలంటున్నారు. ఇదేమి న్యాయం? ఇది కుట్ర కాదా? అని కొందరు నిలదీస్తున్నారు. ఇలాంటి విమర్శలకు వివేచించడంలో కొంత ఇబ్బంది ఉంటుంది. ఎందుకంటే, ఏమి చెబుతున్నారు? ఎవరు చెబుతున్నారు? అనేది రెండు భిన్నాంశాలు. ఒకరు చెప్పే విషయానికి వారి స్వంత ఆచరణకి పొంతన లేని తీరు ఉంటే అది విమర్శార్హమే. నిలదీయాల్సిందే. కాని ఒక మంచి విషయాన్ని, నలుగురూ అనుసరించాల్సిన విషయాన్ని తమ స్వంత ఆచరణతో పాటించని వారు కొందరు కూడా చెప్పినందునే అది నిందార్హం, విస్మరణీయం అయిపోదు. సమర్థనీయం కాకుండా పోదు. ప్రభుత్వ పాఠశాలల్లో విద్యామాధ్యమంగా తెలుగునే కొనసాగించాలని కోరుకుంటున్నది. తమ పిల్లల్ని ఇంగ్లీషు చదువులు చదివించి వారిని విదేశాలకి సైతం పంపిన ఒకరిద్దరు లేక పిడికెడుమంది మాత్రమేనా? అలా కోరుకుంటున్న వారిలో ఇలాంటి వారు సైతం కొందరుండొచ్చు. ఇలాంటి వారు అలా కోరడానికి తగినంత నైతికశక్తి లేనివారే కావొచ్చు. కానీ పెద్దపెద్ద ఇంగ్లీషు చదువుల్నీ, విదేశాలలో చదువుల్నీ అందుకోలేని, కనీసం వాటిని ఊహించుకోలేని అనేకమంది తెలుగుమాధ్యమమే కొనసాగాలంటున్నారు కదా. అయినా ఆ పిడికెడు మందిని చూపెడుతూ వీరందిరినీ కాదనాలా? ఒక విషయానికి సంబంధించిన గుణదోషాలకి ప్రాధాన్యతనిస్తూ వాటిపై కేంద్రీకరిస్తూ చర్చించడం గాక, విషయాన్ని చర్చించే వ్యక్తుల్ని లక్ష్యంగా చేసుకుని చర్చ నడపడమనేది ఇటీవల చర్చించబడుతున్న అనేక విషయాలలో ఒక ధోరణిగానే ప్రదర్శితమవుతోంది. ఇది విషయ వివేచనకి పెద్ద ఆటంకంగా ఉంటుందని గుర్తిద్దాం.

ఇక 'భాషామతల్లి – భావోద్వేగాలు' గూర్చి చూద్దాం. ఈ భావోద్వేగాల ఇబ్బందుల నుండి బయటపడడానికీ 'తల్లిభాష' బదులు 'స్వంత భాష' అనుకుంటే సరిపోతుందనే సూచన ప్రారంభంలోనే చేసాను. అది నా వ్యక్తిగత అభిప్రాయమే. నిజానికి మనమంతా మన భాషని తల్లిభావంతో చూడడానికి, చెప్పడానికి అలవాటుపడి ఉన్నాం. కనుక 'ఎక్కడి తెలుగుతల్లి? ఎవరి తల్లి?' అనే తెరాస అధినేత కె.సి.ఆర్ వ్యాఖ్యలు మనలో చాలామందికి కంట్రగింపు కావడం సహజమే. కనుకనే 'తల్లినే కాదనడమా, లేదనడమా' అంటూ చాలా మంది కె.సి.ఆర్. పై కస్సుమన్నారు. కుంతిలాంటి తల్లిని కర్ణుడు లాంటి కొడుకు కాదనడా అని మరి కొందరు ప్రశ్నించారు. కుంతిని తప్పు పట్టడమేమిటి? ఇది మహిళలను కించపరచడం కాదా? అంటూ స్త్రీవాద కోణంలో మరి కొందరు ప్రశ్నించారు. కుంతిని తప్పు పట్టకూడదు సరే. కాని మరి కర్ణుడి అనాథ బతుక్కి కారకులెవరు, బాధ్యులెవరు? అనేది తేల్చాలికదా. కుంతి కథలో అసలు దోషి, ద్రోహి సూర్యుడు అని కుంతీ అనదు, కర్ణుడూ అనడు మనమూ అనం. దొంగచాటుగా కన్య కుంతిని కలిసి తల్లిని చేసి తప్పుకున్న సూర్యుడు దోషే కాదు. పైగా అతడు 'వీరప్రసాది'. కాని వరఫలాన్ని చూసే కుంతి మాత్రమే దోషి. తల్లి నుంచి తన జన్మవృత్తాంతం తెలుసుకున్న తరువాతనైనా సూరకర్ణుడికి తన దొంగతండ్రి సూర్యుడ్ని నిలదీయాలన్న ఆలోచనే రాదు. అతడు సైతం తల్లినే నిందిస్తాడు. కుంతి కథ మనకి చాలానే చెబుతుంది. మహరాజ పుత్రి అయినా, తరువాత మహారాణి అయినా ముందు ఆమె స్త్రీ, అటుపై తల్లి. కనుక తన సర్వసమస్యలకీ, కష్టలకీ తానే బాధ్యురాలు. అదీ అసలు విషయం. కనుక 'మాతృత్వం అనేది మాకు వరమూ కాదు, అదో గొప్పా కాదు. పునరుత్పత్తి అనేది ఒక సామాజిక అవసరం. సామాజిక బాధ్యత. సమాజంలో స్త్రీ పురుషులిద్దరూ సమంగా పంచుకోవాల్సిన బాధ్యత ఇది. కాగా ఇందుకు మమ్మల్ని మాత్రమే బాధ్యుల్ని చేస్తూ, పురుషులు తమ బాధ్యత నుండి తప్పుకోడానికే 'మాతృత్వం' అనేదాన్ని గొప్ప చేసి మా నెత్తిన రుద్దారు' అనే స్త్రీవాదుల విమర్శని, ఆవేదనని, ఆక్రోశాన్ని మనం ఏ మేరకు అర్థం చేసుకోగలుగుతున్నామో స్వీకరించగలుగుతున్నామో, ఆత్మపరిశీలన చేసుకోవాలి.

కుంతి కాలం నుంచి ఈ నాటికీ స్త్రీల కథల్లో ఏ మార్పు లేదు. సవతి తల్లి కథలు, సవతుల కథలు, అత్తాకోడళ్ల కథలు, తన భర్తని వలలో వేసుకుని తన సంసారంలో నిప్పుపెట్టిందని మరో మహిళపై నిప్పులు చెరిగే ఇల్లాలి కథలు, వీటన్నింటి వెనుక పూసల్లో దారంలా పనిచేసేది పురుషాధిపత్య పితృస్వామ్య భావజాలం, సంస్కృతులే. తల్లిగా, అక్కచెల్లెలుగా, భార్యగా, కూతురుగా, ప్రేయసిగా స్త్రీని అన్ని విధాలా అనుక్షణం అసహాయురాల్ని చేస్తూ, అభద్రతా స్థితికి నెట్టేస్తూ స్త్రీల సమస్యలకి బాధలకి స్త్రీలే కారణం, బాధ్యులన్నట్టుగా చిత్రించే, నిరంతరం శతకోటి రూపాల్లో వ్యక్తమయ్యే పురుషాధిపత్య పితృస్వామిక భావజాల వ్యక్తీకరణలు పర్యవసానాల పట్ల మనం తగినంత అవగాహనతో ఉండడం, అప్రమత్తంగా ఉండడం అవసరమే. కాని, స్త్రీలు సైతం తప్పులకి, లోపాలకి, బలహీనతలకి అతీతులేం కారు. సర్వవిధ అవగుణాలకి స్త్రీలు మాత్రమే అతీతులని చెప్పడం స్త్రీవాదమూ కాదు. స్వార్థం, సంకుచితత్వం, ఈర్ష్య, అహంకారం, సుఖలాలసత, అధికారవ్యామోహం లాంటి లక్షణాలు మానవ సహజవికారాలనే చెప్పొచ్చు. కాగా ఇవి అసమవర్గసమాజంలో మరింత ప్రభావంతో ఉంటాయి. కనుక వీటికి స్త్రీలు సైతం మినహాయింపు కాదు. నిజానికిక్కడ స్త్రీవాదానికి సంబంధించిన చర్చ అప్రస్తుతమే. కాని, ఒక విషయంపై జరిగే ప్రధాన చర్చ అనుద్దేశపూర్వకంగా యాదృచ్ఛికంగా దొర్లే కొన్ని పదాలు, వ్యాఖ్యలు వేరు కోణంలో వేరు విషయంలో వివాదాస్పదం, విమర్శార్హం కావొచ్చు. దాన్ని ఆ మేరకే పరిమితంగా ప్రస్తావించాలి. అంతే తప్ప ప్రధాన చర్చనీయాంశాన్ని పక్కకు నెడుతూ అదే అసలు చర్చనీయాంశం అయిపోకూడదు.

ఇకిప్పుడు తిరిగి ప్రధాన చర్చలోకి వెళదాం. తెరాస నేత కె.సి.ఆర్ తెలుగుతల్లి తన తల్లి కాదన్నాడు. తన తల్లి తెలంగాణ అన్నాడు. శంకరంబాడి సుందరాచారి గీతం 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' గీతాన్ని, ఆ గీతం స్ఫూర్తితో రూపుదిద్దుకున్న 'తెలుగుతల్లి' విగ్రహం / చిత్రం ని కాదంటూ, కె.సి.ఆర్. చేసిన వ్యాఖ్యగా ఇది కనబడుతుంది. అయినా కూడా కె.సి.ఆర్. ప్రస్తుత రాష్ట్రంలోని తెలంగాణేతర ప్రాంతాన్ని కాదంటున్నాడా లేక తెలుగు భాషనే కాదంటున్నాడా అనేది అంత స్పష్టంగా లేదు. చాలామంది విమర్శకులు అతడు తెలుగు భాషనే కాదంటున్నట్టుగానే అభిప్రాయపడుతున్నారు. అయినపుడు తెలుగుగాక తెలంగాణకు వేరు భాష ఏదైనా ఉందా? అనే ప్రశ్న రాకతప్పదు. తెలంగాణ భాష అంటే తెలుగుభాష లోనే ఒక భాగమైన తెలంగాణ మాండలికం తప్ప, వేరొకటి ఏమీ లేదు. అంటే తెలంగాణ మాండలికమే తన తల్లి తప్ప తెలంగాణేతర ప్రాంతాల మాండలికాలు ఏ ఒక్కటీ తన తల్లి కాదని అతడభిప్రాయ పడుతున్నట్టు మనం భాష్యం చెప్పుకోవాలి. 'భాష్యం' అని ఎందుకనాల్సి వస్తోందంటే కె.సి.ఆర్ వ్యాఖ్య భాషని దృష్టిలో పెట్టుకు చేసిందా లేక ప్రాంతాన్ని దృష్టిలో పెట్టుకు చేసిందా అనే స్పష్టత నాకైతే లేదు. నా మట్టుక్కు నేను ఇది ప్రాంతాన్ని దృష్టిలో పెట్టుకు చేసిన వ్యాఖ్య అనే అనుకుంటున్నాను. లేదూ, భాషని దృష్టిలో పెట్టుకునే అతడు ఈ వ్యాఖ్య చేసాడంటే అర్థం తెలంగాణ మాండలికాన్నే అతడు వేరు భాషగా భావిస్తున్నట్టు అర్థం చేసుకోవాలి. ఇది సరైందేనా? సమర్థనీయమేనా? అనేది వేరు విషయం. ఆ చర్చలోకి తరువాత వెళదాం.

కె.సి.ఆర్ వ్యాఖ్యపై చర్చ కొనసాగుతుండగానే ఈ చర్చలోకి మరో వివాదాంశం ప్రవేశించింది. 'తెలుగుభాష' అనేది తెలంగాణ ప్రాంత ప్రజలది మాత్రమేనని, రాష్ట్రంలోని తెలంగాణేతర ప్రాంతాల వారి భాష 'తెలుగు' కానేకాదని, వారి భాష 'ఆంధ్రం' అని, నన్నయ కాలంలో తెలంగాణేతర ఆంధ్ర ప్రాంతం వారిని ఆంధ్రులనే అన్నారు తప్ప తెలుగు వారని అనలేదని, తెలంగాణకు చెందిన 'తెలుగు' శబ్దాన్ని శంకరంబాడి దొంగిలించి తెలంగాణను దోచుకునే మొదటి దోపిడీదారుడిగా నమోదయ్యాడని, ఒక విమర్శ వచ్చింది. ఈ విమర్శలో చారిత్రక దృష్టి, సాహితీ దృష్టి రెండూ కొరవడ్డాయని, తెలుగు-ఆంధ్రం పదాలు వేరు కాదని, అవి సమానార్థకాలేనని, అవి పర్యాయపదాలు మాత్రమే నంటు ప్రతి విమర్శ వచ్చింది. ఈ విమర్శ ప్రతివిమర్శ ముందే భాష చర్చ సందర్భంగా తాను రాసిన ఒక వ్యాసంలో ఎ.బి.కె ప్రసాద్ గారు (అధికార భాషా సంఘం అధ్యక్షులు) 'ఆంధ్ర' శబ్దం జాతిని సూచించేదని, 'తెలుగు' భాషని సూచించే శబ్దం అని సరిగ్గానే పేర్కొన్నారు. ఈ రెండూ సమానార్థకాలుగానే, పర్యాయపదాలుగానే వాడబడుతుండటం అనేది పరిపాటే. సి. నారాయణరెడ్డి రాసిన ఒక సినీగీతంలో 'తెలుగు జాతి మనది-నిండుగ తెలుగు జాతి మనది' అని 'తెలుగు' ని జాతిపరంగా చెప్పడాన్ని మనం జ్ఞాపకం చేసుకోవచ్చు. కొన్నింటిని మనం సమానార్థకాలుగా, పర్యాయపదాలుగా వాడేస్తున్నా కూడా వాటి మధ్య భిన్నమైన, ప్రత్యేకమైన, నిర్దిష్టమైన ప్రయోగతేడాలు, ప్రయోజన తేడాలు అనేవి ఉంటూ ఉంటాయి. అయితే అలాంటి తేడాల్ని మనం సాధారణంగా పట్టించుకోం. 'ఆనందం', 'సంతోషం' అనేవి సమానార్థకాలే. అయినా కొన్ని చోట్ల 'ఆనందం' నప్పినంత చక్కగా 'సంతోషం' నప్పదు. అలానే మరికొన్ని చోట్ల సంతోషం నప్పినంతగా ఆనందం నప్పదు. ఒక శబ్దం (పదం) అంటూ ఉండగా దానికి సమానార్థకంగా, పర్యాయంగా ఇంకో శబ్దం లేక మరి కొన్ని శబ్దాలు ఉండడాన్ని మనం ఎలా అర్థం చేసుకోవాలి? అవి పర్యాయాలే, సమానార్థకాలే అయినా సందర్భరీత్యా దేనికది ప్రత్యేక నిర్దిష్ట ప్రాధాన్యత కలది గానే ఉంటుంది. దేని ప్రయోగం దానికి సందర్భాన్ని బట్టి ఉంటూ ఉంటాయి. మరో రకంగా చెప్పాలంటే, అవి సమానార్థకాలే అయినా ఏ చిన్న తేడా సైతం లేని సమానార్థకాలు మాత్రం కావు. ఒక శబ్దం ఉండగా ఎట్టి తేడా లేని మరో సమానార్థక శబ్దం అవసరం ఉండదు. అలాంటిది ఒకే శబ్దానికి ఒకటికి మించిన సమానార్థకాలుండడమంటే వాటి మధ్య సమత్వంతో కూడిన వైవిధ్యం ఉందని గ్రహించాలి. భాషలోని ఈ వైవిధ్యాన్ని, వైచిత్రిని మనం ఆకళింపు చేసుకోవాలి. అంతేకాదు శబ్ద ఉత్పత్తుల (పద ఉత్పత్తుల) చారిత్రక నేపథ్యాన్ని సైతం ఆకళింపు చేసుకోవాలి. ఇలా చూసినపుడు 'ఆంధ్రం' అనేది జాతి సూచికమని, 'తెలుగు' అనేది భాషా సూచికమని సవ్యంగానే అర్థం చేసుకోగలుగుతాం.

కనుక తెలంగాణ ప్రాంత ప్రజల భాష, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని తెలంగాణేతర ప్రాంతాల వారి భాష 'తెలుగే' తప్ప వేరు కాదు. అంటే ప్రస్తుత మన రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల వారి భాష ఒక్కటే, అది తెలుగే. కాని, వివిధ ప్రాంతాలలో భిన్న 'మాండలికాలు' ఉన్నాయి. 'మాండలికం', 'యాస', 'నుడికారం', 'పలుకుబడి' అంటూ వివిధ శబ్దాలు (పదాలు) వాడుతుంటాం. వీటిలో కొన్నింటిని లేక అన్నింటినీ సుమారుగా సమానార్థంలోనే చెబుతుండడం కూడ కద్దు. కాని వీటి మధ్య స్వల్ప తేడాలుంటూనే ఉంటాయి. తేడా స్వల్పమే అయినా ప్రతిదానికీ దానికే అయిన ప్రయోజనం, ప్రాధాన్యత ఉంటాయి. ఉదాహరణకి 'యాస'ని కొందరు 'మాండలికం'కి బదులుగానే చెబుతుంటారు. కాని, 'యాస' అనేది కేవలం లేక ప్రధానంగా ఒక పద ఉచ్చారణ తేడాని చెప్పేది మాత్రమే. కాని 'మాండలికం' అంతే కాదు, అంత కంటే కొంత భిన్నం. కొంత అదనం కూడ. 'యాస తేడాలు, మాండలిక తేడాలు ఉన్నా భాష ఒకటే కదా. మరి ఇంత రాద్ధాంతమెందుకు? మాండలిక తేడాలు పట్టుకుని భాషే వేరన్నంతగా మాట్లాడటం తగునా? అవసరమా?' అని కొందరు నిష్ఠూరంగా ప్రశ్నించొచ్చు. కాని, యాస తేడా పెద్ద తేడా కాకపోయినా మాండలిక తేడా చిన్న తేడా ఏమీ కాదు. సుమారుగా వేరు భాషంతటి తేడాయే అది. కానీ ఈ తేడా తీవ్రతని పట్టించుకోవడంలో మనం సాధారణంగా విఫలమవుతుంటాం. ఎందుకని? ఎందుకంటే, 'భాష' గూర్చి మనం ప్రధానంగా 'లిపి' సంబంధంతోనే, అక్షరమాల కోణంలోనే ఆలోచించడానికీ, మాట్లాడడానికీ అలవాటు పడిపోయి ఉన్నాం గనుక. కాని, ముందే చెప్పుకున్నట్టుగా ఏ భాషా లిపితోనే పుట్టదు. ఒక భాషగా పుట్టి వికసించే క్రమంలోనే అది 'లిపి' అనే అంగాన్ని సమకూర్చుకుంటుంది. అభివృద్ధి చెందిన దేశీయ భాషలన్నింటికీ, ప్రపంచ భాషలన్నింటికీ ఈ సూత్రం వర్తిస్తుంది. (ఇప్పటికీ లిపి అంటూ లేని కొన్ని భాషలు మనముందు ఉండనే ఉన్నాయి) మన 'తెలుగు' భాష సైతం ఇందుకు మినహాయింపు కాదు. కనుక లిపి లేనిదిగా

పుట్టి తరువాత ఒక క్రమంలోనే లిపిని సంతరించుకునే భాషను గూర్చి మాట్లాడేటప్పుడు లిపికి మించిన ప్రాధాన్యతా కోణాలు, అంశాలు కొన్ని దానికుంటాయని మనం గుర్తించాలి 'మాండలికం' అనేది సరిగ్గా అలాంటి ప్రాధాన్యతాంశమే. మాండలికం అనేది ఒక ప్రాంతపు ప్రజల సంస్కృతీ సంప్రదాయాల్ని, చారిత్రక నేపథ్యాన్ని తన చుట్టూతా అల్లుకుంటుంది. కనుకనే సుమారుగా వేరు భాషంతటి తేడాతో మాండలికం ఉంటుంది.

ఇక చివరిగా, అంతరించిపోనున్న ప్రమాదం బారి నుండి తెలుగు భాషను పరిరక్షించుకోవడం గూర్చి మాట్లాడుకుందాం. విద్యా మాధ్యమంగా తెలుగు కొనసాగాలనుకోవడం మంచిదే, అవసరమే. తెలుగు భాష ప్రాచీనత, చరిత్ర, వైశిష్ట్యం గూర్చి కలబోసుకోవడమూ అవసరమే. తెలుగుభాష ప్రామాణికతను రుజువు చేసే కృషి సైతం అభినందనీయమే, కాని, దీన్ని కేంద్ర ప్రభుత్వం చేత గుర్తింపజేయడానికి పెద్దగా ప్రయాస పడిపోవాల్సిన అవసరం లేదు. అలాంటి లాంఛనప్రాయపు గుర్తింపు వల్ల తెలుగుభాషకి అదనంగా ఒరిగిపోగల ప్రయోజనమంటూ ఏమీ ఉండదు. మన ప్రధానస్రవంతి రాజకీయ పార్టీలు, ప్రభుత్వాలు మన భాషపట్ల ఎంత నిర్లక్ష్యంగా ఉంటున్నాయో ఎండగట్టడానికి తప్ప. అయితే, ఇలాంటి అరకొర ప్రయత్నాలతోనే తెలుగుభాష ఎదుర్కొంటున్న ముప్పుని అడ్డుకోగలమని, మన భాష అంతరించిపోకుండా కాపాడుకోగలమని అనుకోవడం భ్రమే అవుతుంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అనే పెను వినాశకర సునామీ వల్ల ఈరోజు ఒక్క తెలుగుభాష అనేకాదు, ప్రపంచంలోని అనేక దేశాలు, ప్రాంతాలు, జాతుల భాషలు, సంస్కృతులు, నాగరికతలు పెనుముప్పునే ఎదుర్కొంటున్నాయి.

మన కళ్లముందే జరిగిపోతున్న ఇరాక్ విధ్వంసం కేవలం సైనిక, ఆర్థిక, రాజకీయ విధ్వంసమే కాదు. అంతకంటే హెచ్చుగా ఇరాక్‌లో దారుణమైన సాంస్కృతిక విధ్వంసం సాగిపోతోంది. అమెరికా షియా-సున్నీల మధ్య రగిల్చిన అంతర్గత జ్వాలల్లో ఇరాక్ దగ్ధమైపోతోంది. ప్రపంచీకరణ వివిధ దేశాల జాతుల భాషలు, నాగరికతలు, సంస్కృతుల్ని ఆసాంతం తుడిచివేస్తుంది. అలా తుడిచి పెట్టకుండా సామ్రాజ్యవాదం ఇతర దేశాలపై, ప్రాంతాలపై జాతులపై తన ఆర్థిక, రాజకీయ, సైనిక ఆధిపత్యాల్ని అమలు చేయజాలదు. ప్రపంచీకరణ ద్వారా ప్రపంచంలోని వివిధ దేశాల మధ్య సరిహద్దుల్ని చెరిపివేస్తా మంటున్నారంటే దాని అర్థం, ప్రపంచాన్నంతటినీ ఒకే ఒక 'ప్రపంచ గ్రామం'గా మర్చేస్తామనంటున్నారంటే దాని అర్థం సరిగ్గా ఇదే తప్ప ఇంకోటికాదు. ఈనాడు మన పాలమూరు జిల్లా భౌగోళికంగానే మిగిలి ఉంది. పాలమూరు మట్టి నుండి మనుషులు వేరైపోయారు. దేశం నలుమూలలకి పొట్టకూటికి కూలీలుగా వలసలు పట్టిపోయారు. వారు తమ తియ్యని తెలుగుభాషని వదిలేసుకుంటారు, వదిలేసుకోవాలి, తప్పదు. ఇంకో భాషకోసం వదిలేసుకుంటారా? కాదు. అసలు వారికంటూ ఒక భాష ఉండే వీలే లేదు. అది విషాదం. దేశంలో ఏ మూలకి పోతే అక్కడి భాషే వారు తమదనుకోవాలి. పాలమూరు ప్రజల్ని వారి మట్టినుండి, వారి భాష నుండి వేరు చేసిన దుష్టశక్తులేవి? పరిస్థితులేమిటి? కారణాలేమిటి? ఈ ప్రశ్నల మూలాల్లోకి వెళ్లకుండా, కారణాలు తెలుసుకోకుండా, కారకుల్ని పట్టుకోకుండా, పరిష్కారాలు వెతక్కుండా మనం మన భాషని కాపాడుకోలేం. భాషకోసం ప్రజలుందరు కదా. ప్రజలకోసం భాష. ప్రజలే లేనప్పుడు ఇక భాష ఉనికికి ఆస్కారమెక్కడిది? కనుక పాలమూరు విషాదమూలాల్ని తవ్వితోడాల్సిందే.

అలానే రాష్ట్రంలో ఇంకో మూల శ్రీకాకుళం జిల్లా ఉద్దానం ప్రాంతం. అది 'ఉద్దానం' కాదు, 'ఉద్యానవనం' అని అమర విప్లవ కవి సుబ్బారావు పాణిగ్రాహి కీర్తిగానం చేసిన నేల అది. రాష్ట్రంలోనే జీడిమామిడి, కొబ్బరి పంటలకు పేరున్న ప్రాంతమిది. ఎటు చూసినా నిండు గెలలతో పచ్చటి కొబ్బరి తోపులు, చిక్కటి జీడి తోటలతో అది అక్షరాలా ఉద్యానవనం లానే ఉండేది. అలాంటి ఉద్దాన ప్రాంత ప్రజలు ఉన్న ఊళ్లను ఒదిలేసి ఖిలాయ్, కలకత్తా, కాండ్లా, అండమాన్ ఇలా ఎక్కడెక్కడికో ఉపాధి వెదుక్కొంటూ వలసలు పోయారు, పోతూనే ఉన్నారు. శ్రీకాకుళం విజయనగరం జిల్లాల్లో ఈ రోజు యాభై శాతం మంది ప్రజలు 'అర్ధవలసజీవులు'గా బతుకీడుస్తున్నారంటే అతిశయోక్తి కాదు. అంటే సంవత్సరంలో ఆరుమాసాలు వారు పనికోసం కూలికోసం రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలకు, రాష్ట్రేతర ప్రాంతాలకు సైతం వలస పోతుంటారు. బతుకు కోసం కన్నతల్లిలాంటి ఊరుని, మమతలు పెనవేసుకున్న మట్టిని వదిలేసుకు పోయే అసహాయ ప్రజలు ఇక తమ భాషను పట్టుకు వేల్లాడగలరా? దాన్ని వదులుకోక తప్పదు. మన భాషను సాకే పల్లెలు, పల్లెల్లోని ప్రజలు వలసలు పట్టి భాషను వదులుకుంటారు. అలాంటి బాధలేవీ లేకుండా అన్ని విధాలుగా జరుగుబాటవుతూ ఉండే వారికి ఇక్కడ తెలుగు భాషతో అవసరం లేదు. మన రాజకీయ నాయకులకీ తెలుగు అక్కర్లేదు. మన సినిమాలకి తెలుగు అక్కర్లేదు. మన టీవీలకి తెలుగు అక్కర్లేదు. మన బడులకి, కాలేజీలకి, యూనివర్సిటీలకీ అసలు అక్కర్లేదు. కనుక మనం మన పల్లెల్ని రక్షించుకుంటే, మన రైతుల్ని రక్షించుకుంటే వారు 'తెలుగు'ని రక్షించుకుంటారు.

ఈ విపరిణామాలు, విపత్తులు, విధ్వంసాలు, విషాదాలు ఇవన్నీ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విషఫలితాలుగా అర్థం చేసుకోలేకపోతే వీటిని మనం నిలవరించజాలం. ప్రపంచీకరణ విష ప్రభావంతో ఈనాడు మన సమాజంలోని సర్వ వ్యవస్థలూ భ్రష్టుపడుతున్నాయి, విధ్వంస మవుతున్నాయి. కుటుంబాలలో, కుటుంబాల మధ్య, మనుషుల మధ్య ఆర్థిక వ్యాపార సంబంధాలు తప్ప మానవీయ సంబంధాలు స్పందనలు మచ్చుకి సైతం కనబడకుండా పోయాయి. ప్రపంచీకరణ ఎడారిలో ఒయాసీస్‌లు చాలా అరుదైనవే. వాటిని బడుగులు, బలహీనులు అందుకోలేరు. శక్తి సంపన్న పాలకవర్గాల కబ్జాలోనే అవి ఉంటాయి. ప్రపంచీకరణ ఎడారిలో మురిపించే ఎండమావుల వెంట దాహార్తితో సామాన్యులంతా పరుగులెత్తాల్సిందే. ఫలితం శూన్యం, దాహం తీరదు, నీటిదేవులాటలో హరించుకోపోతాం, అంతరించిపోతాం. కనుక మనం కళ్లు తెరవాలి. భ్రమల్ని వదిలించుకోవాలి. ప్రపంచీకరణ విష పరిష్వంగం నుంచి, ప్రపంచీకరణ ఎడారి నుండి బయటపడాలి. మన పచ్చని పల్లెల్ని పంటల్ని దక్కించుకోవాలి. అప్పుడు మన తెలుగుభాషను కూడా దక్కించుకోగలుగుతాం. ◆

# ఐఐటి పేరుతో ప్రాంతాల మధ్య చిచ్చు ఎందుకు?

– బి. ప్రసాద్

భాక్రానంగల్, నాగార్జునసాగర్ డ్యాంల వంటి భారీ ప్రాజెక్టులను నవ భారత ఆధునిక దేవాలయాలుగా అభివర్ణించాడు నెహ్రూ. ఒక వెనుకబడిన దేశం సత్వరాభివృద్ధి సాధించాలంటే భారీ ప్రాజెక్టులూ, భారీ పరిశ్రమలూ కావాలి. వాటిని సాధించేందుకు సాంకేతిక ప్రవీణులు వేల సంఖ్యలో అవసరం. వారిని తయారు చేయడానికి దేశవ్యాప్తంగా అత్యున్నత సాంకేతిక విద్యాసంస్థలు ఆవిర్భవించాలని స్వతంత్ర భారత తొలి ప్రధాని నెహ్రూ కలలు కన్నారు. అభివృద్ధి చెందిన దేశాల శాస్త్రవేత్తలతో మన శాస్త్రవేత్తలు భుజాలు కలిపినడవాలనీ, సాంకేతిక రంగంలో అద్భుతాలు సాధిస్తున్న ప్రవీణులతో సమాన స్థాయిలో మన సాంకేతిక సారథులు మెలగాలనీ ఆయన ఆకాంక్షించారు. తద్వారా సాధించే విజయాలు, ఫలితాలు వెనుకబడిన ప్రాంతాల జాతి సమైక్యతాభివృద్ధికి సోపానాలుగా నిలుస్తాయని ఉద్ఘాటించారు. ఆ తర్వాత కాలంలో ప్రధాని రాజీవ్‌గాంధీ కూడా వెనుకబడిన ఈశాన్య రాష్ట్రాలలో ఐ.ఐ.టిల ఏర్పాటుకు చర్యలు తీసుకున్నారు. వారి వారసత్వాన్ని పుణికి పుచ్చుకొని ముందుకు కొనసాగుతున్నామని ప్రచారం చేసుకుంటున్న మన రాష్ట్ర కాంగ్రెస్ నేతలు ఆచరణలో వారి స్వప్నాలకు, ఆకాంక్షలకు తూట్లు పొడుస్తున్నారు. వెనుకబడిన ప్రాంతాల ప్రజల మధ్య ఐఐటి చిచ్చును రేపారు. ఉత్తర తెలంగాణ జిల్లాల మధ్య ఆరని అగ్నికి ఆజ్యం పోస్తున్నారు. ఇప్పటికే మెదక్ జిల్లా కాంగ్రెస్ నేతలు మండల స్థాయి సంతకాల సేకరణలు, పటాన్‌చెరు నుండి బిఎచ్‌ఈఎల్ కాలనీ వరకు పాదయాత్రలు చేశారు. హైదరాబాద్ శివారు నుండి జహీరాబాద్ వరకు సాగే తొమ్మిదవ నెంబర్ జాతీయ రహదారిని దిగ్బంధనం చేయగా, తెలుగుదేశం, వామపక్ష పార్టీలు, టి.ఆర్.ఎస్., బి.జె.పిల ఆధ్వర్యంలో ఏర్పడిన "బాసర ఐఐటీ సాధన కమిటి" నిజామాబాద్ జిల్లా బసవాపూర్ నుండి ఆదిలాబాద్ జిల్లా పెన్‌గంగ వరకు 7వ నెంబర్ జాతీయ రహదారిని ఫిబ్రవరి 1న దిగ్బంధనం చేశాయి. దీనికి ఆదిలాబాద్, నిజామాద్, కరీంనగర్ జిల్లాల కాంగ్రెస్ నేతలు ప్రత్యక్ష మద్దతుని ప్రకటించాయి.

గత దశాబ్దకాలంగా రాష్ట్రంలో ఐఐటి నెలకొల్పాలని అనేక రూపాల్లో ఆందోళనలు జరిగాయి. రాష్ట్రంలో 270 ఇంజనీరింగ్ కళాశాలలు ఉన్నాయి. వీటిలో 92 వేల సీట్లు ఉన్నాయి. ఇంజనీరింగ్ కాలేజీలను సమన్వయం చేయడానికి రాష్ట్రానికి ఐఐటి లాంటి ఉన్నత సాంకేతిక విద్యా సంస్థ అవసరమని మేధావులు అభిప్రాయపడుతున్నారు. ఐఐటిలకు పోటీపడే విద్యార్థులలో అత్యధిక మంది ఆంధ్రప్రదేశ్ నుండే ఉన్నారు. దేశ వ్యాప్తంగా 2.50 లక్షల మంది విద్యార్థులు ఐఐటి కోసం పోటీ పడుతుంటే వారిలో 80 వేల మందికి పైగా దక్షిణాదివారే ఉన్నారు. వీరిలో దాదాపు 45 వేల మంది ఆంధ్రప్రదేశ్ వారున్నారు. ఐఐటిలో ప్రవేశం పొందాలనే తపన రోజురోజుకు మన విద్యార్థుల్లో పెరుగుతున్నది. దేశంలో మరో ఇరవై వరకు ఐఐటిలను ఏర్పాటు చేయాలని స్వయంగా మన రాష్ట్రపతి అబ్దుల్ కలాం పేర్కొన్నారు. ప్రజల ఆకాంక్షల కనుగుణంగా మన రాష్ట్ర శాసనసభ రెండుసార్లు ఆదిలాబాద్ జిల్లా బాసరలో ఐఐటి నెలకొల్పాలని ఏకగ్రీవంగా తీర్మానం చేసింది. ఇప్పుడు రాష్ట్రానికి ఐఐటి మంజూరైన తరువాత బాసరలో కాకుండా హైదరాబాద్ సమీపంలోని మెదక్ జిల్లాలో ఏర్పాటు చేస్తామని ముఖ్యమంత్రి ప్రకటించారు. మరోవైపు ఉస్మానియ, ఆంధ్రా యూనివర్సిటీల ఇంజనీరింగ్ కాలేజీలకు ఐఐటిలో హోదాలను కల్పిస్తామని ప్రకటించారు. మరోవైపు బి.జె.పి అగ్రనాయకులు ఐఐటిని ఆంధ్ర ప్రాంతంలో నెలకొల్పాలని ఉద్యమం చేస్తామని ప్రకటించారు.

**కాంగ్రెస్ ప్రభుత్వానికి అసెంబ్లీ తీర్మానంపై గౌరవం లేదా?**

"బాసరలో ఐఐటిని నెలకొల్పాలని" రాష్ట్రంలో ఉన్న ఎనిమిది కోట్ల మంది ప్రజల మనోభావాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న శాసనసభ్యులు ఏకగ్రీవంగా అసెంబ్లీలో రెండు సార్లు తీర్మానాలు చేశారు. మొదటి సారి తీర్మానం చేసినప్పుడు తెలుగుదేశం పార్టీ అధికారంలో ఉంది. ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, మహారాష్ట్రాలలో వెనుకబడిన ప్రాంతాలకు కూడలి అయిన ఆదిలాబాద్ జిల్లాలో చారిత్రక ప్రాంతమైన బాసరలో ఐఐటిని నెలకొల్పాలనుకోవడం అభిలాషనీయమైన అభివృద్ధి చర్య అని టి.డి.పి. ప్రభుత్వాన్ని కొనియాడిన వారిలో కాంగ్రెస్ ప్రతిపక్ష నాయకుని స్థానంలో వై.ఎస్. రాజశేఖరరెడ్డి కూడా అన్నారు. బాసర డెవలప్‌మెంట్ అథారిటీని రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కర్యాదర్శి అధ్యక్షతన నియమించారు. ఈ సంస్థలో పది మంది ప్రిన్సిపల్ సెక్రెటరీలు, విద్యావేత్త చుక్కా రామయ్య సుభ్యులుగా ఉన్నారు. బాసర రైల్వేస్టేషన్‌కు పక్కనే 1090 ఎకరాల స్థలాన్ని సేకరించారు. ప్రాథమిక సౌకర్యాల కల్పనకు విద్యాశాఖ నిధుల నుండి ఐదు కోట్ల రూపాయలను కేటాయించారు. రెసిడెన్షియల్ స్కూల్‌ను నెలకొల్పారు. ప్రాథమిక ఆస్పత్రిని నిర్మించారు. మంచినీటి కోసం గోదావరిలో ఫిల్టర్‌బెడ్‌ను నిర్మించారు. తిరుమల తిరుపతి దేవస్థానం సహకారంతో వంద కాలేజీలను నిర్మించడానికి టి.డి.పి. ప్రభుత్వం కృషిచేసింది. బాసరలో ఐఐటి నెలకొల్పేందుకు తీసుకోవాల్సిన చర్యలను పేర్కొంటూ చుక్కా రామయ్య ఒక సమగ్ర నివేదికను కూడా సమర్పించారు.

అధికారంలోకి వచ్చిన తర్వాత కాంగ్రెస్ పార్టీ పై అంశాలను పరిగణలోకి తీసుకొనే ఐఐటి రాష్ట్రానికి వస్తే బాసరలోనే ఏర్పాటు చేస్తామని రెండవ సారి అసెంబ్లీలో తీర్మానం చేసింది. ఇప్పుడు ఐఐటిని బాసరలో కాకుండా మెదక్‌లో నెలకొల్పుతామని ముఖ్యమంత్రి ప్రకటన చేయడం కాంగ్రెస్ ప్రభుత్వ ఊసరవెల్లి విధానాలకు నిదర్శనం. ఇది ప్రజలకు శాసనసభల మీద ఉన్న నమ్మకాన్ని వమ్ముచేయడమే. ఐఐటిని ఎక్కడ నెలకొల్పాలనే విషయాన్ని అసెంబ్లీలో చర్చించి నిర్ణయం చేసిన తర్వాత దుమారంలేవడం కాంగ్రెస్ ప్రభుత్వం దిగజారుడు

నీచరాజకీయమే అవుతుంది. కనీసం వివిధ రాజకీయ పార్టీలతో, విద్యావేత్తలు, మేధావులు, విద్యార్థి, యువజన సంఘాలతో సంప్రదించకుండా ఏకపక్షంగా ముఖ్యమంత్రి ఐఐటిని నెలకొల్పే స్థలం మార్చుతూ ప్రకటన చేయటం ప్రభుత్వ నిరంకుశ చర్య కాదా? శాసనసభను, అది చేసిన తీర్మానాలను అగౌరవపర్చడం కాదా?

**అసెంబ్లీ తీర్మానాలను నీరుగార్చేందుకే ఎక్స్‌పర్ట్ కమిటీ**

మెదక్ జిల్లాలో వసతులు ఉన్నాయా? లేక బాసరలో బాగున్నాయా పరిశీలించేందుకు ట్రిపుల్ ఐటీ డైరెక్టర్ ప్రొఫెసర్ రాజీవ్ సంగాల్, బెంగుళూర్‌లోని ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్ అసోసియేట్ డైరెక్టర్ ఎస్. బాలకృష్ణన్, బెంగుళూర్ ఐఐటి మాజీ డైరెక్టర్ నటరాజన్‌లతో కూడిన ఎక్స్‌పర్ట్ కమిటీని (జి.ఓ.నెం.40 ద్వారా) వేశామని రాష్ట్ర ప్రభుత్వం ప్రకటన చేసింది. ఐఐటి ఏర్పాటు కోసం 500-600 ఎకరాల స్థలాన్ని గుర్తించాల్సిందిగా రాష్ట్ర ప్రభుత్వాన్ని కేంద్రం కోరిందని; ఆ స్థలానికి భౌతిక, సామాజిక, మౌలిక వసతులతో పాటు రహదారి, రైలు మార్గం, విమానయాన సౌకర్యం ఉండాలని, మెదక్ జిల్లాతో పాటు ఆదిలాబాద్ జిల్లాలను సందర్శిస్తారని. అధికారులతో చర్చించి సూచనలు మాత్రమే కమిటీ చేస్తుందని, ఆ తర్వాత ఐఐటిని ఎక్కడ నెలకొల్పేది ప్రభుత్వం స్పష్టం చేస్తుందని జీవోలో పేర్కొంది. ముఖ్యమంత్రి ప్రకటించిన తర్వాత కమిటీని నియమించడం అనేక అనుమానాలకు తావిస్తున్నది. ఐఐటి పేరుతో బాసరలో ప్రాథమిక సౌకర్యాలను కల్పించిన తర్వాత వసతుల పరిశీలన పేరుతో కమిటీని నియమించడం వెనుక ఉన్న మతలబు ఎంటీ? మరో ఫ్యాబ్‌సిటీ లాగా ఐఐటిని కూడా చేజారుస్తారేమో అనే భయాందోళనలు చేలరేగుతున్నాయి.

**విమానాశ్రయమే కీలకమా?**

ఐఐటిని ఎక్కడ ఏర్పాటు చేయాలో నిర్ణయించుకునే అధికారం రాష్ట్ర ప్రభుత్వాలదేనని కేంద్ర ప్రభుత్వ మానవ వనరులశాఖా మంత్రి అర్జున్‌సింగ్ స్పష్టం చేశారు. ఆదిలాబాద్‌లో విమానాశ్రయం సౌకర్యం లేదు. విదేశీ విద్యార్థులు, ప్రొఫెసర్లు రారు. విదేశీ సంస్థలు రావు. అందుకే బాసరలో ఏర్పాటు చేయలేక పోతున్నామని ప్రభుత్వం ప్రకటించింది. విమానాశ్రయాలు లేకపోయినా ఐఐటిలను దేశంలో స్థాపించిన సందర్భాలు ఉన్నాయి. ఇదే ప్రధానమైతే బాసర దగ్గరలో ఉన్న నాందేడ్‌లో విమానాశ్రయం కూడా ఉన్నది. నాందేడ్ నుండి బాసర 70 కిలోమీటర్లు మాత్రమే. బ్రాడ్‌గేజ్ రైల్వే లైన్ కూడా ఉంది. విమానాశ్రయం లేకపోవడమే ఐఐటి స్థలాన్ని మార్చడానికి కారణమైతే కొత్తగా ఆరు విమానాశ్రయాలను రాష్ట్రంలో నెలకొల్పుతున్నట్లు ప్రభుత్వం ప్రచారం చేస్తున్నది. వాటిల్లో ఒక విమానాశ్రయాన్ని ఇక్కడ ఏర్పాటు చేయవచ్చును. లేదా నిజామాబాద్‌లో ఉన్న విమానాశ్రయాన్ని బాగుచేయవచ్చు. శాసనసభలో ఏకగ్రీవ తీర్మానాలు చేసినప్పుడు కాంగ్రెస్ వారికి విమానాశ్రయం తదితర సౌకర్యాల గురించి జ్ఞాపకం రాలేదా? ఇప్పుడు అకస్మాతుగా జ్ఞానోదయం కలిగిందా? ముఖ్యమంత్రి ప్రకటించిన మెదక్ జిల్లాలో కూడా విమానాశ్రయం లేదు. అనాలోచితంగా తీసుకున్న నిర్ణయంను వెనక్కి తీసుకోకపోగా మెదక్ జిల్లాలో ప్రజలను రెచ్చగొట్టేందుకు ప్రయత్నిస్తున్నారు. వెనుకబడిన ప్రాంతాల మధ్య తగవులు పెట్టాలని చూస్తున్నారు. తెలంగాణ యూనివర్సిటీ విషయంలో కూడా రాష్ట్ర ప్రభుత్వం ఇలాగే వ్యవహరించింది. మొదట నిజామాబాద్ జిల్లాలో యూనివర్సిటీ నెలకొల్పుతామని ప్రకటించిన తర్వాత మహబూబ్‌నగర్, కరీంనగర్ జిల్లాల్లో ఏదో ఒకచోట పెడతామని ముఖ్యమంత్రి మాటమార్చారు. ప్రజల పోరాటానికి తలొగ్గి నిజామాబాద్‌లోనే యూనివర్సిటీని అనివార్యంగా నెలకొల్పుటకు చర్యలు తీసుకొన్నారు.

**మాటల్లోనే వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి?**

వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధే మా లక్ష్యం అని ప్రకటిస్తున్న కాంగ్రెస్ ప్రభుత్వం దీనికి భిన్నంగా వ్యవహరిస్తున్నది. ఆదిలాబాద్ జిల్లా వెనుకబడి ఉంది. ఐఐటి నెలకొల్పడానికి వసతులు లేవు అంటున్నారు. వసతులు లేకపోతే కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. కాని ఆ పేరుతో ఐఐటిని వసతులు ఉన్న ప్రాంతాల్లోకి మార్చడం సబబు కాదు. ఇది వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి విరుద్ధమైన వాదన. ఎలాంటి సౌకర్యాలు లేకుండానే ఉత్తరాఖండ్‌లోని రూర్కి ఐఐటి నడుస్తోంది. అస్సాంలోని గౌహతి, బెంగాల్‌లోని ఖరగ్‌పూర్‌లలో నెలకొల్పలేదా? ఆ తరువాత ఈ ప్రాంతాల్లో విమానాశ్రయాలు, ఇతర సౌకర్యాలను అభివృద్ధి చేయలేదా? ఈ వాస్తవాలను ప్రభుత్వం పరిగణనలోకి తీసుకోవాలి.

బాసరలో ఐఐటిని స్థాపిస్తే దాని అవసరాల కోసం ఆ ప్రాంత సహజ వనరులను వినియోగించుకోటానికి "రిసెర్చ్" చెయ్యవచ్చును. పరిశ్రమలను నెలకొల్పవచ్చును. తద్వారా టెక్నికల్, నాన్‌టెక్నికల్ ఉద్యోగావకాశాలు పెరుగుతాయి. నిరుద్యోగం నిరక్షరాస్యత, పేదరికం, వెనుకబాటుతనంలను పారద్రోలవచ్చు. విస్తారమైన గోదావరి నదీ లోయ అటవీ ఖనిజ సంపద పైన పరిశోధనలు చేయవచ్చును. బయో టెక్నాలజీకి సంబంధించిన పరిశోధన మొదలు పెడితే అద్భుత ఫలితాలు వచ్చే అవకాశం ఉంది. ఈ ప్రాంతంలో ముప్పై శాతానికి పైగా ఉన్న గిరిజనుల అభివృద్ధికీ దోహదపడుతుంది. దీనితో వెనుకబడి ఉన్న ఉత్తర తెలంగాణ ప్రాంతం అభివృద్ధి అవుతుందని మేధావులు, విద్యావేత్తలు అభిప్రాయపడుతున్నారు. ◆

**వచ్చే సంచికలో...**

- **ఫోకస్ - బడ్జెట్ 2007-08**
- **ఉన్నత విద్యపై చిన్నచూపు - ప్రొ. కె. వెంకటనారాయణ**
- **ప్రజల పార్టీని గుర్తించడం ఎలా? - బి. సైదులు**
- **జిడిపి పెరుగుదల రేటుతో భారతదేశ ఆర్థికాభివృద్ధిని లెక్కించటం సబబా? - వి. చలపతిరావు**

# ప్రత్యేక తెలంగాణ - వలసాంధ్ర పాలకుల మోసాల చరిత్ర

- ఎన్. వెంకటేశ్వర్లు

"ఒకవేళ తెలంగాణను ఆంధ్రలో కలిపితే, కోస్తా ఆంధ్రులు తెలంగాణ ప్రాంతాన్ని ముంచెత్తి, దోచుకుని దానిని ఒక వలస ప్రాంతంగా మార్చి వేస్తారనేది ఆ ప్రాంత ప్రజల భయం".

51 సంవత్సరాల క్రితమే భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకోసంగా నియమింపబడిన ఫజల్ అలీ కమీషన్ లేదా ఎస్.ఆర్.సి. రిపోర్టు పేరా 378లో ఉమ్మడి రాష్ట్రం పట్ల ప్రజల భయాందోళనలను ఇలా రికార్డు చేయడం గమనార్హం.

తెలంగాణ ప్రజలు అత్యంత దేశభక్తిపరులు. ప్రాంతీయాభిమానం కలవారు. కలివిడి గుణం ఉన్నవారు. రజాకార్లను తరిమిన గడ్డ. భూస్వాములను ఎదిరించిన మట్టి. కాళోజీ అన్నట్టు వీర తెలంగాణ మనది. వేరు తెలంగాణ మనదని గర్వపడాల్సిన నేల. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని మురిసిపోతున్న రోజుల్లో తెలంగాణ మటుకు అసఫ్‌జాహీ వంశస్థులైన నిజాం నవాబుల ధాష్టిక పాలనలో నలుగుతునే ఉంది.

1948 సెప్టెంబర్ 17 మిలటరీ చర్య ఫలితంగా తెలంగాణ ప్రాంతం భారతదేశంలో భాగం అయ్యింది. హైదరాబాద్ రాష్ట్రంగా అవతరించింది. 1948 నుండి 1952 వరకు అంటే సాధారణ ఎన్నికలు జరిగి మొట్టమొదటి ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ప్రభుత్వం ఏర్పడేవరకూ హైదరాబాద్ రాష్ట్రం మిలటరీ లేదా, సివిల్ పాలకుల పాలనలో ఉండేది. సరిగ్గా ఈ కాలంలోనే ఆంధ్ర వలసలు ప్రారంభమయినవి. స్థానికుల పొట్టలు గొట్టడానికి సన్నాహాలు మొదలయినవి. పెరుగుతున్న ఆంధ్రవలసల ఫలితంగా పోరాట చరిత్ర కలిగిన తెలంగాణీయులు 1952 లోనే నాన్ ముల్కీ (నివాసేతర) ఉద్యమం గావించారు. అప్పటినుంచి ఉద్యమాల బాటలోనే తెలంగాణ చరిత్ర నమోదు కాబడుతూ ఉంది.

నిజాం నవాబులు తెలంగాణ శ్రామిక ప్రజల మూలుగులు పీల్చుకొని ఆనాడు ప్రపంచంలోనే ధనవంతుడైన హెన్రీఫోర్డును తలదన్నే ఆస్తులు కూడబెట్టుకోగా, దగాకోరు, దోపిడీయావ ఆంధ్ర వలసపాలకులు అప్పటి మదరాసు రాష్ట్రంలో భాగంగా ఉండికూడ తెలంగాణ ప్రజల జీవికను ఆగంజేసే వలస కుట్రలు పన్నిన నేపథ్యం నాటి తెలంగాణ!

మద్రాసు రాష్ట్రంనుండి విడిపోయి 1953 అక్టోబర్ 1 ఆంధ్రరాష్ట్రం టంగుటూరి ప్రకాశం ముఖ్యమంత్రిగా ఏర్పడింది. అప్పటికే హైదరాబాద్ రాష్ట్రంగా తెలంగాణ మనుగడలో ఉంది. పరాయివారి పాలన మూలంగా విద్య, ఉద్యోగ రంగాలలో తప్ప, మిగతా రంగాలలో స్వయం సమృద్ధత ఉండింది. తెలంగాణ అస్తిత్వాన్ని ఒక సెంటిమెంటుగా అంటే రాష్ట్ర ఏర్పాటు డిమాండ్‌కు సరియైన పునాది లేనిదిగా అనేవారందరూ ఆరోజుల్లో భాషను సెంటిమెంట్‌గా మల్చుకోవడం విడ్డూరం కాదా? పాలనాపరమైన వసతులులేక కర్నూలు రాజధానిగా 'దేరా'లలో తమ పాలనా కార్యకలాపాలు నిర్వర్తించుకునేవారు. తెలంగాణ ప్రజలు చిందించిన చెమట చుక్కల శ్రమతో అభివృద్ధి అయిన హైదరాబాద్ - సికింద్రాబాద్ నగరాలపై ఆంధ్రపాలకుల కన్నుపడింది. అప్పుడు వలసవాదుల 'వశీకరణ' మంత్రం 'భాష' గావడం ఇక, తెలుగువారం మనమూ, అని పాటలు పాడసాగారు. బ్రిటిష్ పాలనలో ఉండి బ్రిటిషోడి ట్రిక్కులనన్నీ వంట పట్టించుకున్న ఆంధ్ర పాలకులు తెలంగాణలో పాగావేయడానికి జాతీయ, రాష్ట్ర స్థాయిలో రాజకీయ, ధన బలాలతో పావులు కదిపారు. స్వేచ్ఛా పిపాసులైన తెలంగాణ ప్రజలు ఉమ్మడి రాష్ట్రాన్ని వ్యతిరేకించారు. భవిష్యత్తులో కలుగబోయే నష్టాలను కండ్లుండి చూడగల స్వార్థ రాజకీయులు, మెదడు ఉండి ఆలోచించగల స్థాయి నాయకులు ఉమ్మడి రాష్ట్రంకై వంతపాడారు. ఆంధ్ర వలసవాదుల కుట్రలో భాగం అయినారు.

ఆనాటినుండీ చేదు అనుభవాల తెలంగాణ చరిత్ర క్రమమిది.

**రాష్ట్రాల పునర్విభజన కమిటీ (1954)**

జస్టిస్ ఫజల్ అలీ అధ్యక్షతన, హృదయనాథ్ కుంజ్రూ, ఎం.కె. పణిక్కర్‌లు సభ్యులుగా జాతీయ స్థాయిలో ఈ కమిటీని ఏర్పాటు చేశారు. దీనినే ఫజల్ అలీ కమీషన్ అనీ, ఎస్.ఆర్.సి. అని కూడా అంటారు. భాషా ప్రాతిపదికన రాష్ట్రాల పునర్విభజన చేయడం ఈ కమిటీ ఉద్దేశ్యం. ఉత్తర ప్రావిన్స్, సౌరాష్ట్ర వరుసగా నేటి ఉత్తరప్రదేశ్, గుజరాత్ రాష్ట్రాల స్థానంలో హిందీ మాట్లాడే బెల్ట్ ఉండేది. పరిపాలనా సౌలభ్యం కోసం పెద్ద రాష్ట్రాలుగా ఉన్నవాటిని పలు చిన్న రాష్ట్రాలుగా విడగొట్టారు. ఈ సందర్భంలో భాషనుగానీ, విస్తీర్ణంను గానీ పరిగణనలోకి తీసుకోలేదు. ఆనాడే 'హైదరాబాద్ రాష్ట్ర' అస్తిత్వాన్ని కాపాడుకొనుటకు 'స్వయం పాలన'నే గొంతుకగా జేసుకొని విన్పించారు. ఈ నేపథ్యంలోనే దేశవ్యాప్త ఎస్.ఆర్.సి. తెలంగాణ వాదనల్లో ఆమోదించవలసిన శాస్త్రీయ అంశాలు ఉన్నాయని 1955 సెప్టెంబర్ 30న సమర్పించిన నివేదికలో కేంద్ర ప్రభుత్వానికి సూచించింది.

**పెద్ద మనుషుల ఒప్పందం (1956)**

ఆంధ్ర వలసవాదుల కుట్రలో ఇది రెండవ దశ. తడిగుడ్డతో గొంతుకోసే ప్రక్రియ షురువయింది. ఎస్.ఆర్.సి. తెలంగాణ ప్రజల మనోభావాలను ప్రతిఫలించింది. తట్టుకోలేని ఆంధ్ర రాష్ట్రనాయకులు లాబీయింగ్ అస్త్రాన్ని సంధించి ఢిల్లీని వేదికగా చేశారు. 1956 ఫిబ్రవరి 19న హైదరాబాద్ హౌజ్‌లో తెలంగాణ (హైదరాబాద్) రాష్ట్రం నుండి అప్పటి ముఖ్యమంత్రి బూర్గులరామకృష్ణారావు, మంత్రులు కొండావెంకటరంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి, కాంగ్రెస్ రాష్ట్రనాయకులు జె.వి. నర్సింగరావులు, ఆంధ్రరాష్ట్రం నుండి అప్పటి ముఖ్యమంత్రి బెజవాడ గోపాల్‌రెడ్డి, మంత్రులు నీలం సంజీవరెడ్డి, గౌతు లచ్చన్న, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ నాయకులు అల్లూరి సత్యనారాయణరాజుల సమక్షంలో సూత్రబద్ధంగా కుదుర్చుకున్న ఒప్పందాల మేరకు ఉమ్మడి రాష్ట్ర అవతరణకు అంగీకారం కుదిరింది. దీనినే పెద్ద మనుషుల

ఒప్పందం అంటారు. ఈ ఒప్పందంలో 14 అంశాలు ఉన్నాయి. ప్రధానంగా చెప్పుకోవలసివస్తే - 1) తెలంగాణ విద్యావసతులను తెలంగాణ ప్రాంత విద్యార్థుల కొరకే కేటాయించాలి, 2) నివాస నిబంధన (దీనినే ముల్కి నిబంధన అంటారు) 15 సంవత్సరాల కాలం ఉండాలి, 3) విలీనీకరణ సమయంలో ఉద్యోగాల తొలగింపు అనివార్యమయితే జనాభా ప్రాతిపదికనే జరగాలి, 4) పాలనా ఖర్చులో ఆంధ్ర తెలంగాణలు 2:1లో భరించాలి, 5) ముఖ్యమంత్రి ఆంధ్ర ప్రాంతం వారయితే ఉపముఖ్యమంత్రి తెలంగాణ, తెలంగాణకు సంబంధించిన వారు ముఖ్యమంత్రి అయితే ఆంధ్ర ప్రాంతం నుండి ఉప ముఖ్యమంత్రి ఉండాలి.

జొచ్చేవరకు సోమలింగం జొచ్చిన తర్వాత బోడులింగం అన్నట్టు ఒప్పందాల ఉల్లంఘన ఆంధ్రపాలకులు యథేచ్ఛగా చేశారు. దీనికి ప్రధాన కారణం నమ్మకాన్ని వమ్ము చేయడమొకటయితే, కొందరు తెలంగాణ నాయకులు లొంగుబాటు(భావదాస్యం) బుద్ధితో ఆంధ్రకు కొమ్ముకాయడం మరొకటి. ఆనాటి నుండి ఈనాటి వరకూ ఉమ్మడి రాష్ట్ర శాసనసభలో మూడింట రెండు వంతుల ఎం.ఎల్.ఏలు ఆంధ్ర ప్రాంతంవారే గావడం, మెజారిటి తీర్మానాలు ఆంధ్ర ప్రాంతాభివృద్ధికే వెచ్చించి తెలంగాణపై 'శీతకన్ను' రివాజు అయ్యింది.

**జై తెలంగాణ ఉద్యమం (1968-69)**

తెలంగాణ ప్రాంతానికి జరుగుతున్న అన్యాయాలను చూస్తూ తట్టుకోలేని తెలివైన తెలంగాణ ప్రజలు మొదటగా విద్యార్థులు, మేధావులు ఆంధ్ర వలసపాలకుల దగాకోరు విధానాలను ఎండగట్టారు. ఊరూరున, ప్రతి పట్టణాన ప్రచారం చేశారు. ప్రజల హక్కులు ప్రజలకు చెందాలని, మా హైదరాబాద్ రాష్ట్రం (తెలంగాణ) మాకే కావాలని, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం మళ్లీ ఏర్పాటు చేయాలని 'జై తెలంగాణ.... జై తెలంగాణ' అంటూ నినదించారు. ప్రజాస్వామ్యయుతంగా జరుగుతున్న విద్యార్థి, యువజనుల నిరసనలను, దమననీతితో వలస పాలకులు అణిచివేశారు. తుపాకులు ఎక్కుపెట్టారు. మూడు వందల అరవైకి పైగా తెలంగాణ బిడ్డలను వలసపాలకులు పొట్టన పెట్టుకున్నారు. సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, విద్య, ఉద్యోగ రంగాలలో జరుగుతున్న అన్యాయాలను ఎదిరించడంలో ప్రాంతసోయిగల సంఘటిత, అసంఘటిత రంగాలకు చెందిన ప్రజలు, విద్యార్థి, యువజనులు, మేధావులు, కవులు, కళాకారులు 'ఆంధ్రనిజాం'లకు వ్యతిరేకంగా ఉద్యమించారు. సరిగ్గా ఈ కాలంలోనే మర్రి చెన్నారెడ్డి 'తెలంగాణ ప్రజా సమితి' (టి.పి.ఎస్.) పేర రాజకీయ పార్టీని స్థాపించాడు. రాజకీయ మెలికలతో ప్రజల ఆకలి, అర్తనాదాలు, ఆక్రందనలు ఓట్లుగా మల్చుకొనే పద్ధతికి అంకురార్పణ జరిగింది.

**అష్టసూత్ర పథకం (1969 ఏప్రిల్ 11)**

అన్ని కోణాలనుండి చుట్టుకొస్తున్న తెలంగాణ ఉద్యమ జ్వాలలపై నీళ్లు జల్లడానికి తెలంగాణ ప్రాంత విస్తృత సమస్యల పరిష్కారాలకు గాను అప్పటి కేంద్రప్రభుత్వం అష్టసూత్ర పథకంను ప్రతిపాదించింది. ఆచరణలో దీనిని తుస్సుమనిపించారు.

ఈ క్రమంలో 1971లో మధ్యంతర ఎన్నికలొచ్చాయి. ఉద్యమం, రాజకీయ పోరాటం జమిలిగా సాగుతున్న రోజులవి. తెలంగాణ ప్రజా సమితి (టి.పి.ఎస్.) పద్నాలుగు పార్లమెంటరీ స్థానాలకు పోటీచేసి పదకొండు స్థానాలను కైవసం చేసుకుంది. ప్రజల ఆకాంక్ష అయిన తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు 'రిఫరెండమ్' (ప్రజాభిప్రాయం) అనదగ్గ తీర్పు ఆకాలంలోనే సాధించుకున్నారు. కాని కంచే చేను మేసినట్టు టి.పి.ఎస్. కాంగ్రెస్‌లో విలీనమయింది. నాయకులు 'అధికార' లాలసత్వాలకు లోనయి ప్రజల ఆకాంక్షలను పణంగాబెట్టారు.

**రాజ్యాంగ ఉల్లంఘన - జై ఆంధ్ర ఉద్యమం (1972)**

దేశ అత్యున్నత న్యాయస్థానం (సుప్రీం కోర్టు) ముల్కీ నిబంధనలు సరియైనవేనని తీర్పునిచ్చింది. ఆంధ్రుల దోడ్డిదారి ప్రయోజనాలకు ఈ తీర్పు మొట్టికాయ లాంటిది. దాంతో వలసవాదులు ఉంటే ఎటువంటి షరతులు, హామీలు, ఒప్పందాలు లేకుండా అయితే తెలంగాణతో కలిసి ఉంటామని, లేకపోతే "ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం" కావాలని జాతీయస్థాయిలో పట్టుగల ఆంధ్ర ప్రాంత నాయకులు జై ఆంధ్ర ఉద్యమాన్ని కొంతకాలం సాగించారు. ఉమ్మడి రాష్ట్రంలో రాజకీయ అల్లకల్లోలం సృష్టించి అప్పటి తెలంగాణ ప్రాంతానికి చెందిన ముఖ్యమంత్రి పి.వి. నరసింహారావు రాజీనామాకు కారణమయ్యారు. రాష్ట్రంలో 'రాష్ట్రపతి పాలన' విధించే వరకు (1973 జనవరి 18) పరిపాలనను స్తంభింపజేసారు.

**ఆరుసూత్రాల పథకం (1973 సెప్టెంబర్ 21)**

జై ఆంధ్ర ఉద్యమాన్ని బుజ్జగించుటకై కేంద్ర ప్రభుత్వం ఆరుసూత్రాల పథకంను ప్రకటించింది. స్థానికులకు ఉద్యోగ నియామకాలలో ప్రాధాన్యం ఇవ్వడంలాంటి ఒకటి, అర అంశాలు తెలంగాణ ప్రయోజనాలను కాపాడుతామని చెప్పడానికున్నా, ఆరు సూత్రాల అమలులో ఆకాస్తా తెలంగాణ ప్రయోజనాలకు తూట్లు బొడవడం అసలు పనయ్యింది. పదిహైను సంవత్సరాల నివాస నిబంధన గాను (ముల్కీ) కాలాన్ని 4 సంవత్సరాలకు కుదింపు చేయడం ఆరుసూత్రాల అమలు కుట్రలో భాగమయినది.

**ప్రెసిడెన్షియల్ ఆర్డర్స్ (1975)**

ఆరుసూత్రాల పథకానికి కొనసాగింపుగానే తెలంగాణలోని స్థానికుల ఉద్యోగాల పరిరక్షణకు రాజ్యాంగ సవరణ చేశారు. దీనినే రాష్ట్రపతి ఉత్తర్వు లేదా 'ప్రెసిడెన్షియల్ ఆర్డర్' అంటారు. వీని అమలు కోసం ప్రభుత్వం ఉత్తర్వులు (జి.ఓ) ఇవ్వాల్సి ఉంటుంది.

**610 జి.ఓ. (1985)**

1975 ప్రెసిడెన్షియల్ ఆర్డర్‌లో పేర్కొన్నట్టుగా తెలంగాణలో ఉద్యోగ ప్రయోజనాలు ఈ ప్రాంత ప్రజలకే దక్కాలని దీని సారాంశం. ఈ జి.ఓ. విద్యార్థి, ఉద్యోగ యువజనుల పోరాట ఫలితం. 610 జి.ఓ.ను తు.చ. తప్పకుండా అమలు చేయాలని రాజ్యాంగ ఆదేశం. కాని ఇరవై ఒక్క సంవత్సరాలు అయినా అమలుకు నోచుకోని జి.ఓ. ఇది. మనసా, వాచా, కర్మ, రాజ్యాంగ ఆదేశాలను పాటించాల్సిన ఉమ్మడి రాష్ట్ర పాలకులు, కాకులను గొట్టి గద్దలకు బెట్టినట్టు తెలంగాణ ప్రాంతవాసులకు దక్కాల్సిన ఉద్యోగాలు, పాలనాపర ప్రయోజనాలు ఆంధ్రవారికే అర్పితం చేయడం జరిగింది. జరుగుతూ ఉంది. నోటికాడి బుక్కను గుంజుకున్నట్లు జరుగుతుంది. ఉద్యోగాలలో న్యాయంగా తెలంగాణకు దక్కాల్సిన వాటాను వలసవాద పాలకులు ప్రాంతీయ బలిమితో, పాలకబలిమితో, కుల బలిమితో, రాజకీయ బలిమితో

కాజేస్తున్నారు. లెఫ్టు, రైటు తేడా లేకుండా తెలంగాణ ప్రయోజనాలకు భిన్నంగా పనిచేయడంలోనే 'ఆంధ్రలాబీయింగ్' దాగుడుమూతలాట దాగియుంది.

**గిర్‌గ్లాని కమీషన్ (2001)**

610 జి.ఓ. అమలుతో ముడి పడిఉన్న విషయాలను పరిశీలించి నివేదిక ఇవ్వాలని ఒక ఐ.ఎ.ఎస్. అధికారిచే ఏకసభ్య కమీషన్‌ను నియమించింది. 108 ప్రభుత్వ శాఖల్లో 610 జి.ఓ. అమల్లో ఉల్లంఘన జరిగిందని కమీషన్ తేల్చి చెప్పింది. జనాభా దామాషాలో మొత్తం 13 లక్షల రాష్ట్ర ఉద్యోగాలుంటే 5 లక్షల 30 వేల ఉద్యోగాలు తెలంగాణీయులకు చేందాల్సి ఉండగా, కేవలం రెండు లక్షల ఉద్యోగాలే అరకొర కేడర్లలో ఉన్నారు. (వీరిలో టీచర్లు, పోలీసుల, అటెండర్ల శాతమే ఎక్కువ) అంటే ఇంకా మూడు లక్షల పై చిలుకు తెలంగాణ ప్రజల 'హక్కు భుక్తం' (ఉద్యోగాల) ను ఆంధ్రులు కాజేసినట్టే గదా?

ఈ నేపథ్యంలో అనేక ప్రజాసంఘాలు, నిరుద్యోగులు, ఉద్యోగ సంఘాలు, పలు రాజకీయ పార్టీలు, మేధావులు, విద్యార్థి యువజనులు అశేష ప్రజానీకంలో భాగంగా ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటుకోసం ఉద్యమిస్తున్నారు. యాభై సంవత్సరాలు పూర్తి చేసుకొని స్వర్ణోత్సవాలు జరుపుకోనున్న ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణకు జరిగిన, ఇంకా జరుగుతున్న అన్యాయాలను ఎత్తి చూపడం రైటేకదా? ఆంధ్రప్రదేశ్ అవతరణకు ఒక దశాబ్దకాలం ముందే 'విశాలాంధ్ర' ఏర్పాటును వ్యతిరేకిస్తూ తెలంగాణలో ఉద్యమాలు జరిగినట్టు చరిత్ర సాక్ష్యం చెబుతుంది. ప్రజా పోరాటాలు గొంతు విప్పుతాయి.

**చివరగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును వ్యతిరేకించే పార్టీలకూ, వ్యక్తులకూ కొన్ని ప్రశ్నలు**

1) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడక ముందే తెలంగాణ ప్రాంతం హైదరాబాద్ రాష్ట్రంగా ఉండటం మీకు తెల్వదా?
2) ఉమ్మడి రాష్ట్ర ఏర్పాటుకు ఒక దశాబ్ద కాలం ముందే తెలంగాణ ప్రజలు వ్యతిరేకిస్తూ ఉన్నారు.
3) సూత్రబద్ధంగా, రాజ్యాంగబద్ధంగా వ్యవహరించాల్సిన పాలకులు ప్రాంతీయ వివక్షతలను చూపడం మీరు సమర్థిస్తారా?
4) ఉమ్మడి రాష్ట్రంలో వెనుకబడేసిన ప్రాంతాభివృద్ధికి యాభై సంవత్సరాల కాలం సరిపోదా? మరి అభివృద్ధి సాకులెందుకు?
5) భాషపేరుతో మోసమెందుకు? హిందీ భాష మాట్లాడే ప్రజలు తొమ్మిది రాష్ట్రాలుగా మనదేశంలో లేరా?
6) స్వాతంత్ర్యకాలంలో 14 రాష్ట్రాలుగా ఉన్న భారతదేశం నేడు 35 రాష్ట్రాలుగా (28 రాష్ట్రాలు, ఏడు కేంద్రపాలిత ప్రాంతాలు) ముక్కలయినపుడు మీరు లేరా?
7) ప్రపంచంలో యాభైకి పైగా దేశాల కంటే, దేశంలో 18 రాష్ట్రాలు 7 కేంద్రపాలిత ప్రాంతాల కంటే విస్తీర్ణంలో పెద్దదైన 'తెలంగాణ' చిన్న రాష్ట్రమెలా అవుతుంది?
8) జీవనదులైన కృష్ణా, గోదావరి ముప్పావువంతు తెలంగాణలోనే పారుకుంటూ (తెలంగాణలో గోదావరి, కృష్ణల పరీవాహక ప్రాంతం వరుసగా 79 శాతం, 69 శాతంగా ఉంది) తెలంగాణ మాగాణులను బీళ్లుగా మార్చేసిన వలసాంధ్ర పాలకుల కుట్ర మీకెందుకు విస్మయం కల్గించడంలేదు?
9) కట్టిన ప్రాజెక్టులు తెలంగాణ బాదువల్లో, పారకం మట్టుకు ఆంధ్ర మిట్టల్లోనా? ఇదెవరి కుట్ర?
10) ఆంధ్ర మూడో పంటకు తెలంగాణ మునగాలా? వేలాది గ్రామాలను, లక్షలాది ఎకరాల పంటభూములను, ప్రజలను నిర్వాసితులను జేసే ప్రాజెక్టులు ఎలా అభివృద్ధి అవుతాయి?
11) దశాబ్దాల క్రితమే ఆంధ్రప్రాంతంలో విరివిగా అన్ని గ్రూపులతో కూడిన జూనియర్ డిగ్రీ కళాశాలలు, సెకండరీ పాఠశాల స్థాయి విద్యావసతులను ఏర్పరుచుకొని, ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణకు మాత్రం ఎందుకు మొండిచేయి చూపించారు?
12) ఉమ్మడి రాష్ట్రంలో మొత్తం 23 జిల్లాలు. ఉన్నత చదువుల కోసంగాను 22 విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. వీనిలో 10 జిల్లాల ప్రాంతమైన తెలంగాణలో ఒకే ఒక్క విశ్వవిద్యాలయం, అదీ 1970లో ప్రారంభమయి వరంగల్ కేంద్రంగా ఉండింది. 9 జిల్లాల కోస్తాంధ్ర ప్రాంతానికే మూడు విశ్వవిద్యాలయాలు, నాలుగు జిల్లాల రాయలసీమ ప్రాంతానికి ఆరు విశ్వవిద్యాలయాలు. ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణ ప్రాంతాలకు కలిపి రాజధానిలో 12 యూనివర్సిటీలు ఉన్నాయి. ఇటీవల ప్రాంతాలవారిగా ఒక్కొక్క విశ్వవిద్యాలయం పెరిగింది. విద్యా పరంగా ఇదీ వెనుకేసే కుట్రగాదా?
13) బొడ్డుగోసిన కానుండి బతికిన తెలంగాణ బిడ్డలకు నిలువ (నివాస) జాగ లేకపోవుడేంది? గజం జాగ సంబంధంలేని కోస్తాంధ్రుడు వేల ఎకరాలకు అధిపతి ఎట్లయితడు?
14) ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణలోనే ఆంధ్రోద్యోగులు ఉండడం ఏంటి? మరి తెలంగాణోళ్లకు ఆంధ్రలో ఉద్యోగాల కల్పన ఎందుకు జరుపలేదు? ఈ సత్యం మీకు తెల్వదా?
15) పొట్టకూటికోసం దేశంలోనే 'పాలమూరులేబర్లు' (మహబూబ్‌నగర్ జిల్లావారు) ఎందుకయిండ్లూ? కడుపు నింపుకోవడానికే సూరత్, భీవండీ, షోలాపూర్ ప్రాంతాలకు వలసపోయిన తెలంగాణోళ్లకు సోమరులెట్లయితరు?
16) వేరు రాష్ట్రం కోసం పొట్టి శ్రీరాములు చావును అమరత్వంగా కీర్తించే వలస, దళారి పాలకులు, భావదాస్యం తలనిండిన తెలంగాణ నివాసితులు, అప్పటికి ముందే ఉండిన తెలంగాణ (హైదరాబాద్) రాష్ట్ర పునరుద్ధరణ లేదా ఏర్పాటు చేయడం కోసం వేలాది విద్యార్థి, యువజనులు చేసిన ప్రాణ త్యాగాలను ఎలా సులువుగా తీసుకో గల్గుతున్నారు?
17) ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే దేశం నుండి విడివడినట్టా? రాష్ట్ర సరిహద్దులను మూసివేసినట్లా?
18) తెలంగాణ మాండలికత, యాస, భాష వెక్కిరింతలమయ మెందుకయితానయి? విలన్‌ల, జోకర్‌ల భాషగానే కుదించడంలో కుట్ర ఎవరిది?
19) తెలంగాణ సాహిత్యం, విశిష్ట సాంస్కృతిక జీవనం మన కాళోజీ, దాశరథీ, బతుకమ్మ, సమ్మక్క-సారక్కలు, జాతరలు, ఇలవేల్పులు, తీర్థాలు - కాదంటారా?
20) తెలంగాణలోని వాడలకు, రోడ్లకు, చౌరస్తాలకు, పార్కులకు,

# 1857 తిరుగుబాటు - స్వరూప స్వభావాలు

- వకుళాభరణం రామకృష్ణ

1857లో జరిగిన తిరుగుబాటుకు 150 ఏండ్లునిండాయి. ఆనాటి ప్రముఖ చారిత్రక ఘటనను నేడు దేశం స్మరించుకుంటున్నది. 1857ను గూర్చి పునర్‌మూల్యాంకనం జరుగుతున్నది. విద్వద్గోష్ఠులు, ప్రత్యేక సంచికలు, గ్రంథాలు వెలువడుతున్నాయి. చరిత్ర అధ్యయనంలో ఉన్న సౌలభ్యం ఇదే. చరిత్ర రచనలో అంతిమ వాక్యం, తీర్పు ఉండవు. నికార్సయిన ఆధారాలపై చరిత్ర రచిస్తారు. కొత్త ఆధారాలు లభించే కొద్దీ, నూతన చారిత్రక పరిశోధనా పద్ధతులు రూపొందినప్పుడు, గత ఘటనలపై తిరిగి బేరీజు వేసుకోవడం జరుగుతుంది. ఇది అవసరం కూడా. 1857 తిరుగుబాటు జరిగిన కాలంలోనూ, ఆ తర్వాత నేటి వరకూ ఎన్నో చారిత్రక గ్రంథాలు, పరిశోధనా పత్రాలు వెలువడుతూనే ఉన్నాయి. నిరంతరంగా జరుగుతున్న ఈ పరిశోధన, 1857 కున్న చారిత్రక ప్రాముఖ్యాన్ని తెలియచేస్తోంది. 1857 ఘటనలకు ఎన్నో కారణాలున్నాయి. కారణాలు, నేపథ్యం ముఖ్యమైన పార్శ్వం. అది ఎందుకు విఫలమైందో వివరించడం మరోముఖ్యాంశం. ఈ రెంటికంటే మరింతగా చరిత్రకారులకు ఆసక్తి కలిగించే కోణం, 1857 స్వభావం గూర్చి. 1857ను ఎలా విశ్లేషించాలి? సిపాయీల పితూరీ (మ్యూటిని)గా చెప్పవచ్చునా? ప్రథమ భారత స్వాతంత్ర సంగ్రామమని వర్గీకరించవచ్చునా? లేక అది సిపాయిల తిరుగుబాటా? రైతాంగం విస్తృతంగా పాల్గొన్న సిపాయిల తిరుగుబాటుగా పేర్కొనగలమా? ఎన్నో ప్రశ్నలు మనకు లభ్యమయ్యే ఆధారాల ఫలితంగా, గతంలో చరిత్రకారుల ప్రామాణిక రచనల్లోని అభిప్రాయాలను పరిశీలించడం ద్వారా కొన్ని నిర్ణయాలకు రావల్సి ఉంటుంది.

1857కు నూరేండ్లకు ముందు 1757లో ప్లాసీ యుద్ధంలో విజయం సాధించి ఇంగ్లీషు తూర్పు ఇండియా కంపెనీ, సంపన్నమైన, కీలకమైన బెంగాల్ రాష్ట్రాన్ని ఆక్రమించుకొంది. ఆ తర్వాత బీహార్‌ను కలుపుకొని రాజకీయ ప్రాబల్యానికి గట్టి పునాదులు వేసుకొంది. క్రమేపీ 19వ శతాబ్ది మధ్యభాగానికి దేశంలోని దాదాపుగా అత్యధిక భాగాన్ని తమ పాలన కిందికి తెచ్చుకొంది. యుద్ధాలు, కుతంత్రాలు, ప్రలోభాలు, సైన్య సహకార పద్ధతి, రాజ్యసంక్రమణ సిద్ధాంతం లాంటి విధానాల ద్వారా తమ ఆక్రమణ కార్యక్రమాన్ని కొనసాగించింది. కార్ల్‌మార్బ్స్ భారత దేశంపై రాసిన వ్యాసాల్లో పేర్కొన్నట్టు, ఈ విధానాల వెనుక ఆంగ్లేయులు తు.చ. తప్పకుండా పాటించిన విభజించు పాలించు విధానం వల్లనే ఆక్రమణలు కొనసాగించి, దాదాపు రెండు వందల సంవత్సరాలు పరిపాలించారు.

ఆంగ్లేయ పాలన ప్రారంభం నుండే దాని పట్ల భారతీయుల్లో వ్యతిరేకత మొదలైంది. వలసపాలనను ఎదిరిస్తూ, చిన్నా, చితకా యుద్ధాలు, తిరిగుబాట్లు జరుగుతూ వచ్చాయి. దేశం మొత్తంగా ఏనాడూ ఆంగ్లపాలన ప్రజామోదాన్ని పొందలేదు. ఇది చారిత్రక వాస్తవం. ఆంగ్లపాలకులు, తాము ప్రజామోదం ద్వారానే ఈ దేశాన్ని పరిపాలించారనడం నిజం కాదు. 1757 నుండి 1857 దాకా దేశం నలుమూలల్లో జరిగిన తిరుగుబాట్లు కొన్ని వందల సంఖ్యలో ఉన్నాయి. వీటిని మూడు రకాలుగా విభజించవచ్చు. 1) పౌర సమాజపు తిరుగుబాట్లు, 2) రైతాంగ తిరుగుబాట్లు, 3) ఆదివాసీ తిరుగుబాట్లు. వీటిలో చాలవాటిని ఎస్.బి. చౌదరి తన గ్రంథం 'సివిల్ డిస్టర్బెన్సెస్ డ్యూరింగ్ ది బ్రిటిష్ రూల్ ఇన్ ఇండియా' (1955) లో డాక్యుమెంట్ చేశారు. ఈ అంశం ఏం తెలియచేస్తున్నది? ఒకటి, భారతీయ సమాజం స్తబ్దతతో కూడుకొన్నది కాదు. అందులో చలనం, చైతన్యం ఉన్నాయి. భారతీయ రైతాంగం కొందరు పాశ్చాత్య సామాజిక శాస్త్రవేత్తలు వర్ణించినట్లుగా సాత్విక స్వభావంతో కూడుకొన్నది కాదు. నిరసన, దాంతోపాటు ధిక్కారం, భారతీయుల వ్యక్తిత్వంలో భాగాలు. అణచివేత, దోపిడీలను వ్యతిరేకించి, పోరాటాలు జరిపారు. ఈ దిశలో చూసినప్పుడు 1857 అంతకు ముందు జరిగిన అనేకానేక తిరుగుబాట్లకు కొనసాగింపు, పరాకాష్ఠ.

మేము ఈ వ్యాసంలో తిరుగుబాటుకు దారితీసిన కారణాల చర్చ చేయబూనడం లేదు. ఈ వ్యాస ఉద్దేశ్యం కూడ అదికాదు. లేకుంటే, 1757 నుండి 1857 దాకా సాగిన నూరు సంవత్సరాల ఆంగ్లపాలన భారతీయ సమాజంలో ఏ మార్పులు తెచ్చిందన్న అంశాన్ని ప్రస్తావించుకోవాలి. భారతదేశంలోని ఆంగ్లపాలన గూర్చి కార్ల్‌మార్బ్స్ న్యూయార్క్ ట్రిబ్యూనల్‌లో వ్యాసాలు రాశాడు. ఆంగ్లపాలనపై మార్బ్స్ చేసిన విశ్లేషణ లోతుగా, ఎంతో అర్థవంతంగా ఉంది. కార్ల్‌మార్బ్స్ దృష్టిలో ఆంగ్లేయుల వలసపాలన రెండు కర్తవ్యాలను నిర్వహించింది. ఒకటి విధ్వంసన, రెండు పునరుద్ధరణ. కాలం చెల్లిపోయిన ఆసియా ఖండపు సమాజాన్ని బద్దలుకొట్టి, దాని స్థానంలో ఆధునిక భావజాలంతో కూడిన భౌతిక పునాదులతో సమాజాన్ని నిర్మించడం. ఆంగ్లపాలన

---

కాలనీలకు ఆంధ్రుల పేర్లే ఎందుకు పెడుతున్నట్టూ? ఒక బందగీ, ఒక ఐలమ్మ, ఒక కొమురంభీం, ఒక దొడ్డి కొమురయ్య, ఒక సర్వాయి పాపన్న ఇంకా ఊరూరా ఉన్న పోరాటవీరులు ఎట్లా పనికిరాకుండయిండ్లు? తెలంగాణ చారిత్రక వారసత్వాన్ని కనుమరుగుజేసే కుట్ర ఇందులో లేదా? కోస్తాంధ్రలో తెలంగాణ పేర్లు ఏమైనా పెట్టారా?

21) వాంఛూ కమిటి నుండి నేటి గిర్‌గ్లానీ కమీషన్‌ల వరకూ తెలంగాణకు జరుగుతున్న అన్యాయాలపై ఎప్పుడైనా అధ్యయనం చేసే ప్రయత్నమైనా చేశారా?

22) తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఏ చారిత్రక భౌతిక గతితార్కిక సూత్రాలకు విరుద్ధమో ఎర్ర రంగు పార్టీలు పీడిత తెలంగాణ ప్రజలకు జవాబు చెప్పాలి. ◆

సంప్రదాయ ఆర్థిక వ్యవస్థను భారతదేశంలో విచ్చిన్నం చేసింది. నూతన భూమి, శిస్తు విధానాలు, శాశ్వత రైత్వారీ ప్రవేశపెట్టింది. మధ్యయుగాల జమీందార్ల స్థానే కొత్త జమీందార్లను సృష్టించి, తమకు వత్తాసుగా నిలుపుకొంది. ముందున్న నీటిపారుదల సౌకర్యాలను నిర్లక్ష్యం చేసింది. వ్యవసాయం దెబ్బతినింది. దీనికితోడు, చేతివృత్తులు క్షీణించి, వాటిపై ఆధారపడ్డ వారు విధిలేక వ్యవసాయంపై ఆధారపడాల్సి రావడంతో భూ కమతాలు మరింతగా తగ్గి, వ్యవసాయరంగం తీవ్ర సంక్షోభానికి గురైంది. గ్రామీణ కుటీర పరిశ్రమలు పారిశ్రామికోత్పత్తుల దిగుమతితో దెబ్బతిన్నాయి. కొత్త పరిశ్రమలు ఇంకా స్థాపించబడలేదు. దేశం కరువు కాటకాలకు నిలయంగా మారింది. పూర్వపు మతవిశ్వాసాలు సంఘ సంస్కరణల వల్ల క్షీణింపనారంభించాయి. మత వర్గాలు తీవ్ర అసంతృప్తికి గురయ్యాయి. సంప్రదాయ శక్తులు ప్రభుత్వంపై కత్తులు నూరడం ప్రారంభించాయి. పూర్వపు పరిపాలనా వ్యవస్థల స్థానే నూతన నిర్మాణాలు న్యాయస్థానాలు వచ్చాయి. నూతన విద్యావిధానం సంప్రదాయ శిక్షణాలయాలను బలహీనపర్చాయి. సమాజంలో అనాదిగా వస్తున్న పలుకుబడి కలిగిన సామాజిక వర్గాలు తీవ్ర అసంతృప్తికి గురయ్యాయి. భారతీయ సమాజం కుతకుత ఉడికే కుండలా ఉంది. అన్ని వర్గాలు, సంస్థానాధీశులు, చిన్న రాజ్యాల నేతలు, రైతాంగం, ఉపాధి కోల్పోయిన చేతివృత్తుల వారు, మతపెద్దలు – అందరూ ఆంగ్ల పాలనను నిరసిస్తున్నారు. ఈ నిరసన 1857 నాటికి ద్వేషంగా మారింది. ఇరవై కోట్ల ప్రజలను అదుపులో పెట్టడానికి, ఆంగ్ల సైనికోద్యోగుల ఆధిపత్యంలో రెండు లక్షల దేశీయ సైన్యాన్ని ఏర్పాటు చేసుకున్నారు. వీరిని నిరంతరం జాగురూకతతో కనిపెట్టి ఉండడానికి నలభైవేల ఆంగ్ల సైన్యాన్ని నిర్మించుకున్నారు. దేశీయ సైన్యం గురించి కార్ల్ మార్క్స్ చేసిన వ్యాఖ్యానం రానున్న ఘటనలను సూచించేట్టుగా ఉంది. మార్క్స్ మాటల్లో "భారతదేశ ప్రజలకు ఎన్నడూ లేనట్టి దేశ వ్యాప్తమైన ప్రథమ సాధారణ ప్రతిఘటన కేంద్రాన్ని సృష్టించారు". ఈ సందర్భంలో కార్ల్ మార్క్స్ వెలిబుచ్చిన అభిప్రాయాలు గమనంలోకి తీసుకోవాలి. దోపిడికి గురై చితికిపోయిన రైతాంగం 1857 తిరుగుబాటును ప్రారంభించలేదని, సకల సౌకర్యాలు అనుభవిస్తున్న సైనికులు, ఆఫీసర్లే తిరుగుబాటును ప్రేరేపించారని మార్క్స్ అన్నాడు. ఈ పరిణామం ఆంగ్ల పాలకులను ఆశ్చర్యంలో ముంచెత్తిందని మార్క్స్ అభిప్రాయపడ్డాడు. ఇది నిజం. ఒకసారి సైన్యంలో తిరుగుబాటు జరిగాక, సామాన్య ప్రజానీకం, రైతాంగంతోపాటు తిరుగుబాటులో పాల్గొన్నారు. ఇది లోతుగా పరిశీలించాల్సిన అంశం. ఎందుకంటే సైనిక తిరుగుబాటు మాత్రమే అయితే దాన్ని పితూరీ (మ్యూటిని) అనొచ్చు. అయితే అప్పుడు కూడా మనం లెనిన్ అన్న మాటలు గుర్తుంచుకోవాలి. "సోల్జర్ ఈజ్ ఎ పీజెంట్ ఇన్ యూనిఫాం" (సిపాయి సైనిక దుస్తుల్లో ఉన్న రైతు).

తిరుగుబాటు స్వభావం నిర్ధారించేముందు అది జరిగిన తీరు, విస్తృతి, వైఫల్యాల గురించి క్లుప్తంగానైనా చెప్పుకోకుంటే సరియైన నిర్ణయాలకు రాలేం. తిరుగుబాటు దేశంలోని అన్ని ప్రాంతాలకు విస్తరించలేదు. అన్ని రకాల ప్రజా సముహాలను కదపలేదు. దక్షిణ భారతంతోపాటు, తూర్పు, పశ్చిమ భారతాల్లో కూడా తిరుగుబాటు ఛాయలు లేవు. అనేక సంస్థానాధీశులు, జమీందార్లు వారి స్వార్థ కారణాలతో తిరుగుబాటులో పాల్గొనలేదు. సింధియా (గ్వాలియర్), హోల్కార్ (ఇండోర్), నిజాం (హైదరాబాద్), జోధ్‌పూర్ పాలకుడితో సహా మరెందరో రాజపుత్ర రాజులు, భోపాల్ నవాబు, పంజాబ్‌లో సిక్కు ప్రభువులు, కాశ్మీర్ మహారాజా, నేపాల్ రాణాలు, ఆంగ్లేయులకు మద్దతిచ్చారు. మొత్తం సంస్థానాల్లో, స్వతంత్ర రాజ్యాల్లో ఒక్క శాతం మాత్రమే తిరుగుబాటులో పాల్గొన్నారు. మిగతా వారు ఆంగ్లేయుల విజయాన్ని కాంక్షించారు. తిరుగుబాటుదారులకు, ఆంగ్ల ప్రభుత్వానికి అడ్డుగా నిలవకపోతే, ఆంగ్లేయాధికారం తిరుగుబాటు ప్రవాహంలో కొట్టుకుపోయేది. దాదాపు మద్రాస్, బెంగాల్, బొంబాయి రాష్ట్రాల్లో అక్కడి ప్రజాభిప్రాయం ఆంగ్లేయులకు సానుకూలంగా ఉన్నా తిరుగుబాటు జరగలేదు. మరో ముఖ్య విషయం, ఉన్నత, మధ్య తరగతి వర్గాలు తిరుగుబాటును వ్యతిరేకించారు. తిరుగుబాటు ప్రారంభ దశలో చురుగ్గా పాల్గొని అయోధ్యలోని తాలూకాదార్లు (పెద్ద జమీందార్లు), ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న వారి భూములను తిరిగి ఇచ్చేస్తామని ప్రకటించేసరికి పోరాటం నుండి విరమించుకున్నారు. దీంతో అంతవరకూ క్రియాశీలకంగా గెరిల్లా తరహా పోరాటం సాగించిన సైనికులు, వారితో పాటు రైతాంగం పోరాటాన్ని కొనసాగించ లేకపోయారు. గ్రామీణ ప్రాంతాల్లో తిరుగుబాటుదారులచే దెబ్బతిన్న వడ్డీ వ్యాపారస్తులు తిరుగుబాటును వ్యతిరేకించారు. ఆక్రమిత ప్రాంతాల్లో తిరుగుబాటు నాయకులు విధించిన అధిక పన్నులు నిరసిస్తూ వాణిజ్య వర్గాలు కూడా తిరుగుబాటును వ్యతిరేకించాయి. వారి నిలువ చేసుకున్న ధనాన్ని తిరుగుబాటుదార్లు కొల్లగొట్టారు. పైగా ఈ వాణిజ్య వర్గాలు తమ విదేశీ వాణిజ్య లావాదేవీల్లో ప్రభుత్వం పై ఆధారపడ్డం వల్ల కూడ ఆంగ్లేయుల పక్షాన ఉండిపోయారు. ముందే చెప్పినట్టు ఆధునిక విద్యాధిక వర్గం ఆంగ్లేయుల ప్రభుత్వం ప్రవేశపెట్టిన సంఘ సంస్కరణల పట్ల సానుకూలంగా స్పందించి, ఆంగ్ల ప్రభుత్వం దేశానికి కావలసిన మార్పులను ప్రవేశపెడ్తుందనుకున్నారు. పైగా ప్రజలను సమీకరించడంలో తిరుగుబాటుదార్లు సంప్రదాయ మత పద్ధతులను, మూఢ విశ్వాసాలను పాటించడంతో విద్యాధిక వర్గం మరీ బెంబేలెత్తిపోయింది. ఈ వర్గం, ప్రభుత్వం ప్రవేశపెట్టిన చట్టబద్ధమైన పాలనను, పిండారీలు, థగ్గులను అణచి శాంతిని నెలకొల్పి, దేశాన్ని సమైక్య పర్చారని విశ్వసించారు. ఇది వాస్తవంలో వారి అవగాహన లోపం వలన పాలనలోని పై మెరుగులకు భ్రమపడి, దానిలోని ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక ఆధిపత్యాన్ని, దోపిడి దుర్మార్గాలను అంచనా వేయడంలో పెద్ద తప్పిదమే చేశారు. కానీ, అంత మాత్రం చేత వారిని దేశద్రోహులనడం సరికాదు. ఎందుకంటే తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న మధ్యయుగాల భూస్వామ్య శక్తులు తిరిగి అధికారంలోకి వస్తే వారు దేశగమాన్ని వెనక్కి మళ్లిస్తారని గట్టిగా నమ్మారు. అయితే, మరో కోణం నుండి చూసినప్పుడు ఈ విషయంలో విద్యాధికుల దృష్టి కంటే తిరుగుబాటుదార్ల వైఖరి, ఆంగ్లేయుల పాలనచెడ్డది. అది దేశానికి మేలు చేయదు కాబట్టి దాన్ని అంతమొందించాలని వారు భావించారు. ఇది ఆశ్చర్యం కలిగించేటంతటి, అభినందించదగ్గ వాస్తవం. 1858 తర్వాత విద్యాధిక వర్గం తన వైఖరి మార్చుకొంది. వలస పాలనా స్వభావంలో మార్పు వచ్చి, వారు దేశాన్ని ఆధునికీకరణ చేసే

కార్యక్రమాన్ని విరమించుకొని, దేశాన్ని శాశ్వతంగా పరిపాలించ దలుచుకొన్నప్పుడు, వారి మోసాన్ని, వలసవాదంలోని దుష్ట స్వభావాన్ని గ్రహించి, జాతీయోద్యమ అంకురార్పణకు, అభివృద్ధికి దోహదం చేశారు.

ఇవన్నీ చరిత్రలో జరిగిన విషాదకర పరిణామాలు. పైగా భారతీయ సిపాయిలకు ఆధునిక సాయుధ సంపత్తి కొరవడింది. పోరాటంలో నిర్మాణ కౌశలం లోపించింది. వివిధ ప్రాంతాల్లో జరిగిన తిరుగుబాట్ల మధ్య సమన్వయం లేదు. సమర్థమైన కేంద్ర నాయకత్వం లేదు. ఎనలేని త్యాగాలయితే చేశారు కానీ క్రమశిక్షణ లోపించింది. సమయానికి సరుకుల సప్లయిలు అందక నానా కష్టాల పాలయ్యారు. ఆంగ్ల పాలన అంతమైతే ప్రత్యామ్నాయ రాజకీయ, ఆర్థిక సామాజిక వ్యవస్థ గూర్చిన అవగాహన లేదు. పరస్పర భయం, అనుమానం, ద్వేషం వీరిమధ్య నెలకొంది. ఇక బ్రిటిష్‌వారు ప్రపంచ విజేతలు. అన్ని హంగులున్నాయి. కేవలం వీరోచిత సాహసిక కృత్యాలు బలమైన ఒక ఆధునిక రాజ్య శక్తిపై విజయాన్ని సాధించగలవా? తిరుగుబాటు వైఫల్యం గొడమీద రాతయింది. తిరుగుబాటు ముగిశాక ప్రభుత్వం జరిపిన హింసాకాండ పరమ కిరాతకంగా సాగింది. వేలాది మందిని ఊచకోత కోశారు. ముస్లింలను మరీ వేరు చేసి హతమార్చారు. 1857 తర్వాత మొదలైంది భారతదేశంలో మతతత్వం. తమకు దూరమైన ముస్లింలను చేరదీసి, హిందువుల నుండి వేరు చేసి, తమ పబ్బం గడుపుకొన్నారు.

తిరుగుబాటు విఫలమైనా, దేశ చరిత్రలో అదొక ఉజ్వలఘట్టంగా నిల్చిపోయింది. ఇక, తిరుగుబాటు స్వభావాన్ని పై విషయాలతో జోడించి, విశ్లేషించాలి. పాత పద్ధతులతో, ఫ్యూడల్ నాయకత్వంలో జరిగినా, తిరుగుబాటు ధ్యేయం విదేశీ పాలనను అంతమొదించాలన్నదే. జాతీయోద్యమానికి ఇది నాంది పలికింది. గతంలో జరిగిన ప్రాంతీయ స్థానిక తిరుగుబాట్లు – 1857 అన్నీ కలిసి భారతీయుల మనోఫలకం పై చెరగని ముద్ర వేశాయి. స్వాతంత్ర్య పోరాటానికి స్ఫూర్తినిచ్చాయి. వ్యాస ప్రారంభంలో మేము ప్రతిపాదించిన మూడు విధాల స్వభావ నిర్ధారణలో, నిశిత పరిశీలనానంతరం 1857ను సిపాయిల పితూరీగా వర్ణించడం సరికాదు. తిరుగుబాటు జరిగిన తరుణంలో ఆ పిమ్మట కొన్ని దశాబ్దాలుగా ఆంగ్ల చరిత్రకారులు దీన్ని గూర్చి రాశారు. జిబి మాలిసన్, సర్ జాన్ విలియం కే, చార్లెస్ బాల్, రెవ. అలెగ్జాండర్ డఫ్ ఇంకా ఎందరో ఉన్నారు. వీరందరు 1857ను సిపాయిల పితూరీగా కొట్టిపారేయలేదు. సైనికులకు ప్రజాస్పందన అనేక ప్రాంతాల్లో లభించిందని వీరు ఆధారాలతో రుజువు చేశారు. బెంజిమిన్ డిస్రెలీ (ఆ తర్వాత కాలంలో ఇంగ్లాండ్‌కు ప్రధాన మంత్రి) తిరుగుబాటును 'సైనిక పితూరీ'గా చిత్రించడం సరికాదుంటూ దాన్నొక జాతీయ తిరుగుబాటుగా పేర్కొనవచ్చునన్నాడు. చార్లెస్ రైకాస్ మొదలగువారు పితూరీగా పేర్కొనగా, కొందరు భారతీయ చరిత్రకారులు శంభూచంద్ర ముఖోపాధ్యాయ, హరిష్‌చంద్ర ముఖర్జీ తదితరులు దీన్ని సైనిక తిరుగుబాటుగా పరిగణించారు. టిఆర్ హోమర్ అనే ఆంగ్లేయ చరిత్రకారుడు దీన్ని 'ఏ వార్ బిట్వీన్ బార్బేరిజమ్ అండ్ సివిలైజేషన్' అన్నాడు.

జాతీయ స్వతంత్ర పోరాటం బలం పుంజుకుంటున్న తరుణంలో జాతీయ భావజాలంతో చరిత్ర రచన ఉత్తేజం పొందింది. ఆ దశలో, 1857ను గూర్చి రాసిన చరిత్రకారుల్లో వినాయక దామోదర సావర్కర్ ప్రముఖుడు. సావర్కర్ స్వాతంత్ర పోరాటంలో చురుగ్గా పాల్గొని అండమాన్ జైలుకు పంపబడ్డాడు. 1857కు ప్రజాస్పందన విస్తారంగా లభించిందని చెపుతూ మొదటిసారిగా తిరుగుబాటును భారత స్వాతంత్ర సంగ్రామంగా వర్ణించాడు. ఈ గ్రంథం జాతీయ ఉద్యమానికి మంచి ఊపునిచ్చింది. ఆంగ్ల ప్రభుత్వం దీన్ని నిషేధించింది. 1947 కల్లా చరిత్ర పరిశోధన వృద్ధి చెందడంతో పాటు భారతీయుల వలస వ్యతిరేక పోరాటాల గూర్చి అట్టడుగున పడి కనిపించని విషయాలను వెలికితీసే ప్రయత్నం ఆరంభమైంది. ప్రభుత్వమే పనిగట్టుకుని ఈ పరిశోధనలను ప్రోత్సహించింది. తిరుగుబాటు స్వర్ణోత్సవాలు 1957లో అప్పటి విద్యామంత్రి మౌలానా అబుల్ కలాం అజాద్ నేతృత్వంలో జరిగాయి. 1857పై స్వతంత్రంగా, సమగ్రంగా పరిశోధన జరపడానికి ప్రముఖ చరిత్రకారుడు సత్యేంద్రనాథ్ సేన్‌ను నియోగించారు. ఎస్.ఎన్. స్యూ, 'ఎయిటీన్ ఫిఫ్టీ సెవెన్' అనే గ్రంథాన్ని అనేకానేక కొత్త విషయాల్ని సేకరించి పరిశీలించి, వెలువరించాడు. దానికి అబుల్ కలాం మౌలానా అజాద్ ఉపోద్ఘాతం రాశాడుగూడ. మరో ప్రముఖ చరిత్రకారుడు తారాచంద్, 'హిస్టరీ ఆఫ్ ఫ్రీడం మూవ్‌మెంట్ ఇన్ ఇండియా' అనే నాలుగు సంపుటాల గ్రంథాన్ని, 1857 నుండి 1947 దాకా జరిగిన చరిత్రను గ్రంథస్తం చేసాడు. భారతీయ చరిత్రకారుల్లో పేరెన్నికగన్న అనుభవజ్ఞులు రమేష్‌చంద్ర మజుందార్ బహుగ్రంథ కర్త. ఆయన "సిపాయి మ్యూటిని అండ్ ది రివోల్ట్ ఆఫ్ 1857" అనే గ్రంథం రాశాడు. పి.సి. జోషి సంపాదకత్వంలో వెలువడ్డ '1857 – ఎ సింపోజియం' అనే మరో ముఖ్య గ్రంథం కూడా (1957లో) వెలువడింది. భారతీయ చరిత్రకారులు రాసిన వాటిలో ఇవి ముఖ్యమైనవి అని చెప్పవచ్చు. సావర్కర్ భారతీయ స్వాతంత్ర్య సంగ్రామంగా దీన్ని నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. సావర్కర్‌ను మినహాయిస్తే, మిగతా వారిలో రెండు పరస్పర విరుద్ధ అభిప్రాయాలు ఉన్నాయి. రమేష్‌చంద్ర మజుందార్, ఆయన పరిశోధనా అనుయాయులు 1857ను స్వాతంత్ర పోరాటంగా చెప్పడాన్ని నిరాకరిస్తూనే, కేవలం పితూరీగా అనడానికి అంగీకరించలేదు. మజుందార్ గ్రంథం పేరులో ఉన్నటుగా దాన్ని మ్యూటినితో పాటు రివోల్ట్ అని కూడా అన్నారు. రివోల్ట్ అనడంలో, పాలకులకు లోబడి విశ్వాసంగా ఉండిపోవడం మాత్రమే కానీ, వారి పరిపాలనను తిరస్కరించడం కాదని విశదీకరించాడు. మజుందార్ అభిప్రాయం ఆంగ్ల చరిత్రకారుల భావాలకు దగ్గరగా ఉంది. వారు దీన్ని పితూరిగానే చెప్పి ఊరుకోలేదు. ప్రజలు పాల్గొనడంతో తిరుగుబాటు లక్షణాలు ఉన్నాయి అన్నారు. కానీ ఆ తిరుగుబాటు దేశాన్ని విముక్తి చేసేందుకు కాదంటూ, స్వార్థప్రయోజనాల కోసం, రాజ్యాలు, సంస్థానాలు, ఇతర సదుపాయాలు, ప్రత్యేక హక్కులు కోల్పోయినవారి చర్య అని మజుందార్ అభిప్రాయం. రెండో అభిప్రాయం తారాచంద్‌ది. ఈయన 1857ను ప్రజా తిరుగుబాటుగా వర్గీకరించాడు. దీంతో ఎస్.బి. చౌదరి (సివిల్ రిబెలియన్స్ గ్రంథ కర్త) అంగీకరించాడు. మజుందార్, తారాచంద్ అభిప్రాయాలకు భిన్నంగా సురేంద్రనాథ్ సేన్ తన గ్రంథంలో (ఎయిటీన్ ఫిఫ్టీ సెవెన్) తిరుగుబాటుకు ప్రజాస్వభావం (పాపులర్) అయోధ్య, దాని పరిసర ప్రాంతాల్లో భారీ ఎత్తున ప్రజలు తిరుగుబాటులో పాల్గొన్నందు వల్ల కలిగిందన్నారు. అక్కడ ప్రజలు పాల్గొనడానికి కారణం, అయోధ్యను

# విఫలమైన ప్రజాస్వామిక విప్లవ ప్రారంభం - 1857

**- వరవరరావు**

**త**మ అధికారం తమ చేతుల్లో అనే అర్థంలో 1857 ప్రథమ భారత స్వతంత్ర పోరాటాలు నిస్సందేహంగా స్వతంత్ర పోరాటాలే. ఈ పోరాటాలు స్థూలంగా సమాజంలోని (1) రైతాంగం, (2) వాళ్ల నుంచే వచ్చిన సిపాయిలు (3) ఆ సిపాయీల మత విశ్వాసాలు (4) ఆ సిపాయిల ఒత్తిడి వల్ల సంస్థానాధీశులు, ఫ్యూడల్ శక్తులు చేసాయి.

మన దేశం మీదికి అప్పటికే వెయ్యి సంవత్సరాల నుంచి బయటి నుంచి వచ్చిన దండయాత్రలకు, ఈస్టిండియా కంపెనీ జోక్యానికి మధ్యన సారాంశంలో ఉన్న తేడాను అర్థం చేసుకుంటే తప్ప ఈ దేశంలో ఏ వర్గమయినా ఎందుకు స్వతంత్రం కోసం పెనుగులాడిందో అర్థం చేసుకోలేం. ఇక్కడ నలుపు, తెలుపుల్లోనో ప్రగతి, అభివృద్ధి, పురోగమనం తిరోగమనం, మతవిశ్వాసం - సెక్యులరిజం అనే ప్రమాణంతోనో కాక మంచయినా చెడయినా మన దేశంలో మనదిమనం అనే స్పృహ ఒక బృహద్రూపం కర్ణాటక నుంచి ఔధ్ దాకా, కన్యాకుమారి నుంచి కాశ్మీర్ దాకా ఏర్పడిందని, అది 1857-59ల మధ్యన వ్యక్తమయిందని గ్రహించడం వీలవుతుంది.

ఫోర్డ్ ఫౌండేషన్, పబ్లిక్‌లా 480 నుంచి అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచ బ్యాంకుల పేరుతో చివరకివ్వాళ ప్రత్యేక ఆర్థిక మండలాల దాకా ఎగబాకిన అమెరికా సామ్రాజ్యవాదం జోక్యం నేపథ్యంలో 1707లో ఔరంగజేబు మరణంతో ప్రారంభమై 1857 వరకు భారతదేశంలో, ముఖ్యంగా సంస్థానాల్లో ఈస్టిండియా కంపెనీ కలిగించుకున్న జోక్యాన్ని విశ్లేషిస్తే పెట్టుబడి ఫ్యూడలిజంతోపాటు అన్ని శక్తులను లొంగతీసుకునే వైనం అర్థంమవుతుంది. ముఖ్యంగా ఆ పెట్టుబడి గుత్తపెట్టుబడి స్థాయికి 'ఎదిగినప్పుడు.'

పెట్టుబడి ఇంగ్లాండులో, ఇండియాలో (ప్రస్తుతం ఒక ఇండియా గురించే మాట్లాడుకుందాం) పూర్తిగా ఒకే రకమైన ప్రయోగం చేయలేదు. ఇంగ్లాండులో అది ఫ్యూడలిజాన్ని పూర్తిగా రద్దుపరచి పారిశ్రామిక విప్లవం ద్వారా ఆర్థిక రంగంలో, క్రామ్‌వెల్ తిరుగుబాటు ద్వారా రాజకీయ రంగంలో (పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడం ద్వారా) ఒక పురోగమన సామాజిక దశను సాధించింది. ఫ్రాన్సులో ఫ్రెంచి విప్లవం సాధించిన స్వేచ్ఛ, సమానత్వ, సౌభ్రాతృత్వాలు తెలిసినవే.

పెట్టుబడికి ఉన్న పురోగమన స్వభావం అక్కడితో ఆగిపోయింది.

ఈస్టిండియా కంపెనీ ఇండియాలో ప్రవేశించిన దగ్గర్నించీ ఇక్కడి ప్రజలతో, రైతులతో, మతంతో, సంస్థానాధీశులతో మైత్రీ ఘర్షణల సంబంధాలే నెరపింది. ఓడ రేవులయిన కలకత్తా, మద్రాస్, బొంబాయి నగరాల్లో దిగి, అక్కడ కోటలు నిర్మించుకొని, అక్కడ అప్పటికే ఉన్న సంస్థానాధీశులను, ఢిల్లీలో బలహీనంగా ఉన్న మొఘల్‌రాజులను అయితే పూర్తిగా నజరానాల ద్వారా మచ్చిక చేసుకోవడం లేదా పదవీచ్యుతులను చేయడం అనే ప్రయోగాలు చేస్తూవచ్చింది. రాజుల కోటలను ఆధునీకరించడం, రాజులకోసం 'పన్నులు వసూలు చేయడానికి ఒక యంత్రాంగాన్ని సమకూర్చడం, ప్రజలమీద రాజులు అమలు చేయదలుచుకున్న అణచివేతకు అండగా సైన్యాన్ని సమకూర్చడం, అందులో ఎట్లాగూ ఎక్కువ బ్రిటిష్ సైనికులను ఇవ్వలేదు గనుక సిపాయిలను వేల సంఖ్యలో నియమించడం, వీళ్లకు జీతభత్యాలు సమకూర్చలేని విలాసవంతులైన సంస్థానాధీశ్వరుల పరిపాలనలో సైనికంగా కూడ జోక్యం చేసుకోవడం ఆ వివరాల్లోకి వెళ్తే అది ఒక ఆసక్తిదాయకమైన విషాద ఆక్రమణ.

సత్యజిత్ రే హిందిలో నిర్మించిన 'షత్రంజ్ కే ఖిలాడీ' సినిమాను చదరంగం ఆడుతున్న రాజులు పీలుస్తున్న హుక్కాల సోమరి నేపథ్యం నుంచి వెనక్కి చూడగలిగితే, సాగిపోతున్న కారవాన్‌లు ఔధ్ సంస్థాన పతనంతో ఈస్టిండియా కంపెనీ కాస్తా బ్రిటిష్ రాణి పరిపాలనగా మారడం మనసు ఊహించుకోగలుతుంది.

---

బ్రిటిష్‌వారు చట్ట వ్యతిరేకంగా దురాక్రమణ చేశాక, అయోధ్య నవాబు దగ్గరున్న సైన్యాన్ని రద్దు చేశారు. దాంతో ఉపాధి కోల్పోయిన సైనికులు ఇంటి ముఖం పట్టారు. వారంతా గ్రామీణ రైతాంగ కుటుంబాల నుండి వచ్చినవారే కావడంతో అసంతృప్తి చెందిన రైతాంగం తిరుగుబాటులో పాల్గొన్నారని, అందరు చరిత్రకారులు అంగీకరించిన విషయం. ఇలాంటి ప్రజా సమీకరణ దేశంలో మరెక్కడా లేదని సేన్ అభిప్రాయపడ్డాడు. 1857 గూర్చి కార్ల్‌మార్క్స్ వివరంగా రాశాడు. ఇండియా నుండి ఇంగ్లాండ్‌కు వెళ్లే అధికారిక సమాచారాన్ని ఆధారం చేసుకొని రాసిన ఈ వ్యాసాలు సమాచార పుర్వకంగానే కాక, చారిత్రక ప్రాముఖ్యతను సంతరించుకొన్నాయి. మార్క్స్ 1857 ఘటనను ప్రథమ భారత స్వాతంత్ర సంగ్రామంగా పేర్కొనలేదు. 19వ శతాబ్ది మధ్యలో ఆసియా ఖండంలో పెల్లుబుకుతున్న వలసవాద వ్యతిరేక పోరాటాల్లో భాగంగా పరిగణించాడు. సిపాయిలు మొదలెట్టి, అధిక సంఖ్యలో పాల్గొన్నా, వారిని కేవలం ఒక పనిముట్టుగానే (ఇన్‌స్ట్రుమెంట్) తప్ప, మరేమీ కాదన్నారు. సాయుధ సిపాయి పితూరీగా వర్ణించడాన్ని ఖండించాడు. జాతీయ తిరుగుబాటుగా, ఆంగ్ల పాలకులకు వ్యతిరేకంగా జరిగిన ప్రజా విప్లవంగా పేర్కొన్నాడు. హిందువులు - ముస్లింలు కలసి ఉమ్మడిగా భుజం భుజం కలిపి పోరాడిన విషయాన్ని ప్రత్యేకించి ప్రస్తుతించాడు.

అంతిమంగా, 1857 సిపాయీల పితూరీగా ప్రారంభమైంది. ప్రజాదరణ లభించి, విరివిగా ప్రజలు కొన్ని ప్రాంతాల్లోనైనా పాల్గొనడంతో ప్రజా తిరుగుబాటు స్వభావాన్ని సంతరించుకొంది. విద్యాధికవర్గం వ్యతిరేకించింది. చాల ప్రాంతాలు పాల్గొనలేదు. తిరుగుబాటును అణచడంలో భారత సిపాయిల పాత్ర ప్రముఖంగా ఉండింది. కేవలం ఆంగ్ల సైనికులే అయితే, ఆంగ్లేయులు సంవత్సరం తిరగకముందే దేశం వదిలి వెళ్లిపోయేవారు. ప్రథమ స్వాతంత్ర సంగ్రామంగా పేర్కొనలేం. ◆

పెట్టుబడిదారీ సహజీవనం కూడ అసాధ్యమై ఘర్షణ స్థాయికి వెళ్లి ఫ్రెంచి, డచ్చి వలసలను కూడ క్రమంగా ఈస్టిండియా కంపెనీ కైవసం చేసుకోవడం మనమిక్కడ చూసినప్పుడు క్రమంగా ఒక వ్యాపార కంపెనీని మనం వ్యాపార కంపెనీగా చూడడం 18వ శతాబ్దానికే మరచిపోయి, అది మనం ఆమోదించిన ఒక రాజకీయ జోక్యంగా దేశంలో ప్రవేశించిందని గ్రహిస్తాము.

ఇప్పుడెట్లాగయితే మన పార్లమెంట్‌లో, మన శాసనసభల్లో మన ప్రభుత్వాలు చేసే పనులు ప్రపంచ బ్యాంకుకు ఇష్టమవుతాయో, కావో అని మాట్లాడుకుంటున్నట్లుగా అప్పుడు ఎందుకు సంస్థానాధీశ్వరుడు ఈస్టిండియా కంపెనీ అనండి, బ్రిటిష్ ఏజెంట్ అనండి, గవర్నర్ అనండి, రెసిడెంట్ అనండి ఏ పేరుతో పిలిచినా సలహామీదనో, దయాధర్మాల మీదనో ఆధారపడ్డాడో లేదా వారితో ఘర్షణ పడి పదవీచ్యుతుడయ్యాడో అన్నదే చరిత్ర.

నైజాం రాజువంటి విధేయులతో పోల్చినప్పుడుగానీ టిప్పుసుల్తాన్, వీరపాండ్యకట్టబొమ్మన్, సిరాజుద్దౌలా వంటి రాజులు చేసిన స్వతంత్ర పోరాటాలు మన అసంపూర్ణ ప్రజాస్వామ్య విప్లవంలో భాగమని గ్రహించలేము.

బ్రిటిష్‌వాని తెలివితేటల్లోని వైచిత్రి కూడా ఉన్నాదంటే ఇంత చేసీ వాడు ఈ దేశాన్ని వదిలే నాటికి ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాల్సిన ఐదు వందల సంస్థానాలు మిగిలాయి. వాటి మినహాయింపే బ్రిటిష్ ఇండియా అంటే బ్రిటిష్‌వాని ప్రత్యక్ష పరిపాలన లేని ఐదు వందల సంస్థానాలకు విస్తరించిన విశాల భూభారతి 47 నాటికి కూడ ఉందన్నమాట. ఇది చెప్పుకోవడానికి ఎంత గొప్పగా ఉన్నా మనం 1857 నాటికే అందరికి అందరం స్వతంత్రాన్ని కోల్పోయామన్నది మాత్రం విషాదకరమైన వాస్తవం.

1857ను ప్రథమ భారత స్వతంత్ర సంగ్రామమని సావర్కర్ పిలిచాడు. కెవిఆర్ 1857కు ముందూ వెనుకా 1885లో నేషనల్ కాంగ్రెస్ పార్టీ ఏర్పడే దాకా ఎన్నో పోరాటాలను భారత స్వాతంత్ర్య పోరాటాలు అని పిలిచాడు.

ఇంగ్లీషు చరిత్రకారులు మ్యూటినీ అని సిపాయి తిరుగుబాటు లేదా పితూరీ అని పిలిచిన ఈ పోరాటాన్ని క్రమంగా భారత ప్రభుత్వం ప్రథమ స్వతంత్ర సంగ్రామంగా గుర్తించి ఆధునిక చరిత్రకారులతో స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రాయించింది. రాయిస్తున్నది. ఎక్కువమంది మార్క్సిస్టు దృక్పథంతో రాసిన చరిత్రకారులు కూడ ఇది స్వతంత్ర పోరాటంగానే గుర్తిస్తున్నారు. అయితే సావర్కర్ మొదలు ఎంవిఆర్ శాస్త్రి వరకు హిందుత్వ భావజాలానికి చెందినవాళ్లు చెప్పినంత నిర్ద్వంద్వంగా ఇతర భావజాలాలకు చెందిన వాళ్లు దీనిని స్వతంత్ర పోరాటమని? అనడం లేదేమోనని దాఖలాలు కనిపిస్తున్నాయి. ఇటీవల విడుదలయిన 'మంగల్‌పాండే' సినిమా వివాదంలోను, ఇప్పుడు 1857కు నూటయాభై ఏళ్లు నిండిన సందర్భంలోనూ, ఈ చర్చ ముందుకు వస్తున్నది. 'వందేమాతరం' వివాదం వలెనే 1857ను కూడ పూర్తిగా హిందుత్వ దృష్టితో చిత్రించే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

1857ను హిందుత్వ దృష్టితో కాకుండా సెక్యులర్ దృష్టితో లేదా ఫ్యూడల్ వ్యతిరేక దృష్టితో చూడాలనే ప్రయత్నంలో పాశ్చాత్య ఆధునిక దృష్టిని నిర్విమర్శగా స్వీకరిస్తే మాత్రం భారత స్వతంత్ర పోరాటాలకు అన్యాయం జరుగుతుంది.

భారతదేశంలో బ్రిటిష్ వ్యతిరేక వివిధ రకాల పోరాటాలు జరుగుతున్న కాలంలో, ముఖ్యంగా 1853 నుంచి 1859 వరకు మార్క్స్, ఎంగెల్స్‌లు న్యూయార్క్ ట్రిబ్యూన్‌కు రాసిన వ్యాసాలన్నీ వందేళ్ల తర్వాత (ఒక విధంగా 1857 శతవార్షికోత్సవాన్ని పురస్కరించుకొని) సోవియెట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ మార్క్సిజం-లెనినిజం అధ్యయన సంస్థ ప్రోగ్రెస్ పబ్లిషర్స్ తరఫున ఒక పుస్తకంగా ప్రచురించింది. దాని పేరే 'ది ఫస్ట్ ఇండియన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్ (ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం). 1857-59 మార్క్స్ స్వయంగా తాను న్యూయార్క్ ట్రిబ్యూన్‌కు పంపించిన రిపోర్టుకు 'ది రివోల్ట్ ఇన్ ఇండియా' (భారతదేశంలో తిరుగుబాటు) అని పేరు పెట్టాడు. ఆ తర్వాత పంపిన రిపోర్టులకు దాని ఆధారంగానే, ఆ అవగాహనతోనే ఆయన తర్వాత రచనలను ఆ సంస్థ ఆ శీర్షికతో అవసరమైన చోట 'ఇండియన్ రివోల్ట్' (భారతదేశ తిరుగుబాటు) అని పెట్టింది.

సమకాలీనంగా కలకత్తా, బొంబాయి, మద్రాస్‌ల నుంచి వచ్చిన ఇంగ్లీష్‌లో పత్రికలు, అప్పటి బ్రిటిష్ ప్రభుత్వ, బ్రిటిష్ ఇండియా గెజెట్లు, అధికార పత్రాలు ఆధారంగానే చాల ప్రామాణికమైన సమకాలీనమైన వివరాలు వాళ్లిద్దరూ రాసారు. అందులో మార్క్స్ రాసినవే చాల ఎక్కువ. లండన్ నుంచి రాసాడన్నది మినహాయిస్తే ఆ సంక్షోభిత సంగ్రామ కాలమంతా ఆయనను ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధ రిపోర్టర్ అని పేర్కొనవచ్చు. ఆయన ఆ తిరుగుబాటులోని వైరుధ్యాలన్నిటినీ ప్రస్తావించాడు. బలాలు, బలహీనతలు ప్రస్తావించించాడు. అంతర్జాతీయ రాజకీయ నేపథ్యంలో వాటిని అర్థం చేసుకోవడానికి మనకు పరికరాలు అందించాడు. ఆ వివరాలలా ఉంచి ఆయన పరిశీలన స్థూలంగా ఇది.

పంజాబు సింధుల ఆక్రమణతో ఆంగ్లో-ఇండియన్ సామ్రాజ్యం తన సహజ సరిహద్దులను చేరిందనడమే కాదు అది స్వతంత్ర భారత రాజ్యాల ఆఖరి ఉనికిని కూడా వడిపెట్టి ఛిద్రం చేసింది. అప్పటిదాకా యుద్ధోన్ముఖంగా కనిపించిన స్థానిక ఆదివాసులను లొంగదీసుకుంది. అన్ని అంతర్గత ఘర్షణలు సమసిపోయాయి. ఆఖర్న ఔధ్ సంస్థాన ఆక్రమణ స్వతంత్ర భారత మనదగిన ఏదైనా ప్రధానమైనవి ఉన్నాయంటే (సంస్థానాలే గానీ, రాజ్యాలే గానీ, ఉనికియే గానీ) వాటి అవశేషాలు ఇంక పైపైన తేలి మాత్రమే కనిపిస్తున్నాయి.

అందువల్ల ఈస్టిండియా కంపెనీ స్థితిలో పెద్ద మార్పు వచ్చింది. అది ఇంక భారత దేశంలోని ఒక భాగాన్ని మరొక భాగం సహాయంతో దెబ్బతీయాల్సిన అవసరం లేకపోయింది. ఇప్పుడది భారతదేశం శిరోభాగానికి చేరుకొని మొత్తం దేశాన్ని పాదాక్రాంతం చేసుకున్నది. ఇంక గెలుచుకోవడం కాదు, అది విజేత అయింది.

ఈ పరిశీలన నుంచే ఈ విజేత పై ఒక పరాజిత ప్రథమ భారత స్వతంత్ర సంగ్రామంగా 1857ను మార్క్స్ భావించాడు.

ఈ ప్రభావాన్ని సైనిక దృష్టితో మార్క్స్ ఇట్లా చెప్పాడు

పోలీసుల స్థాయికి మార్చిన దేశీయులైన రెండు లక్షల సైనికులు నలభై వేల మంది బ్రిటిష్ అధికారుల ఆజమాయిషీలో ఇరవై కోట్ల మంది దేశ ప్రజలను ఈ సంగ్రామంలో అణచివేసారు. అయినా సరే ఈ పరాజయాన్ని ఎలా చూడాలి.

ఇది వరకు కూడ భారత సైన్యంలో చాల తిరుగుబాట్లు జరిగాయి. కాని ఈ తిరుగుబాటుకు కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. మొట్టమొదటిసారిగా సిపాయి రెజిమెంట్‌లు యూరోపియన్ అధికారులను చంపేసాయి, హిందూ ముస్లింలు తమ మధ్య ఉన్న మత విభేదాలు విస్మరించి ఉమ్మడి యజమానులకు వ్యతిరేకంగా ఒకటయ్యారు; హిందువు (సిపాయి) లతో ప్రారంభమైన అలజడులు ఢిల్లీ సింహాసనం పై ముస్లింను (రెండవ బహాదుర్‌షా) నిలపడం దగ్గరకి విస్తరించాయి.

తిరుగుబాటు కొన్ని ప్రాంతాలకే పరిమితం కాలేదు. ఆంగ్లో-ఇండియన్ సైన్యంలో పొడసూపిన అసంతృప్తి ఇంగ్లీషు ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఆసియా జాతులన్నిట్లో రగులుతున్న సగటు అసంతృప్తికి వ్యక్తీకరణ అయింది. బెంగాల్ సైన్యంలో వచ్చిన తిరుగుబాటుకు నిస్సందేహంగా పర్షియా, చైనా యుద్ధాలతో సన్నిహిత సంబంధం ఉన్నది.

ఎట్లా ప్రారంభమైందనేది చరిత్రలో భాగమే కనుక, ప్రస్తుత సందర్భానికి చాల అవసరం కనుక బ్రిటిష్ వాడు మన భూమిని ఎట్లా కెలికాడో కొంచెం వివరిస్తాను.

వ్యాపారం కోసం వచ్చిన ఈస్టిండియా కంపెనీ కన్ను మన సంపదలమీదనే కాదు, మన ఉత్పత్తి విధానాల మీద పడింది. ప్రధానమయిన భూమి మీద పడింది.

1793లో కారన్‌వాలిస్ బెంగాల్ ప్రావిన్స్‌గా పిలవబడిన బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో శాశ్వత భూమి శిస్తు విధానాన్ని (పర్మినెంట్ సెటిల్మెంట్) ప్రవేశపెట్టాడు. చాలమంది విస్మరించే విషయం ఏమంటే బ్రిటిష్ వాడు రాక పూర్వం రాజ్యం మీద అధికారం వలెనే భూమి మీద అధికారం కూడా రాజుదే. హిందూమత విశ్వాసం ప్రకారమైతే రాజు విష్ణుఅంశ సంభూతుడు కనుక దేవునిదే. ప్రజలంతా దేవుని బిడ్డలు. దేవుని అంశతో దేవుని ప్రతినిధిగా రాజు పాలిస్తాడు. గ్రీకు, రోమన్ చరిత్రల్లో కూడ ఉదారుడైన రాజు (బెనెవలెంట్ కింగ్) భావన లేకపోలేదు. మధ్య యుగాల ఫ్యూడలిజాన్ని మరిపించిన నైజాం పాలనలో కూడ జమీందార్లు, జాగీర్దార్లు, దేశ్‌ముఖ్, దేశపాండేలు - పన్నులు వసూలు చేసేవాళ్లు, చేసుకునే వాళ్లే. భూమి రాజ్యానిది. భూమి ప్రైవేటు ఆస్తిగా భావించబడడం బ్రిటిష్ వాళ్లతో ముఖ్యంగా, ఈ శాశ్వత భూమి శిస్తు విధానంతో ప్రారంభమైంది.

ఈ విధానం బ్రిటిష్ రాజ్యాధికారంతో ముడిపడి పోయిన (అదిలేని చోట కూడ ఆ ప్రభావం వల్ల సంస్థానాల్లో కూడ) జమీందార్ల వర్గాన్ని సృష్టించి రైతులను కౌలుదార్లుగా మార్చివేసింది.

మద్రాసు ప్రావిన్సులోని ఉత్తరాంధ్రలో ఈ పద్ధతి అమలయింది. దత్త మండలాలు (రాయలసీమ) నెల్లూరు, కర్ణాటకలో థామస్ మన్రో, కాంప్‌బెల్ మొదలైనవారు రైతువారీ భూమి శిస్తు విధానం ప్రవేశపెట్టారు. పంజాబ్, సంయుక్త రాష్ట్రాల (యు.పి.ప్రావిన్స్)లో హెన్రీ లారెన్స్ మొదలైన వారు మరో విధమైన భూమి శిస్తు విధానాన్ని ప్రవేశపెట్టారు.

దీనినంతా రాజకీయార్థిక దృక్పథంతో కెవిఆర్ ఇట్లు విశ్లేషించారు.

"పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం (ఇండస్ట్రియల్ కాపిటలిజం) ఇంకా మొనజూపని వ్యాపార పెట్టుబడిదారీ విధానం (మెర్కంటైల్ కాపిటలిజం) కాలంలో కంపెనీ పరిపాలన భారతీయ భూ సంబంధాలలో తెచ్చిన మార్పు మొత్తం మీద కొత్త జమీందార్లకూ, భూస్వాములకూ లాభించినంతగా పాతవారికి గానీ, రైతాంగానికి గానీ లాభించలేదనే చెప్పాలి." (భారత స్వాతంత్ర్య పోరాటాలు - పే.8)

19వ శతాబ్ది ప్రథమార్థంలో వచ్చిన వాహబీ ఉద్యమం మొదలుకొని 1857 వరకు మన దేశంలో ఎన్నో రైతాంగ పోరాటాలు వచ్చాయి. లెక్కకు మిక్కిలిగా వచ్చిన ఈ రైతాంగ పోరాటాల్లో, ముఖ్యంగా ముస్లింలు, ఫకీరులు, ఆదివాసులు చేసిన తిరుగుబాట్లలో స్థానికంగా భూస్వామ్య వ్యతిరేకత ఉన్నది.

బీర్‌భూమ్‌లో చునార్లనే అడవి తెగల తిరుగుబాటు (1799), సింగ్‌భూంలో హో తెగ ప్రజల తిరుగుబాటు, (సింగూరులోగానీ, నందిగ్రామ్‌లో గానీ టాటా మోటార్లకు, ప్లాస్టిక్ కంపెనీలకు వ్యతిరేకంగా వస్తున్న పోరాటాన్ని తృణమూల్ కాంగ్రెస్ పోరాటంగానే తృణీకరించలేం కదా) ఛోటా నాగపూర్‌కు చెందిన కోల్ తెగ ప్రజలు, ముండా తెగ ప్రజల, రాజ్‌మహల్ కొండల ప్రాంతానికి చెందిన సంతాల్ తెగ ప్రజలు, ఒరిస్సాకు చెందిన ఖోండ్‌లు, అస్సాంకు చెందిన ఖాసీలు, ఎన్నో తిరుగుబాట్లు చేసారు. ఈ ఆదివాసుల పోరాటాలన్నీ ఆర్థికమైనవి. ముఖ్యంగా భూమి సంబంధమైనవి. సాయుధమైనవి. ఇక్కడ గమనించవలసిన అంశం ఏమిటంటే తిరుగుబాట్లను అణచడానికి జమీందార్లకు, ముఠాదార్లకు, వడ్డీవ్యాపారులకు కంపెనీ దొరతనం మద్దతు లభించింది. కరువు పరిస్థితులు, కఠినమైన ఎన్నో వసూలు పద్ధతులు, తమ భూములను నగర వాసులకు కట్టబెట్టడాలు (ఇప్పటి చరిత్ర చదువుతున్నట్లు లేదా) వడ్డీ వ్యాపారుల దోపిడీ, జమీందారుల జులుం వగైరా ఈ తిరుగుబాట్లకు కారణాలని కెవిఆర్ చారిత్రకాధారాలతో రాసాడు.

ఇదే విధంగా ఫకీర్లు, హిందు సన్యాసులు 1770 ఘోరక్షామంలో సాయుధ బృందాలుగా రైతులతో చేతులు కలిపి కంపెనీలకు చెందిన ఫ్యాక్టరీలను, గిడ్డంగులనూ, భూస్వాముల, జమీందార్ల, గాదెలను, పంట చెలనూ కొల్లగొట్టి బ్రిటిష్ ప్రభుత్వానికి గంగవెర్రులెత్తించారని రాస్తూ "బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేకత ముస్లింలలో ఒక సంప్రదాయంగా నిలిచి 1857 పోరాటంలో ప్రముఖ పాత్ర వహించిందంటే, వలీయుల్లాహీ (వహాబీ) ఉద్యమ ఫలితమే' అని కూడ కెవిఆర్ అభిప్రాయపడ్డాడు.

మధ్యయుగాలకు చెందిన వర్గాల చివరి పోరాటం, అతి తీవ్రమైన పోరాటం 1857 నాటిది అని ఆయన అభిప్రాయం.

1857లో సిపాయీలకు బ్రిటిష్ ప్రభుత్వం పెట్టిన షరతులు ఒకరకమైన వ్యూహాత్మకమైన ప్రయోగం (కాలిక్యులేటెడ్ రిస్క్) సంస్థానాలను పూర్తిగా లొంగదీసుకోవడమో, ఘర్షణపడడమో. ఎందుకంటే ఏకకాలంలో ఇటు రైతాంగంతో, అటు వాళ్ల యజమానులతో ఒత్తిడి కన్న తాము నేరుగా ప్రజలతో పరిపాలనా సంబంధాలకు వెళ్లాలని నిర్ణయించుకున్నారు. అట్లే తమతమ విశ్వాసాలు కలిగి ఉంటూ కూడ హిందూ ముస్లింలు రైతుల సంతానంగా సిపాయిలుగా కలిసి ఉండడం గురించి కూడ ఒక మత విశ్వాసపరమైన ప్రయోగం చేసి చూసారు. దీనికంతా వారసులు లేకుండా మిగిలిన రాజ్యాలను కలుపుకునే డల్హౌసీ 'రాజ్యసంక్రమణ' సిద్ధాంతం ఉపకరించింది.

అదే సిద్ధాంతం ఇటు సిపాయిలకు ఝాన్సీ మొదలు ఢిల్లీ వరకు, లక్ష్మీబాయి మొదలు బహదూరు షా వరకు నయానా భయానా ఒప్పించి తమ పోరాటానికి ముందు నిలబెట్టుకోవటానికి ఉపకరించింది.

1857 మే 3న మీరట్‌లో 3వ ఆశ్విక దళానికి చెందిన సిపాయిలు తిరుగుబాటు చేసారు. తమ బ్రిటిష్ అధికారులను వధించి ఆయుధాల గిడ్డంగులనుంచి ఆయుధాలను మందుగుండు సామాగ్రిని దోచుకొని, చెరసాల పాలైన తమ వారిని విడిపించుకొని 'ఛలో ఢిల్లీ' అంటూ ఢిల్లీ దారి పట్టి, ఢిల్లీని స్వాధీన పరచుకొని రెండవ బహదూర్ షాను 'షహన్‌షా–హింద్' అని ప్రకటించారు.

దీనినే మార్క్స్ హిందువులు ముస్లింరాజును చక్రవర్తిగా ఆమోదించి ప్రకటించిన ఒక మత ఐక్యత అంశంగా పేర్కొన్నాడు. ఝాన్సీ లక్ష్మీబాయి "ఆజాద్ షాహీ" అని స్వాతంత్ర్యేచ్ఛను ప్రకటించడం కనీసం సంస్థానాలకు తాము బ్రిటిష్ తైనాతీలం కాదనే భావన కావడంగానైనా మనం భావించాలి.

"బహదూర్‌షా, లక్ష్మీబాయి, నానాసాహెబు వగయిరాలు నిజానికి ఈ పోరాట నాయకులు కారు. వీరిలో ప్రతి ఒక్కరూ సిపాయిల బలవంతం మీద పోరాటం లోకి వచ్చిన వారే. ఇది సిపాయిల పోరాటం. సిపాయిలు మిలటరీ యూనిఫాం ధరించిన రైతుబిడ్డలే గాని అన్యులు కాదు. సిపాయిల పితూరిగా ప్రారంభమైనా ఇది సాయుధ రైతాంగ పోరాటంగా పరిణమించిందంటే ఆశ్చర్యం లేదు" అని కెవిఆర్ రాయడానికి బహుశా మార్క్స్ రాజకీయార్థిక పరిశీలన మరింత దోహదం చేసి ఉంటుంది.

ఈ సార్వత్రిక సమ్మె ఆకలిగొన్న, చెదరిఉన్న రైతులు ప్రారంభించలేదు. కాని వాళ్ల బిడ్డలు, మంచి జీతాలు పొందుతూ మంచి స్థితిలో ఉన్నా సిపాయిలు మొదలుపెట్టారు. ఆంగ్లో ఇండియన్ సైన్యానికి చెందిన ఎక్కువగా ఉన్నత కులాలకు చెందిన అధికారులు, సిపాయిలు మొదలుపెట్టారు. ఇండియాలోను బలమంతా సిపాయిల సైన్యమేనని అప్పటిదాకా ఇంగ్లీషు వాళ్ల గాఢ విశ్వాసం. అదే సిపాయిలు వాళ్ల ప్రమాదానికి మూల కారణమయ్యారు, అని రాసిన మార్క్స్ 1857 నాటికి బ్రిటిష్ వాళ్లు ఆశపడిన సంఘటిత విద్యావంతులైన ఉద్యోగులు సిపాయిలే కనుక, వాళ్లు రెండు లక్షలు ఉన్నారు కనుక, వాళ్ల చేతుల్లో తుపాకులు, తలపై క్రమశిక్షణ, శరీరంపై యూనిఫాం ఉంటుందిగనుక రైతు బిడ్డలే రైతాంగాన్ని అణచడానికి అందివచ్చే పనిముట్లు అవుతుందనుకున్నారు. ఆ పని నిజానికి యునివర్సిటీలు వచ్చి, విద్యావంతులు వచ్చి, బ్యూరాక్రసీ ఏర్పడినాక మెకాలే ఆశించిన బ్రిటిష్ మానసపుత్రుల వల్ల ఎక్కువ సులభంగా సాధ్యమైంది.

దుస్సహమైన వలస పాలన అణచివేతకు వ్యతిరేకంగా ఈ పోరాటం చుట్టూ సంఘటితమైన భారత ప్రజలే ఈ సాయుధ తిరుగుబాటుకు ప్రధాన చోదక శక్తులని మార్క్స్ భావించాడు.

అయితే 1857 సిపాయి తిరుగుబాటు నుంచి బ్రిటిష్‌వాడు ఫ్యూడలిజంతో, సంస్థానాలతో ఘర్షణ పడికాదు, స్నేహం చేసి, ప్రలోభ పెట్టి కొనసాగవచ్చునని నేర్చుకున్నాడు. సంస్థానాధీశ్వరులు, ఫ్యూడల్ ప్రభువులు కూడ తమ స్వతంత్రం ప్రజలతో ముడపడినప్పుడే ఘర్షణ కానీ (టిప్పు సుల్తాన్, సిహాజుద్దౌలా నుంచి బహదూర్ షా వరకు ఆ ఘర్షణ ఫలితాలు చవిచూసి అమరులయ్యారు) ప్రజలను వదిలేసి బ్రిటిష్ వాళ్లతో చేతులు కలిపితే, బ్రిటిష్ వాడు వెళ్లిపోయిన తర్వాత కూడ హాయిగా 'స్వతంత్రాన్నీ' కొనసాగించవచ్చునని తెలుసుకున్నారు. ఇప్పటి యు.పి, ఎం.పి, కాశ్మీరు, పంజాబ్ మొదలైన ఎన్నో రాష్ట్రాల రాజవంశాలు బ్రిటిష్ కాలంలోనే కాదు, కాంగ్రెస్, బిజెపిలలో కూడ పొందిన స్థానాన్ని బట్టి ఇది మన ఊహించవచ్చు. బతికినంతకాలం ఉస్మాన్ అలీఖాన్, ఇప్పటికీ కాశ్మీర్ రాజవంశం ఆ ప్రతిష్ఠ అనుభవిస్తున్నారు. వ్యక్తులుగా అనే కాదు సామ్రాజ్యవాదం భారతదేశం వంటి మూడో ప్రపంచ వ్యవసాయ దేశాలను తనకు చవుకగా వనర్లు, శ్రమ సమకూర్చే విశాల భూమికలుగా మిగుల్చుకోవాలంటే ఇక్కడి అర్ధ భూస్వామ్యాన్ని ప్రోత్సహించాలని, దానితో సహజీవనం చేయాలని నేర్చుకున్నది. అది ఈ నాటికీ వేరే రూపాల్లో అమలవుతున్నది. రెండెకరాల ఆస్తికుడా లేని జులాయి రాజకీయ నాయకుడు మాత్రమే కాదు, రాయలసీమ పాలెగాడు కూడ సిఇవోగా మారి ప్రపంచబ్యాంకు సంస్కరణలను అమలు చేసే అనుకూలత సామ్రాజ్యవాదానికి ఇందువల్లనే సాధ్యమైంది. పైగా పేద రైతుల నుంచి, గిట్టని భూకామందులనుంచి భూములు వెనక్కు తీసుకొని సామ్రాజ్యపరం చేయడం పాళెగానికి తెలిసినంత బాగా మరొకరికి ఎట్లా తెలుస్తుంది. అందుకే ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక ఆర్థిక మండలాలు దేశంలో మరెక్కడి కన్నా ఎక్కువ వేగంగా వస్తున్నాయి.

1857 తర్వాత, ముఖ్యంగా 1885లో కాంగ్రెస్ ఏర్పడిన తర్వాత సామ్రాజ్యవాదం పట్ల, వలసవాదం పట్ల ఫ్యూడల్ విలువల్లో ఉండే వ్యతిరేకత సడలిపోయింది. ముఖ్యంగా ఇది హిందూ బ్రాహ్మణ వర్గంలో జరిగింది. 1857లో బ్రిటిష్ అధికారిని చంపి ఉరికంబమెక్కిన మంగల్ పాండే వంటి బ్రాహ్మణ విద్యావంతులు మళ్లీ కాశ్మీరు జాతి విముక్తి పోరాటంలోనో, నక్సల్బరీ పంథాలోనో కనిపించ వలసిందే తప్ప, జాతీయోద్యమంలో కనిపించరు. అది యునివర్సిటీ చదువుల వల్ల బ్రిటిష్ వాడు పొందిన పెద్ద ప్రయోజనం. అభివృద్ధి, ప్రగతి, సంస్కరణ అనే భావజాలాలు ఇంగ్లీషు విద్యతో, పాశ్చాత్యీకరణతో, ఆధునికతతో తప్ప చూడలేని ఒక మానసికత ఈ ఇంగ్లీషు చదువుల వల్ల సాధ్యమైంది. సంస్కృతం నుంచి బ్రాహ్మణులు మంచి నీటికి చేపలాగ ఇంగ్లీషుకు ఎగబాకి బ్యూరాక్రసీలో కీలక పాత్ర వహించారు.

వాస్తవానికి 1857 తిరుగుబాటుకు ముందు, 1885 దాకా సాగిన రైతాంగ తిరుగుబాట్ల కాలంలో, ఆదివాసుల, ముస్లింల పోరాటాల్లో పాల్గొన్న వాళ్లంతా విద్యావంతులను విశ్వసించలేదు.

ఇంగ్లీషు వాడు ఇచ్చిన శిక్షణ శిస్తు వసూలు చేయడానికి తప్ప రైతాంగానికి దోహదంచేసేది కాదని తెలుసుకున్న వర్గాల నుంచి వచ్చినవే. తర్వాత కాలంలో వచ్చిన విప్లవ పోరాటాలన్నీ గదర్ పార్టీ మొదలు భగత్‌సింగ్ వరకు వాళ్లకు రైతాంగంలో ఉన్న మూలాలు సామ్రాజ్యవాద వలసలను అంతం చేసి కార్మిక–కర్షక రాజ్యం ఏర్పాటు చేయాలన్న వాళ్ల స్వప్నాలు గమనిస్తే మనమీ విషయం గ్రహించగలం. క్రమంగా సమూలమార్పు కాక పాశ్చాత్య సంస్కరణలను ప్రవేశపెట్టే విద్యావంతుల వేదికగా కాంగ్రెస్ ఏర్పడి, అదే జాతీయోద్యమానికి నాయకత్వం వహించడంతో మన స్వతంత్రానికి నమూనా మన రైతాంగం మూలాల

నుంచి వచ్చింది కాకుండా పోయింది. ఆ దూరాన్ని గ్రహించిన గాంధీ ప్రజల నాడిని పట్టుకొని ప్రజాపోరాట సారాంశన్నంతా రూపంలోకి మార్చి అది ఎప్పుడూ బూర్జువా వర్గం పట్టు తప్పకుండా చూసాడు.

1857 వరకు ప్రైవేటు మత విశ్వాసాలుగా ఉన్న హిందూ ముస్లిం భావాలు సిపాయి తిరుగుబాటులో ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా సంఘటితమైన గ్రహింపు కూడా బ్రిటిష్ వాడికి 1885 తర్వాత రాజకీయాల్లోకి మతాన్ని చొప్పించే పాఠాన్ని నేర్పింది. తన దేశంలో మత ప్రమేయం లేని రాజకీయాలు, విద్యను అమలు చేసిన ఇంగ్లీషువాడు తన వలసల్లో కత్తితోపాటు, మతాన్ని ప్రజల్ని చీల్చే సాధనంగా వాడుకున్నాడు.

1857 పోరాటం దేశంలో జాతుల భావన మొలకెత్తి పెంపొందడానికి దోహదం చేసింది. బెంగాల్ రెజిమెంట్, సిక్ రెజిమెంట్, గూర్ఖా రెజిమెంటుగా సిపాయిలను సెంట్రల్ ప్రావిన్సెస్, యునైటెడ్ ప్రావిన్సెస్, పెప్సూ, మద్రాసు ప్రావిన్సు అని వివిధ భాషల రాష్ట్రాలను కలిపి ఏర్పాటు చేసిన పాలనా వ్యవస్థ నుంచి బ్రిటిష్ వాడు రాక పూర్వం ఉండిన భాషాజాతీయుల రాష్ట్రాలుగా దేశం ఒక ఫెడరల్ వ్యవస్థ రూపం పొందాలని విద్యావంతులు ఆకాంక్షించారు. బహుశా పెట్టుబడిదారీ అభివృద్ధి వల్ల యూరపులో ఏర్పడిన జాతుల దేశాలు వారి ముందు ఒక మంచి నమూనాగా కనిపించి ఉండవచ్చు.

ముఖ్యంగా 1857 తర్వాత అన్ని రూపాల్లో సాగిన బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలను స్థూలంగా జాతీయోద్యమం అని పిలుస్తున్నాం. ఇందులో భారతదేశం ఒక జాతిగా రూపొందిన అంశం ఉన్నదని భావించే వాదమూ ఉండవచ్చు. కాని అంతకన్నా వాస్తవమయినది జాతులు సమష్టిగా నిర్వహించిన ఉద్యమమే. ఈ ఉద్యమంలోని అహింసాయుత స్రవంతికి 1857 నాటి స్వతంత్రపోరాటానికి ఉన్నంతగా, ఈస్టిండియా కంపెనీ వచ్చినప్పటి నుంచీ ఇప్పటి వరకూ సాగుతున్న రైతాంగ పోరాటాలకు ఉన్నతంగా సామ్రాజ్యవాద వ్యతిరేకత లేదు. తిలక్ వంటివాళ్లు 'స్వరాజ్యమే నా జన్మ హక్కు' అని ప్రకటించినా హోం రూల్ మొదలుకొని, క్విట్ ఇండియా వరకు బ్రిటిష్ వాడు వెళ్లిపోవాలన్నదే నాయకత్వ ఆకాంక్ష తప్ప, బ్రిటిష్ రాజకీయార్థిక విధానం అంతమై ఒక స్వతంత్ర, స్వావలంబన రాజకీయార్థిక విధానం రూపొందాలని కాదు. గాంధీజీ గ్రామ రాజ్యకాంక్ష - రాజ్యాలకు, ప్రభుత్వాలకు బయట సర్వోదయ వాళ్లు, స్వాతంత్ర్యయోధులో జపించే మంత్రమయింది తప్ప 1947 నుంచే ప్రభుత్వాచరణ కాలేదు. అందుకే 1947 నుంచి 1991 లోకి మన ప్రభుత్వాల ప్రయాణం ప్రయాస లేకుండానే సాధ్యమైంది. నూట ఏభైఏళ్లు గడిచే వరకు ఈనాడు మన ముందున్న స్థితి జూకంటి జగన్నాథం కవిత్వంలో చెప్పినట్లు ఈస్టిండియా కంపెనీ డాట్‌కామ్‌ను దళారీలతో హెచ్చవేస్తే ఏర్పడిన బహుళజాతి కంపెనీల సెజ్జుల వలె ఉన్నది.

నక్సల్బరీ పంథాలో విప్లవోద్యమం ప్రారంభమైనప్పటి నుంచి నూతన ప్రజాస్వామిక విప్లవం గురించి మాట్లాడేవాళ్లు, పాఠాలు చెప్పేవాళ్లు ఒక మాటతో ప్రారంభించడమో, ముగించడమో చేస్తుంటారు. అదేమంటే 1857లో ప్రారంభమైన మన ప్రజాస్వామిక విప్లవం ఇంకా పరిపూర్తి కాలేదు-అని.

నేను స్వయంగా అటువంటి సారమే కొండపల్లి సీతారామయ్య గారి నుంచి, కెవిఆర్ నుంచి విన్నాను. చాల చోట్ల చెప్పాను. ఒకరు సుదీర్ఘమైన (అరవై సంవత్సరాలు) రైతాంగ పోరాట అనుభవాల నుంచి, ఆ పోరాటానికి అవసరమైన అధ్యయనం నుంచి చెప్పారు. మరొకరు చరిత్ర విద్యార్థిగా మాత్రమే కాకుండా విరసం, అఖిల భారత విప్లవ సాంస్కృతిక సంస్థ సంస్థాపక నాయకునిగా ఉన్న సుదీర్ఘ ప్రజా జీవిత, పోరాట అనుబంధంతో చెప్పారు. కెవిఆర్ విశ్లేషణ ఒక మేరకు పైన సందర్భాన్ని బట్టి ఉదహరించాను.

కొండపల్లి సీతారామయ్య గారి 'వ్యవసాయ విప్లవం' పుస్తకం లోని ఒక ఉటంకింపుతో ఈ అవగాహనను ముగించడం సమంజసంగా ఉంటుంది.

"ఇక్కడ (మన దేశంలో).. సామ్రాజ్యవాదుల దోపిడీ తీవ్రతరమయ్యే కొలదీ అనేక రైతాంగ తిరుగుబాట్లు జరిగాయి. నిర్దిష్టమైన లక్ష్యం లేని కారణంగానూ, సమర్థవంతమైన అంటే సామాజిక పరిణామ క్రమాన్ని అర్థం చేసుకుని అందుకు అనుగుణంగా తుదివరకు నడపగలిగిన నాయకత్వం లోపించిన కారణంగానూ, అవన్నీ కేవలం కొన్ని ప్రాంతాలకు మాత్రం పరిమితమై దెబ్బతిన్నాయి. వాటికి దేశవ్యాప్తమైన స్వరూపమూ, స్వభావమూ ఏర్పడలేదు. అయినా వాస్తవానికి అవన్నీ ప్రజాస్వామిక విప్లవం యొక్క ఆవశ్యకతను, అనివార్యతను వ్యక్తం చేసే సంఘటనలే. దేశవ్యాప్తమైన సంఘటితమైన మొట్టమొదటి సాయుధ విప్లవం 1857లో జరిగింది. ఫ్యూడల్ రాజులైన సంస్థానాధిపతుల నుండి, బ్రిటిష్ వారి ఆధిపత్యం కిందనున్న భారతీయ సైన్యం, అశేష రైతాంగం వరకు ఆ విప్లవంలో పాల్గొన్నారు. ప్రథమ భారత స్వతంత్ర యుద్ధంగా పిలవబడే ఆ పోరాటమే మన దేశంలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగానూ, సంఘటితంగాను కొనసాగుతున్న ప్రజాస్వామిక విప్లవానికి ఆరంభమని చెప్పవచ్చు. అనేక ఇతర కారణాలతో పాటు ప్రధానంగా ఫ్యూడల్ సంస్థానాధిపతుల నాయకత్వం మూలంగా ఆ పోరాటం విఫలమైంది"

(కొండపల్లి సీతారామయ్య ఏరిన రచనలో - రెండవ సంపటి - పే. 32) ◆

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల పాత్ర

- సయ్యద్ నశీర్ అహమ్మద్

భారతదేశ చరిత్రలో 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం మహోజ్వల ఘట్టం. భారతీయుల పోరాట పటిమకు, శౌర్యప్రతాపాలకు, నిరుపమాన దేశభక్తికి ఈ సంగ్రామం ఒక నిలువుటద్దం. ఈ పోరాటానికి భారతదేశపు అతిపెద్ద అల్పసంఖ్యాకవర్గమైన ముస్లిం సమాజం అనితర సాధ్యమైన భాగస్వామ్యాన్ని అందించింది. ఈ పోరులో అగ్రభాగాన ని??చి ఆదర్శవంతమైన పాత్రను నిర్వహించింది. ముస్లిమేతర సాంఘిక జన సమూహాలతో మమేకమై పరాయిపాలకులకు వ్యతిరేకంగా ఉవ్వెత్తున సాగిన సమరంలో నాయకత్వం పాత్రను చేపట్టి తన వి?్యక్త ధర్మాన్ని అపూర్వమైన రీతిలో నిర్వర్తించింది.

ఈ పోరాటంలో ముస్లింలు అపూర్వ త్యాగాలతో, అసమాన బలిదానాలతో పునీతులయ్యారు. ఆడ, మగ తేడా లేకుండా సమరశీల పాత్ర నిర్వహిస్తూ, ఎక్కడా కూడా రాజీపడకుండా తమ ప్రాణాలను బలిపెట్టి స్వదేశం నుండి వలసపాలకును తరిమి కొట్టాలన్న దృఢ సంకల్పంతో అనిర్వచనీయమైన త్యాగాలతో చరిత్ర సృష్టించారు. అయితే మహత్తర త్యాగాల బాటలో ముందుండి విదేశీ శత్రువుతో అవిశ్రాంత సమరం సాగించిన ముస్లింల త్యాగమయ చరిత్ర పలు కారణాల మూలంగా మరుగున పడిపోయింది.

ఈ పోరాటంలో వ్యక్తమైన హిందూ-ముస్లింల ఐక్యతను గమనించిన బ్రిటిష్ పాలకులు కలవరపడ్డారు. ఇండియాలో తమ పాలనను సుస్థిరం చేసుకునేందుకు విభజించు-పాలించు కుటిల నీతిని అమలుపర్చి భారతీయులను మతం పేరుతో హిందువులు-ముస్లింలుగా విభజించటంలో కృతకృత్యులయ్యారు. ఈ సందర్భంగా ముస్లింల మీద అసత్యప్రచారాలను అంబరం దాకా సాగించారు. ఆ ప్రచారాలకు అక్షరరూపం కల్పించి స్థిరపర్చారు. ఆ తరువాత భారత విభజనకు దారితీసిన పరిస్థితులు, ఆ సందర్భంగా జరిగిన దారుణాలు, పొరుగు దేశంగా ఏర్పడిన పాకిస్తాన్‌తో జరిగిన వివాదాలు, కయ్యాలు అలనాటి ఐక్యతకు, విభిన్న జనసముదాయాలలో పరస్పరం ఉన్న సద్భావనకు చిచ్చుపెట్టాయి. భారత విభజనానంతర పరిణామాల వలన అపరాధ భావనకు గురిచేయబడిన ముస్లిం సమాజం సుషుప్తావస్థలోకి నిష్క్రమించింది. భారతీయ ముస్లిం సమాజం మీద మోపబడిన 'విభజన' రుజువుకాని నేరం సృష్టించిన ప్రత్యేక మానసిక పరిస్థితి చరిత్రకారులను, రచయితలను కూడా తాకింది. ఆ కారణంగా అలనాటి ముస్లిం యోధుల త్యాగచరితలను అక్షర రూపంలో నిక్షిప్తం చేయటం సవ్యంగా జరగలేదు.

**ప్రజలకు చేరువకాని సమాచారం**

ఈ కారణంగా మన చరిత్ర గ్రంథాలలో త్యాగధనులైన ముస్లింలు చాలా వరకు కన్పించరు. ఒకరిద్దరు కన్పించినా అనన్య సామాన్యమైన వారి సాహసం, త్యాగాలు, అతి సాధారణ స్థాయి వివరణలతో వర్ణనలతో సరిపెట్టబడ్డాయి. ప్రాచుర్యంలో ఉన్న చరిత్ర గ్రంథాలలో ముస్లింల వీరోచిత గాథలు సరైన స్థానం పొందలేకపోయాయి. ఆయా కథనాలు సామాన్య చరిత్ర గ్రంథాలలోగాని, పాఠ్య పుస్తకాలలోగాని చోటు చేసుకోలేదు. ఫలితంగా భవిష్యత్తు తరాలకు అలనాటి అమూల్య సమాచారం అందకుండా పోయింది.

సామాన్య చరిత్ర గ్రంథాల ద్వారా తేలిగ్గా సమాచారం లభించే అవకాశం లేనందున, కళా రూపాలకు, సాహిత్య ప్రక్రియలకు, ప్రచార మాధ్యమాలకు ముస్లింల శ్లాఘనీయ త్యాగ చరితలు కథా వస్తువు కాలేకపోయాయి. ఆ కారణంగా ముస్లింల త్యాగాలు, ఆనాటి వీరోచిత పోరాట ఘట్టాలు జనబాహుళ్యంలోకి వెళ్ళకపోవటంతో ఆ తరువాతి తరాలకు ఆ విషయాలు తగినంతగా పరిచయం కాలేదు. ఈ పరిణామాలే భారతదేశంలోని హిందూ- ముస్లిం జనసమూహాల మధ్య సద్భావనకు, సదవగాహనకు ఆటంకంగా మారి క్రమక్రమంగా ఆయా జనసముదాయాల మధ్యన మానసిక ఎడం ఏర్పడటానికి ప్రధాన కారణమవుతున్నాయి. ఈ అగాధాన్ని మరింత పెంచి ఒక సాంఘిక జనసమూహానికి తామే ఏకైక ప్రతినిధులుగా ప్రకటించుకుని రాజ్యమేలాలని ఆశిస్తున్న శక్తులు-వ్యక్తులు ఈ అవాంఛనీయ వాతావరణాన్ని వినియోగించుకుంటున్నాయి.

**అపూర్వ త్యాగాల చరిత్ర అందరికీ తెలియాలి**

ఈ పరిస్థితిని చక్కదిద్దాల్సిన అవసరం ఎంతో ఉంది. భారత దేశంలోని అన్ని సాంఘిక జనసముదాయాల త్యాగాలు ప్రతిఒక్కరికి తెలియాల్సి ఉంది. పలు సాంఘిక జనసముదాయాల గడ్డ అయినటువంటి మన భరత భూమిలో ఆయా జనసముదాయాల మధ్యన సుహృద్భావ వాతావరణం ఏర్పడడానికి చరిత్రలోని ఒకరి పాత్ర గురించి మరొకరికి తెలియాల్సిన అవసరం ఎంతైనా ఉంది. మాతృభూమి సేవలో పునీతమైన ప్రజలందరి చరిత్ర అందరికి తెలిసినప్పుడు మాత్రమే ఆయా జనసముదాయల మధ్యన పరస్పర గౌరవం ఏర్పడుతుంది. ఆ గౌరవం సదవగాహన, సద్భావన, సహిష్ణుతకు పునాది అవుతుంది. ఈ వాతావరణంలో మాత్రమే లౌకిక వ్యవస్థ పరిఢవిల్లుతుంది. మత విద్వేషాలు మట్టిలో కలసి మతసామరస్యం మరింతగా పటిష్టమౌతుంది.

**మీరట్‌లో రగిలిన తిరుబాటు జ్వాల**

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా టిపూ సుల్తాన్ సాగించిన మహోజ్వల పోరాట చరిత్ర తరువాత 1857లో మొగల్ పాదుషా బహద్దూర్ షా జఫర్ నాయకత్వంలో సాగిన సమరం భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పుటలలో 'ప్రథమ స్వాతంత్ర్య సమరం' గా ప్రసిద్ధి చెందింది. ఆంగ్లేయుల వివక్షతతో కూడిన చర్యలు, స్వదేశీయుల మీద మితిమీరిన పెత్తనం, అన్ని రంగాలలో అప్రతిహతంగా సాగుతున్న దోపిడీని సహించలేని సగటు భారతీయుడు, ప్రధానంగా సైనికులు, స్వదేశీ పాలకులు ప్రథమ స్వాతంత్ర్య పోరాటానికి బీజాలు వేశారు.

ఈ సంగ్రామంలో ముస్లిం జనసముదాయాలు ప్రధాన పాత్ర వహించాయి. 1857 మే 17వ తేదిన మీరట్ నుండి ఢిల్లీకి బయలు దేరిన సందర్భంగా, ఆ తరువాత ఢిల్లీ చేరాక ఎర్రకోటలో 'దీన్..దీన్' అంటూ రణనినాదం మారుమోగిందని ఆంగ్ల చరిత్రకారులు వెల్లడిస్తున్న

చరిత్రను బట్టి ముస్లిం సిపాయిలు పోరుబాటలో అగ్రభాగాన నిలిచారన్నది స్పష్టమౌతుంది. ఈ పోరాటంలో ముస్లింలు ఇతర జన సముదాయాలతో ఎంతగా మమేకమయ్యారంటే, ఆంగ్లేయాధికారి హెన్రీ మీడ్ ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, "ప్రస్తుత దశలో ఈ తిరుగుబాటును సిపాయిల తిరుగుబాటు అనడానికి వీలులేదు. అది సిపాయిలతో మొదలయింది గాని త్వరలోనే దాని అసలు స్వభావం బయటపడింది. అది ఇస్లామిక్ తిరుగుబాటు" అనాల్సి వచ్చింది.

ఆనాడు బెంగాలు సివిల్ సర్వీసులో అధికారిగా పని చేసిన హెన్రీ హారింగ్టన్ థామస్ కూడా 1858 లో రాసిన 'రిబెలియన్ ఇన్ ఇండియా అండ్ అవర్ ఫ్యూచర్ పాలసీ' అనే కరపత్రంలో,'1857 తిరుగుబాటు పథక రచన చేసిన వారుగాని, ప్రధాన చోదక శక్తులు గాని హిందువులు కాదని ఇదివరకే రాశాను. అది మహమ్మదీయుల కుట్ర ఫలితమని చూపడానికి ప్రయత్నిస్తాను. తమంతట తాముగా హిందువులు అటువంటి పనికి తలపెట్టి ఉండేవాళ్లు కాదు' అని వ్యాఖ్యానించాడు.

**ఎర్రకోట కేంద్రంగా ఎదిగిన పోరు**

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం మీరట్‌లో సిపాయిల క్రియాశీలక తిరుగుబాటుతో ఆరంభమై ఢిల్లీ చేరుకుని చివరి మొగల్ పాదుషా బహద్దూర్ షా జఫర్ నాయకత్వంలో ఎర్రకోట కేంద్రంగా విజృంభించింది. 1857 మే మూడవ వారంలో ఆరంభమైన ఈ పోరు 1857 సెప్టెంబరు 21వ తేది వరకు సాగింది. ఈ పోరాటం ప్రేరణగా దేశంలోని పలు ప్రాంతాలలలో తిరుగుబాట్లు ప్రజ్వరిల్లాయి. ఆయా ప్రాంతాలలోని ప్రతి స్వదేశీపాలకుడు మొగల్ పాదుషా బహద్దూర్ షా జఫర్‌ను తమ ఏలికగా పరిగణిస్తూ ఈస్ట్ ఇండియా కంపెనీ ఆధిపత్యాన్ని తోసిరాజంటూ ఆంగ్లేయ సైన్యాలతో తలపడ్డారు.

ఈ పోరుకు తొలిదశలో మీరట్ నుండి విచ్చేసిన యోధులు ప్రధాన పాత్ర వహించి ఆంగ్లేయుల ఆధిపత్యానికి గండికొట్టారు. ఆ తరువాత ఢిల్లీలో ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల పాలన అంతం కాగా ఇతర ప్రాంతాల నుండి ఆంగ్లేయులను తరిమికొట్టాలని సంకల్పించి, ఆయా ప్రాంతాలలో తమ ఆధిపత్యం నిలుపుకుని, అటునుండి చాలా మంది తిరుగుబాటు యోధులు, స్వదేశీసైనికులు, సైన్యాధికారులు పెద్ద సంఖ్యలో ఢిల్లీ చేరుకున్నారు. ఈ మేరకు ఢిల్లీ చేరుకుని ఎర్రకోట కేంద్రంగా మొగల్ దర్బారులో ప్రముఖ పాత్రవహించి చరిత్ర సృష్టించిన వారిలో మహమ్మద్ భక్త్‌ఖాన్ ముఖ్యులు. ఆంగ్లేయ సైన్యంలో అధికారిగా 40 సంవత్సరాల అనుభవం గల ఈ నేత 1857తో బరేలిలో తిరుగుబాటు చేసి, కంపెనీ పాలకులను ఖంగుతినిపించి స్వదేశీ సైనికబలగాలతో, ధనసంపత్తితో ఢిల్లీ చేరుకున్నారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ మహాసేనానిగా ఖ్యాతిగడించటమే కాకుండా కలసి వచ్చే స్వదేశీపాలకులతో కలసి ' మహా పరిపాలనా మండలి ' ఏర్పాటుకు ఆయన మొగల్ పాదుషాకు తోడ్పడ్డారు. ఈ మండలి ప్రజాస్వామ్యబద్ధంగా పాలన సాగించే దిశగా 12 మార్గదర్శక సూత్రాలతో రాజ్యాంగ రచనకు ఆయన కృషిచేయటం విశేషం. ఆంగ్లేయుల ఆధిపత్యానికి తొలిదశలో చరమగీతం పాడిన ఈ నాయకుడు తన అనుచరులతో కలసి కంపెనీ పాలకుల గుండెల్లో దడ పుట్టించాడు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం చివరి దశలో బహద్దూర్ షా జఫర్ కనుక భక్త్‌ఖాన్ సలహాను పాటించి ఆయనతోపాటుగా లక్నో చేరుకుని ఉండిఉంటే భారతదేశ చరిత్ర మరోలాగుండేదని ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ విశ్లేషకులు అభిప్రాయపడ్డారంటే ఆయన ముందుచూపు ఏలాంటిదో గ్రహించవచ్చు. ఎర్రకోట వీడిన ఈ యోధుడు పలు ప్రాంతాలలోని ఆంగ్లేయ సైనికులతో తలపడుతూ 1859లో కదనరంగాన కన్నుమూశారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో మొత్తం మీద 72 సార్లు కంపెనీ సైనికులతో స్వదేశీ యోధులు తలపడ్డారు. ఈ పోరాటంలో ఫరూఖాబాద్ యోధులు అహమ్మద్ అలీ ఖాన్, తఫ్‌జుల్ హుస్సేన్ సరత్ జంగ్ తదితరులు మొగల్ పాదుషాకు అండదండగా నిలిచారు. ఆ కారణంగా అహమ్మద్ అలీ ఖాన్‌ను చాందనీ చౌక్‌లో బహిరంగంగా ఉరితీసి ఆయన శవాన్ని ఎర్రకోట కందకంలో పారేశారు. నవాబు తఫ్‌జుల్ హుస్సేన్ సరత్ జంగ్‌కు ప్రవాసశిక్ష విధించారు. ఈ విధంగా ఆనాడు మొగల్‌పాదుషా వెంట సాగిన వారందరికీ వారెంతటి స్థానంలో ఉన్నా సరే అవమానకరమైన శిక్షలతో ఆంగ్లేయులు అంతం చేశారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అలహాబాద్ యోధుడు లియాఖత్ అలీ ఖాన్ సాయుధంగా తిరుగుబాటు చేసి అలహాబాద్ పరగణా అంతటిని చేజిక్కించుకున్నారు. ఆయన హిందూ-ముస్లిం యోధులతో కలసి సమాఖ్య తరహా పాలనచేశారు. చివరకు నమ్మకద్రోహం వలన ఆంగ్లేయ సైనికులకు చిక్కడంతో ఆయనను చిత్రహింసలు పెట్టి చివరకు అండమాన్ దీవులకు పంపారు.

ఈ సందర్భంగా ఢిల్లీలోని ముస్లిం జనసముదాయాలు తమ ధన, మాన, ప్రాణాలను పణంగా పెట్టి పోరాడారు. అందర్నీ సమన్వయపర్చగల నాయకత్వం కరువు కావడం, మొగల్ సింహాసనం మీద మోజుతో అంతర్గత కలహాలకు కారకులై మొగల్ పరివారం, పరాయి పాలకుల పంచన విలాసవంతంగా బ్రతుకుదామనుకున్న విద్రోహుల చర్యల ఫలితంగా యోధుల త్యాగాలు వృధాగాపోయాయి. చివరి ఘట్టంలో విద్రోహుల వలలో చిక్కిన మొగల్ ప్రభువు భక్తఖాన్ లాంటి యోధుల సలహాలను పెడచెవిన పెట్టి కంపెనీ పాలకులకు లొంగిపోవటంతో ఢిల్లీ సెప్టెంబరు 19న పూర్తిగా తిరిగి ఆంగ్లేయుల వశమయ్యింది.

అప్రతిహతంగా సాగుతున్న తమ ఆధిపత్యాన్ని ప్రశ్నించిన ఆత్మగౌరవంగల స్వదేశీయోధుల మీద, ఆ యోధులకు సహకరించిన ప్రజల మీద ప్రధానంగా ఢిల్లీ ప్రజల మీద ఆంగ్లేయులు విరుచుకుపడ్డారు. బహుదూర్ షా జఫర్‌ను బంధించి విచారణ ఆరంభించారు. ఆయన వారసులెవ్వరూ బ్రతికి బట్టకట్టదన్న కసితో కుటుంబీకులందర్నీ ఆడ-మగ, పిల్లా-పాప, వృద్ధులు అని చూడకుండా ఊచకోతకోశారు. బహుదూర్ షా జఫర్‌కు ఇచ్చిన మాటతప్పి మొగల్ రాకుమారులను కాల్చి చంపి మృతదేహాలను ఎర్రటి ఎండలో బండరాళ్ల మీద గిరవాటు వేశారు. ముస్లింలను నగరంలోకి ఆరుమాసాల దాకా రానివ్వలేదు. నగరం విడిచి ఎవ్వరినీ బయటకు పోనియ్యలేదు. నగరంలో ప్రత్యేకంగా ప్రతి ముస్లిం గృహాన్ని గుర్తించి గృహస్తులను దారుణంగా కాల్చి చంపుతూ, ఆస్తిపాస్తులను అగ్నికి ఆహుతి చేస్తూ తీవ్ర విధ్వంసం సృష్టించారు. ఆంగ్లేయ సైనికులు, అధికారులు వారాల తరబడి ప్రతి ఇంటిని దోచుకున్నారు. అత్యాచారాలకు పాల్పడ్డారు. ఈ చర్యలవలన ఢిల్లీ నగరం శవాలదిబ్బగా మారిపోయింది. ఢిల్లీలోని ప్రతి బావి మృతదేహాలతో

నిండిపోయాయి. ఢిల్లీ నగరం పూర్తిగా ధ్వంసమయ్యింది. ఈ విషయాన్ని హృదయవిదారకంగా వివరిస్తూ మహాకవి గాలిబ్ రోదించాడు.

**ఎర్రకోట ప్రేరణతో వెల్లువెత్తిన తిరుగుబాట్లు**

ఢిల్లీలో ఆంగ్లేయుల ఆధిపత్యానికి చరమగీతంపాడి, స్వదేశీ పాలకులు ప్రభువుగా మొగల్ పాదుషా అధికార పగ్గాలు చేపట్టారని తెలియగానే దేశవ్యాప్తంగా తిరుగుబాటు జ్వాలలు రగిలాయి. ఉత్తర ప్రదేశ్‌లోని ఫతేపూర్‌కు చెందిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారి సర్దార్ హిక్మతుల్లా ఖాన్ జూన్ 10న తిరుగుబాటు జెండా ఎగురవేశారు. ఆంగ్లేయుల పెత్తనాన్ని అంతం చేసి, అన్ని సాంఘిక జనసముదాయాలకు చెందిన స్వదేశీయోధుల భాగస్వామ్యంతో స్వపరిపాలన ఏర్పాటు చేశారు. చేజారిన అధికారాన్ని చేజిక్కించుకోడానికి ఆంగ్లేయ సైనికాధికారులు ఫతేనగర్‌ను చుట్టుముట్టి హిక్మతుల్లా, ఆయన అనుచరులను అరెస్టు చేసి జూలై 12వ తేదీన ఆయనను బహిరంగంగా ఉరితీసి, శవాన్ని అలాగే వేలాడదీశారు. ఈ తరహాలో తన అనుచరులతో తిరగబడిన బీహార్‌కు చెందిన షహీద్ పీర్ అలీని జూలై 3న ఉరితీశారు. ఆ సందర్భంగా, మృత్యుదేవతను ధిక్కరిస్తూ వీరోచితహసంతో ఉరికంబం మీద ఆయన నిలబడ్డారని, విడి సావర్కర్ తన '1857 స్వరాజ్య సంగ్రామం' గ్రంథంలో పీర్ అలీ సాహసాన్ని అభివర్ణించారు.

ఉత్తరప్రదేశ్‌లోని అవధ్ రాజ్యంలో విజృభించిన మౌల్వీ అహ్మదుల్లా షా ఫైజాబాది ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నూతన చరిత్ర సృష్టించారు. ఆదినుండి ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ వచ్చిన మౌల్వీ 1857 జూన్‌లో ఆంగ్లేయుల చెరశాల నుండి విముక్తుడై తన అనుచరులతో కలసి పోరుబాట సాగారు. ఆంగ్లేయ సైనికులు తారసపడిన చోటల్లా వారిని ఎదుర్కొని మట్టికరిపించారు. స్వదేశీ యోధుల విజయపరంపరను కొనసాగిస్తూ ఆయన అవధ్ మహారాణి బేగం హజరత్ మహల్ తో కలసి ఆంగ్లేయులను ఎదుర్కొనేందుకు లక్నో చేరుకున్నారు. ఆయన అక్కడ కూడా కంపెనీ అధికారులను పలు పోరాటాలలో పరాజితుల్ని చేశారు. ఈ యోధుని విక్రమాన్ని ఎదుర్కొలేకపోయిన కంపెనీ అధికారులు ఆయనను పట్టిచ్చిన వారికి 50వేల రూపాయాల నజరానా ప్రకటించాల్సి వచ్చింది. చివరి వరకు రాజీలేని పోరుబాటలో సాగిన ఆయన నమ్మకద్రోహం వలన హతమయ్యారు.

ఈ విషయాన్ని విడి సావర్కర్ తన '1857 స్వరాజ్య సంగ్రామం' లో ప్రస్తావిస్తూ, 'రాజా పక్కనే ఉన్న అతడి సోదరుడు మౌల్వీ పై గురిచూసి కాల్పులు జరిపాడు. ఆ దుర్మార్గుని హస్తాలలో మౌల్వీ హతుడైపోయాడు. ఆ పిరికిపందలు...మౌల్వీ శిరస్సు ఖండించి, దాని పై గుడ్డ కప్పుకొని చేరువనే 13 మైళ్ల దూరాన ఉన్న బ్రిటిష్ ఠాణా -షాజహాన్‌పూర్‌కు తీసుకువెళ్లారు...రక్తం ఓడుతున్న ఆ శిరాన్ని ఆంగ్లేయుల ముందు కానుకగా ఉంచి వారి పాదాల చెంత మోకరిల్లారు...దేశద్రోహానికి తలపడిన ఆ పోవెన్ పశువుకు 50 వేల రూపాయల పారితోషికం లభించింది!' అని రాశారు.

మౌల్వీ ఖండిత శిరస్సును తెప్పించుకున్న అధికారులు 'ఉత్తర భారతదేశంలో బలిష్టమైన శత్రువును' అంతం చేశామని ఆనందించారు.

ఆంగ్లేయుల అజేయశక్తిని ఊహించుకుని, తిరగబడితే ఎదురయ్యే సమస్యలను లెక్కలు కట్టి వారిమీద తిరగబడటానికి చాలామంది స్వదేశీ పాలకులు భయపడ్డారు. ఆ తరుణంలో ఆయా పాలకుల వద్ద బాధ్యతలు నిర్వహిస్తున్న పలువురు ముస్లింయోధులు తమ తమ పాలకుల వెంట ఉండి మాతృభూమి విముక్తి కోసం తిరుగుబాటు చేయాల్సిన పరిస్థితులను వివరించి పోరుకు వారిని ప్రోత్సహించారు.

ఈ మేరకు సాగిన పలు తిరుగుబాట్లలో అగ్రభాగాన నిలబడి స్వదేశీపాలకులతో కలసి ఆంగ్లేయుల మీద తిరగబడి విముక్తి పోరాటంలో ప్రాణాలర్పించారు. ఈ తరహా వీరులలో ఝాన్సీ సంస్థానానికి చెందిన జైలు అధికారి బక్షీష్ అలీ ఒకరు. 1857 జూన్ 6వ తేదీన ఆయన తన ఆధీనంలో ఉన్న స్వదేశీయులను జైలు నుండి విడుదల చేసి తిరుగుబాటుకు తెరలేపారు. ఆనాడు ఝాన్సీరాణి తొలుత తిరుగుబాటుకు అంగీకరించలేదు. ఆమెకు నచ్చచెప్పి రణరంగానికి రప్పించటంలో బక్షీష్ అలీ ప్రముఖపాత్ర వహించారు. చివరి వరకు బక్షీష్ అలీ ఆమె వెంట నడుస్తూ పోరుబాటలో ప్రాణాలర్పించారు.

ఆంగ్లేయుల ఆర్థికబలాన్ని, సైనికబలాన్ని అత్యధికంగా అంచానాలు కడుతూ పరాయి పాలకుల ఎదుట మోకరిల్లటం కాకుండా వలసపాలకుల పెత్తనాన్ని ఏమాత్రం సహించని స్వదేశీపాలకులు చాలా మంది తిరుగుబాటు పర్యావసానాన్ని ఏమాత్రం ఆలోచించకుండా చివరకు చావోరేవో తేల్చుకునేందుకు సిద్ధపడ్డారు. అటువంటి వారిలో ప్రముఖులు అవధ్ రాణి బేగం హజరత్ మహల్. ఉత్తరప్రదేశ్‌లోని అవధ్ రాజ్యానికి చెందిన రాణి అమె. బ్రిటిష్ పాలకులు కుయుక్తులతో ఆమె భర్త నవాబ్ వాజిద్ అలీషాను అరెస్టు చేసి అవధ్‌ను స్వాధీనం చేసుకున్నారు. మాతృభూమి పరుల పాలవడంతో ఆగ్రహించిన ఆమె ప్రజలు, స్వదేశీ యోధుల అండదండలతో బ్రిటిష్ సైన్యంపై విరుచుకుపడి తిరిగి తన రాజ్యాన్ని సొంతం చేసుకున్నారు. ఉత్తర హిందూస్థానంలో అత్యంత కీలకమైన అవధ్‌లో తమ ఆధిపత్యానికి చరమగీతం పాడటం సహించలేని కంపెనీ అధికారులు, బేగంను కదలనివ్వకుండా అపార బలగాలతో లక్నోను చుట్టుముట్టారు. ఆ క్లిష్టపరిస్థితులలో ఏమాత్రం ఆధైర్యపడకుండా తన పదమూడు సంవత్సరాల బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను నవాబుగా ప్రకటించి అతని సంరక్షకురాలిగా ఆమె పాలనా బాధ్యతలు చేపట్టారు. స్వదేశీ పాలకులను, ప్రముఖులను ప్రజలను ఐక్యపర్చారు. పరిపాలనలో హిందూ-ముస్లింలకు సమాన స్థాయి, పదవులు కల్పించారు. బ్రిటిష్ సైనికదళాల పడగ నీడలో కూడా ఎంతో సాహసంతో పలు మాసాల పాటు శత్రువు ఎత్తులను చిత్తుచేస్తూ, సమర్థవంతమైన పాలన సాగించారు.

ఈ పరిస్థితులను గుర్తించిన బ్రిటిష్ అధికారి విలియం రస్సెల్, '..బేగం మాతో అప్రకటిత యుద్ధం ప్రారంభించింది...ఈ రాణులు, బేగంల శ్లాఘనీయ, శక్తివంత చరిత్రలను గమనించాక, అంతఃపురంలో పర్దాల చాటున ఉంటూకూడా ఎంతటి శక్తియుక్తులు సంతరించుకోగలరో తెలుసుకున్నాం..' అని వ్యాఖ్యానించాడు. మరో ప్రముఖ చరిత్రకారుడు ఎచ్. బెవెరిడ్జ్1857 నాటి, '..తిరుగుబాటుకు బేగం ఆత్మలాంటిది'. అని బేగం హజరత్ మహల్‌ను ప్రస్తుతించాడు. ఆమె పర్దానషీ మహిళ కానట్టయితే మిగతా పురుషుల కంటే గొప్ప పోరాట యోధురాలుగా ఖ్యాతి గడించేది..', అని ప్రముఖ చరిత్రకారుడు అబ్దుల్ హలీమ్ షరార్ వ్యాఖ్యానించాడు.

ఈ సందర్భంగా విక్టోరియా రాణి ఓ ప్రకటన చేసింది. ఆ

ప్రకటనకు ప్రతిగా స్వదేశీపాలకులను, ప్రజలను హెచ్చరిస్తూ, ఆంగ్లేయుల కుట్రలను తేటతెల్లం చేస్తూ, బేగం హజరత్ మహాల్ చారిత్రాత్మక ప్రకటనను విడుదల చేశారు. ఆ ప్రకటనలో '...హిందూ-ముస్లింలకు ధర్మం, ఆత్మగౌరవం, ప్రాణం, ధనం అను నాలుగు అంశాలు ప్రధానం. ఈ అంశాలను కేవలం స్వదేశీపాలనలో, స్వదేశీ పాలకులు మాత్రమే ప్రసాదించగలరు. కంపెనీ సైనికులు ప్రజలను దోచుకుంటున్నారు. ఆత్మగౌరవాన్ని మంటకలుపుతున్నారు. స్త్రీల మీద అఘాయిత్యాలు, అత్యాచారాలు జరుపుతున్నారు...హిందూ-ముస్లిం పౌరులను హెచ్చరిస్తున్నారు. ఆత్మగౌరవంతో, ధర్మబద్ధంగా ప్రశాంత జీవితం సాగించాలంటే స్వదేశీ పాలన కోసం శత్రువులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. స్వదేశీ సైన్యంలో భర్తీకండి...మాతృదేశం కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములవ్వండి. శత్రువుకు సహకరించకండి. ఆశ్రయం ఇవ్వకండి...'. అని అన్నారు.

హజరత్ మహాల్ మీద కత్తి గట్టిన ఈస్ట్ ఇండియా పాలకులు లక్నోను అపార సైనిక బలగాలతో ముట్టడించినా, ఏమాత్రం అధైర్యపడక ఆమె స్వయంగా రణరంగ ప్రవేశం చేసి, తన సైనిక దళాలను ముందుకు నడిపి వీరోచితంగా పోరాడారు. భారీ సంఖ్యతో చుట్టుముట్టిన బ్రిటిష్ సైనికమూకలను ఎదుర్కొనటం కష్టతరమైన తరుణంలో, తిరిగి దాడి చేసేందుకు తాత్కాలికంగా యుద్ధరంగం నుండి వైదొలిగి నేపాల్ పర్వతాల్లోకి నిష్క్రమించారు. ఆ అడవుల్లో కాన్పూరు ప్రభువు నానాసాహెబ్, మొగల్ రాకుమారుడు ఫిరోజ్ షా లాంటి యోధులను కలసి ఆంగ్లేయుల మీద పోరు సాగించేందుకు తన బలగాలను మళ్లీ సమీకరిస్తూ, నేపాల్ అడవుల్లో సాహసి బేగం హజరత్ మహాల్ సామాన్య మహిళగా కన్నుమూశారు.

స్వదేశీపాలకుల రాణులు మాత్రమే కాకుండా రాకుమారులు కూడా ప్రజలతో కలసి పరాయిపాలకుల మీద యుద్ధం ప్రకటించారు. ఈ మేరకు ప్రజల అండదండలతో ఆంగ్ల సైన్యాలను సవాల్ చేసిన యోధులలో ఫిరోజ్ షా ఒకరు. ఆయన మొగల్‌పాదుషా షా ఆలం మనుమడైన మీర్జా నిజాం భక్త్ కుమారుడు. 1855లో మక్కా వెళ్లి తిరిగి రాగానే మాతృభూమి మీద రగులుతున్న తిరుగుబాటు జ్వాలలను చూశారు. 1857 ఆగస్టు 26న అందిన ఆయుధాన్ని చేతబూని ప్రజలతో కలసి ఆంగ్లేయుల మీద యుద్ధం ప్రకటించి గ్వాలియర్ సంస్థానం మాండిసోర్‌ను స్వాధీనం చేసుకున్నారు. ఆ ప్రాంతాన్ని కేంద్రంగా చేసుకుని ప్రజలు, యువకులు, సైనికులతో కలసి 18 వేలమందితో స్వంత సైన్యం తయారుచేసుకుని పలు పోరాటాలు సాగించారు. ఈ సందర్భంగా ఆయన కాన్పూరు నాయుడు నానాసాహెబ్, బేగం హజరత్ మహాల్, మౌల్వీ అహమ్మదుల్లా ఫైజాబాది లాంటి యోధులతో కలసి ఆంగ్ల సైన్యాల మీద ఉమ్మడి పోరుసాగించారు. ఆంగ్ల సైన్యాల మీద స్వదేశీయులు ఎక్కడ తిరగబడితే అక్కడికల్లా ఆయన ప్రత్యక్షమయ్యారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సఫలం కాకపోవటంతో మిగతా తిరుగుబాటు యోధులతో కలసి ఆయన అంతర్ధానమయ్యారు. చివరి వరకు ఆంగ్లేయుల ఆధిపత్యానికి గండికొట్టేందుకు శతవిధాల ప్రయత్నాలు సాగిస్తూ, ప్రతికూల పరిస్థితులలో కూడా సంపద, సైన్యం సమీకరణకు కృషిచేస్తూ కన్నుమూశారు.

ఆ తరువాత స్వదేశీ పాలకులలో మాతృభూమి పట్ల ప్రేమాభిమానాలను ప్రోదిచేసే లేఖలు రాసిన అజీముల్లా ఖాన్ గురించి చెప్పుకోవాలి. కాన్పూరు యోధుడు నానాసాహెబ్ పక్షాన పోరాటాల వ్యూహరచన చేసి శత్రువుతో అవిశ్రాంతంగా పోరాడిన ఆయన నానాసాహెబ్‌కు కుడిభుజం. ఆయన స్వయంగా 'పయామే ఆజాది' అను పత్రికను నడిపి ఆనాటి స్వాతంత్ర్య సమరయోధులకు ఉత్తేజపూరితమైన మార్గదర్శకం చేశారు. ప్రజలలో దేశభక్తి భావనలను పెంపొందించేందుకు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను కూడగట్టేందుకు **పయామే ఆజాది** పత్రికను హిందీ, ఉర్దూ భాషల్లో ప్రచురించారు. మరాఠీ భాషలో కూడా ఆ పత్రికను నడిపేందుకు ప్రయత్నాలు జరిగాయి. ఆ పత్రికలో '..భారతీయ హిందువులారా, ముస్లింలారా లేవండి. సోదరులారా లేవండి. దైవం మనిషికి ఎన్నో వనరులను ఇచ్చాడు. అందులో విలువైనది స్వాతంత్ర్యం..' అంటూ మొగల్ చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్ ప్రజలకు ఇచ్చిన పిలుపును ప్రచురించారు. మాతృ దేశాన్ని కీర్తిస్తూ, బానిస బంధనాల నుండి విముక్తి కోసం పోరుబాట నడవమంటూ ప్రబోధ గీతం ఈ పత్రికలో ప్రచురితమైంది.

ఆనాడు అజీముల్లా ఖాన్‌లాగా ఆంగ్లేయుల ఆధిపత్యానికి గండికొట్టి మాతృభూమిని పరాయిపాలకుల నుండి విముక్తం చేయాలన్న దృఢ సంకల్పంతో విలాసవంతమైన జీవితాన్ని వదలి, కాన్పూరు పాలకుడు నానాసాహెబ్ మార్గాన పోరుబాటపట్టారు పాతికేళ్ల ఆడపడుచు బేగం అజీజున్. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో అనేక మంది మహిళలు ప్రాణాలు పణంగా పెట్టి పోరాడినప్పటికీ, వారందరిలో అజీజున్ ప్రత్యేక స్థానం పొందారు. ఆమె తన సహచరుడు షంషుద్దీన్ సహకారంతో ఆయుధాలు ఉపయోగించటం, గుర్రపు స్వారీ నేర్చుకుని సైనిక దుస్తులు ధరించి రణరంగానికి సిద్ధమయ్యారు. మాతృదేశ భక్తిభావనలు గల యువతులను సమీకరించి, ప్రత్యేక మహిళా సైనిక దళం ఏర్పాటు చేశారు. మహిళా సైనిక దళం ఏర్పాటు చేయటమే కాకుండా, వారికి స్వయంగా చక్కని శిక్షణ గరిపి, ఎటువంటి ఉపద్రవాన్నైనా ఎదుర్కోగలిగేట్టుగా ఆ దళాలను తీర్చిదిద్దారు. తుపాకి పేల్చటం, కత్తి తిప్పటం, గుర్రపుస్వారీ చేయటంలో ప్రత్యేక శిక్షణ కల్పించి సుశిక్షితులైన సైనికులుగా తయారు చేశారు. ప్రజల రక్షణతోపాటు, రాజ్యరక్షణ కోసం తమ ప్రాణాలను పణంగా పెడతామని శపథాలు చేయించి, శత్రువును దునుమాడేందుకు, ఏ క్షణాన్నైనా రణరంగ ప్రవేశం చేయడానికి బలగాలను సర్వసిద్ధంగా ఉంచారు. ఈ మేరకు మహిళా సైనిక దళాన్ని స్థాపించిన ప్రప్రథమ మహిళగా అజీజున్‌ను అభివర్ణిస్తూ, ప్రముఖ రచయిత ఆనంద స్వరూప్ మిశ్రా ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన "నానా సాహెబ్ పేష్వా అండ్ ది వార్ ఇన్ ఇండిపెండెన్స్" అను గ్రంథంలో పేర్కొన్నారు. సంగ్రామ యోధులకు ఆహారం, ఆయుధాలను సమకూర్చి పెట్టడం, నాయకులు, సైనికుల మధ్యన సంధానకర్తల్లా వ్యవహరించటం, బ్రిటీష్ సైనికుల కదలికలు గమనించి ఆ సమాచారాన్ని తిరుగుబాటు దళాల నాయకులకు చేరవేయటం తదితర బాధ్యతలను ఆమె నిర్వహించి నానాసాహెబ్‌కు సహకరించారు. యుద్ధభూమిలో గాయపడిన స్వదేశీ సైనికుల చికిత్సకు సంబంధించిన కార్యకలాపాలను నిర్వహించటం పట్ల శ్రద్ధను చూపారు. తమ ప్రాణాలు

తెగించి పోరాడుతున్న వీరులు గాయపడి అనాథలుగా ప్రాణాలు విడవటం పట్ల కలతచెందిన ఆమె క్షతగాత్రులకు ప్రత్యేక శ్రద్ధతో సేవలందించారు. ఈ విధంగా అన్ని రంగాలలో తనదైన ప్రతిభను చూపెట్టిన అమె పోరాడుతూ శత్రువుచేత చిక్కారు. ఆ తరువాత విచారణ కోసం బేగం అజీజున్‌ను ఉన్నత సైనికాధికారి జనరల్ హెవ్‌లాక్ ఎదుట హాజరు పర్చారు. ఆమె సాహసకృత్యాల గురించి వినిఉన్న అధికారి, ఆమె రూపురేఖలను చూసి అవాక్కయ్యాడు. ఆ సుకుమారి రణరంగంలో అరవీరభయంకరంగా వ్యవహరించడాన్ని నమ్మలేకపోయాడు. అపరాధాన్ని అంగీకరించి క్షమాపణ వేడుకుంటే ఆరోణపలన్నీ రద్దుచేస్తానని, క్షమించి విడిచిపెట్టగలనని ఆమెకు అధికారి హామీ ఇచ్చాడు. ఆ ప్రతిపాదనలను బేగం అజీజున్ నిర్ద్వందంగా నిరాకరించారు. ప్రాణ భయం ఏమాత్రం లేని ఆమె ప్రవర్తన చూసి విస్తుపోయిన ఆ అధికారి చివరకు, నీకేం కావాలి? అని ప్రశ్నించాడు. నాకు బ్రిటిష్ పాలన అంతం చూడాలనుంది అని నిర్భయంగా, చాలా ఘాటుగా సమాధానమిచ్చారు. అ సమాధానంతో మండిపడిన జనరల్ హెవ్‌లాక్ ఆమెను కాల్చి వేయాల్సిందిగా సైనికులకు ఆదేశాలిచ్చాడు. ఆ విధంగా ఆ యోధురాలి సాహసోపేత జీవితం అంతమైపోయింది.

ఈ మేరకు బేగం అజీజున్ మార్గాన సాగిన మరొకరు 60 సంవత్సరాల అనామిక. ఆమె పేరేమిటో తెలియదు. ఆమె ఎల్లవేళల ధరించే పచ్చరంగు దుస్తుల వలన ఆమె పచ్చరంగు దుస్తుల మహిళగా ఖ్యాతిగాంచారు. గుర్రం మీద స్వారి చేస్తూ, కత్తితో శత్రువు మీద విరుచుకుపడుతూ ఆంగ్లేయ సైనికుల మీద గెరిల్లా పోరాటం సాగించిన ఆమె బ్రిటిష్ సైనికదళాలలో భయోత్పాతం సృష్టించారు. శత్రువును సంహరిస్తూ తీవ్రంగా గాయపడిన తరువాత గాని పట్టుబడని ఆమెను అంబాలాలో గల బ్రిటిష్ సైనిక స్థావరానికి పంపారు. ఈ సందర్భంగా 'ఈ వృద్ధురాలు బహు ప్రమాదకారి...జాగ్రత్త' అంటూ 1857జూలై 29న అక్కడి డిప్యూటి కమిషనర్‌కు ఆమెను నిర్బంధించిన అధికారి ప్రత్యేకంగా లేఖ రాసి ముందు జాగ్రత్తలతో హెచ్చరికలు చేసాడంటే ఆ పచ్చదుస్తుల మహిళ ఎంతటి ఘటికురాలో ఊహించవచ్చు.

ఈ విధంగా శత్రువును సాయుధంగా ఎదుర్కొన్న వారు, సాయుధ తిరుగుబాటు దళాలను ప్రోత్సహించిన వారు, ఆశ్రయం కల్పించి ఆదుకున్న మహిళలు ఎందరో ఉన్నారు. ఈ కోవలో మాతృదేశ విముక్తి కోసం ఉరిని కూడా లెక్కచేయని సాహసి హబీబాబేగం, ఝాన్సీరాణి వెన్నంటినిలచి పోరాడుతూ ఆమెతోపాటుగా ప్రాణాలర్పించిన ముందర్, బ్రిటిష్ సైనికమూకలను సాయుధంగా ఎదుర్కొన్న ధైర్యశాలి బేగం రహిమా, తిరుగుబాటు యోధుల క్షేమం కోరుతూ సజీవదహనమైన అస్గరిబేగం, సాయుధంగా ఆంగ్లసైన్యాలను నిలువరించిన బేగం జమిలా, కత్తిపట్టి కదనరంగాన శతృవును సవాల్ చేసిన బేగం ఉమ్‌ద్దా తదితరులు ఎందరో ఉన్నారు. ఈ మహిళపట్ల ఆంగ్లేయులు చాలా క్రూరంగా వ్యవహరించారు. అద్భుతమైన ధైర్యసాహసాలు ప్రదర్శించిన 11 మహిళలను ఒక్కసారే ఉరికంబానికి ఎక్కించి బలితీసుకున్న దారుణాలు ఎన్నో ఉన్నాయి.

చరిత్ర నవోదు ప్రకారం ఆనాడు ఇతర సాంఘిక జనసముదాయల తోపాటుగా వేలాది ముస్లిం మహిళలు కాల్చి వేయబడ్డారు. సజీవ దహనమయ్యారు. ఉరితీయబడ్డారు. అవమానాలకు, అత్యాచారాలకు గురయ్యారు. ఈ సమాచారాన్ని బ్రిటిష్ అధికారుల డైరీలు, లేఖలు బహిర్గతం చేస్తున్నాయంటే, ఆ మహిళల త్యాగాలు ఎంతటి మహత్తరమైనవో మనం అర్థం చేసుకోవచ్చు.

ఈ పోరాటం సందర్భంగా రాజరిక వ్యవస్థలో ప్రజాస్వామ్య ధోరణులు వ్యక్తం కావటంతో పాటుగా దేశంలోని ప్రధాన మతాలకు చెందిన ప్రజల మధ్య పటిష్టమైన సంబంధాలు ప్రదర్శితమయ్యాయి. ఉత్తరహిందూ స్థానంలోని పౌరుషాల పోతుగడ్డకు రొహిల్‌ఖండ్‌కు చెందిన వృద్ధుడు ఖాన్ బహుద్దూర్ ఖాన్ తిరుగుబాటు చేయటమే కాకుండా స్థానిక పెద్దలను సమీకరించి సమాఖ్య తరహా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి 11 మాసాలపాటు నడిపారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాట నడవాల్సిందని ప్రజలకు పిలుపునిస్తూ 'భారత దేశ ప్రజల్లారా!' అని ఆయన సంబోధించారు. ఈప్రాంతంలో ప్రజల మధ్య వ్యక్తమౌతున్న ఐక్యతను నజరానాలతో భగ్నం చేయాలని ఆంగ్లేయులు డబ్బుల సంచులు కుమ్మరించినా, మా మతాలు వేరైనా మా మాతృభూమి ఒక్కటే, మా మార్గం ఒక్కటే, మా లక్ష్యం ఒక్కటేననుకున్న రొహిల్లా ప్రజలు, మతం పేరిట మనుషుల్ని చీల్చి పబ్బం గడుపు కోవాలనుకున్న బ్రిటిష్ పాలకుల ఎత్తులను తిప్పికొట్టారు. దాంతో దిగుమతి చేసిన డబ్బుసంచులను తిప్పిపంపాల్సి వచ్చిందని ఆంగ్లేయాధికారులు తమ గ్రంథాలలో రాసుకున్నారు. ఈ రకంగా దేశంలోని పలు ప్రాంతాలలో ఆత్మగౌరవం గల స్వదేశీ పాలకులు, ప్రజల నుండి పోరాటయోధులు ఉద్భవించి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామాన్ని తమ రక్తతర్పణతో సుసంపన్నం చేశారు.

**కలం యోధుల తోడ్పాటు**

ప్రథమ స్వాతంత్ర్యోద్యమంలో ఆనాటి పత్రికలు కూడా బృహత్తరమైన పాత్రను నిర్వహించాయి. ఆయా పత్రికల సంపాదకులు, పాత్రికేయులు కంపెనీ పాలకుల చర్యలను తూర్పారబడ్తూ, స్వాతంత్ర్య సమరయోధులను ప్రోత్సహిస్తూ, తిరుగుబాటు సమాచారాన్ని ప్రజలకు తెలుపుతూ ప్రజలను తిరుగుబాటు దిశగా కదిలించారు. ఆనాడు ఢిల్లీ కేంద్రంగానూ, ఇతర ప్రాంతాల నుండి 'ఢిల్లీ అక్బార్', 'కొహినూర్', 'తారిఖ్-ఎ-భగవత్-ఎ-హింద్', 'ముషిర్-ఎ-దక్కన్', 'వకీల్' వంటి పలు పత్రికలు బ్రిటిష్ వ్యతిరేకతను ప్రజానీకంలో ప్రోది చేస్తూ సాహసవంతమైన పాత్రను పోషించాయి.

ప్రథమ స్వాతంత్ర్య సమరానికి తిరుగులేని మద్దతు నిస్తూ తిరుగు బాటుదార్లలో బ్రిటిష్ పాలకుల పట్ల తీవ్ర ప్రతిఘటన జ్వాలలను మండించింది 'ఢిల్లీ అక్బార్' పత్రిక. బ్రిటిష్ పాలకులు ఆ పత్రిక సంపాదకులైన మౌల్వీ మహమ్మద్ బాకర్‌ను 1858లలో అరెస్టు చేసి దారుణ చిత్రహింసలకు గురిచేసి పరమ కిరాతకుడిగా ఖ్యాతి గాంచిన ఆంగ్లేయాధికారి హడ్సన్ హత్యగావించాడు. ఈ విధంగా భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రజల పక్షం వహించి పత్రికా స్వేచ్ఛకై పోరాడుతూ, అధికారుల చిత్రహింసల భరిస్తూ ఏమాత్రం రాజీపడక చివరకు ప్రాణాలర్పించిన తొలి సంపాదకునిగా ముహమ్మద్ బాకర్ చరిత్రలో నిలిచిపోయారు.

ఆనాటి పత్రికలన్నీ విదేశీ పాలక శక్తుల మీద తమ అక్షరాయుధాలను ప్రయోగించటంతో భీతిల్లిన పాలకులు పత్రికలను

నిషేధించి, సంపాదకులను, ప్రచురణకర్తలనేకాక, పాఠకులను కూడా తీవ్ర నిర్భంధాలకు గురిచేశారు. ఈ కారణంగానే 1853 నాటికి ఉన్న 35 ఉర్దూ పత్రికలు కాస్తా 1858 నాటికి 12కు తగ్గిపోయాయంటే బ్రిటీష్ పాలకులు ఎంత క్రూరంగా వ్యవహరించారో తేలిగ్గానే ఊహించవచ్చు.

**ముస్లింల ఊచకోత**

ప్రథమ స్వాతంత్ర్య సమరాన్ని ప్రారంభించినవారు, పాల్గొన్నవారు, ప్రోత్సహించినవారు ప్రధానంగా ముస్లింలేనన్న అభిప్రాయానికొచ్చిన బ్రిటిష్ పాలకులు 27 వేలమంది ముస్లింలను వివిధ ప్రాంతాలలో ఉరితీశారని చరిత్ర రికార్డులు చెబుతున్నాయి. ఈ సంఖ్య అధికారిక లెక్కల ప్రకారంగా వెల్లడించింది కాగా ఆనాడు కనబడిన చెట్టునల్లా ఉరికంబాలుగా మార్చి వేలాది సమరయోధులను ఆ చెట్లకు ఉరితీశారు. చెట్టుకొమ్మలు కూడా కన్పించనంతగా మృత కళేబరాలు వారాలపాటు ఆ చెట్లకు వేలాడాయని ఆంగ్లేయ చరిత్రకారులు తమ గ్రంథాలలో అధికారులు సాగించిన ఘాతుకాలను వివరించారు. ఈ తిరుగుబాటుకు ముస్లింలు ప్రధాన కారణంగా భావించినందున ఈస్ట్ ఇండియా కంపెనీ ఆంగ్లేయ సైనికులు పూర్తిగా స్వేచ్ఛనిచ్చి ముస్లింల ఊతకోచకు పురికొల్పింది. ఈ మేరకు లభించిన స్వేచ్ఛతో తిరుగుబాటు జరిగిన ప్రతి ప్రాంతాన్ని కంపెనీ సైనికులు శ్మశానవాటికలుగా మార్చారు. ఈ చర్యను కంపెనీలోని సైనికాధికారులు కొందరు ఖండించారంటే ఆ ఊచకోత ఏ స్థాయిలో జరిగిందో ఊహించవచ్చు. ఈ విధంగా ఆంగ్లేయ సైనికుల చేతుల్లో హతమైన స్త్రీ-పురుషుల వివరాలు లేకున్నప్పటికీ కొందరి అంచనాల ప్రకారం మరో 30 వేల మంది ప్రాణాలు కొల్పోయి ఉంటారని తెలుస్తుంది.

**తెలుగు బిడ్డల తిరుగుబాటు**

బ్రిటిష్ పాలకులపై తిరుగుబాటు చేసిన వారిలో తెలుగు గడ్డకు చెందిన ముద్దుబిడ్డలు ఎందరో ఉండటం తెలుగుజాతి గర్వించదగిన అంశం. ఆంగ్లేయులతో స్నేహం చేస్తున్న నిజాం నవాబును ఆ దారి మళ్ళించాలని ప్రజలు, ప్రముఖులు ఆది నుండి విఫలప్రయత్నాలు సాగించారు. ఈ ప్రయత్నాలలో భాగంగా 1857కు ముందు నుండే ఆంగ్లేయాధికారులకు వ్యతిరేకంగా ధిక్కారస్వరాన్ని విన్పించారు. చాలా చోట్ల తిరగబడి శిక్షలు అనుభవిచారు. ఈ రకంగా తిరుగుబాటు తత్వాన్ని ప్రదర్శిస్తూ వచ్చిన యోధులు చివరకు 1857లో బహిరంగంగా తిరుగుబాటు జెండాను రెపరెపలాడించారు. ఈ తిరుగుబాటులో భాగంగా 1857లో బ్రిటిష్ రెసిడెన్సీ మీద జరిగిన సాహసోపేత దాడికి పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ నాయకత్వం వహించారు. ఆయన తన అనుచరులతో కలసి ఆంగ్లసైన్యాలతో తలబడ్డారు. చివరకు తప్పించుకపోయిన ఆయనను పట్టిచ్చినవారికి ప్రభుత్వం 5 వేల రూపాయలు నజరానా కూడా ప్రకటించింది. చివరకు ఆయనను బంధించి ఉరితీశారు. ఆయన భౌతికకాయాన్ని ప్రస్తుతం హైదరాబాద్‌లోని సుల్తాన్ బజార్ పోలీస్ స్టేషన్ సెంటర్‌లో బహిరంగా వేలాడదీసి ఆంగ్లేయులు ఆయన మీద తమకుకల కసిని, తమ పైశాచికత్వాన్ని చాటుకున్నారు. ఆ బాటలో నడిచి, తుర్రేబాజ్ ఖాన్‌కు అండదండలు అందించిన మౌల్వీ అల్లావుద్దీన్‌ను ఆరెస్టు చేసి ద్వీపాంతర వాసానికి పంపారు. ఆ క్రమంలో సయ్యద్ అహమ్మద్ 1857 జులై 17న పోరుసల్పుతూ ప్రాణాలు విడిచారు. బోయనపల్లిలో బ్రిటిష్ సైనికాధికారి కల్నల్ డేవిడ్‌సన్‌ను చంపే ప్రయత్నంలో జహంగీర్ ఖాన్ అను మరో యోధుడు కాల్చివేయబడ్డారు. ఈ విధంగా ఆనాడు నిజాం సంస్థానంలోని పలు ప్రాంతాలలోని సైనికులు, ప్రజలు ఎవ్వరూ ఊహించనంతగా విజృంభించారు. పలువురు ప్రాణాలు అర్పించారు. చాలా మంది బహిష్కరణకు గురయ్యారు. అసంఖ్యాకంగా జైళ్లపాలయ్యారు.

**రాయలసీమలో రగిలిన పోరాటం**

ఈ పోరాట ప్రకంపనలు హైదరాబాద్ వరకు పరిమితం కాలేదు. పౌరుషాల పోతుగడ్డగా ఖ్యాతిగాంచిన రాయలసీమకు కూడా పాకాయి. ఆ సమయంలో కడపజిల్లా ఎల్లంపేట నివాసి షేక్ పీర్ సాహెబ్ తిరుగుబాటుకు సిద్ధమయ్యారు. 1857 ఆగస్టు 28న కడపలో కంటోన్మెంట్‌లోని భారతీయ సైనిక అధికారులను, సైనికులను తిరగబడమని ఆయన ప్రోత్సహించారు. పుట్టుకతో అంధుడైన ఆయన పోరుబాటను ఎంచుకోవడమే కాకుండా మొహర్రం పండగ సందర్భంగా తెల్లవారిపాలన తప్పక అంతరిస్తుందని ఎంతో ఆత్మవిశ్వాసంతో ప్రకటించారు. ఈ రకంగా తెలుగు గడ్డ మీద అక్కడక్కడా సాగిన తిరుగుబాట్లకు మొహర్రం పండుగ రోజును నిర్దేశిత సమయంగా నిర్ణయించటం కాకతాళీయమా? లేక మొత్తం మీద ఓ పథకం ప్రకారంగా తిరుగుబాట్లు సాగాయా? అన్న విషయం ఆసక్తిదాయకం.

ఈ నిర్ణయానికి అనుగుణంగా స్వదేశీ సైనికులను ఆకట్టుకుని తిరుగుబాటుకు షేక్ పీర్ సాహెబ్ ముమ్మరంగా సన్నాహాలు ఆరంభించారు. ఈ పథకం పూర్తిగా అమలులోకి రాకముందే, ఆయన చర్యలను పసికట్టిన బ్రిటిష్ సైనికాధికారులు పీర్ సాహెబ్‌ను అరెస్టుచేసి, విచారణ జరిపి 10 సంవత్సరాల జైలు శిక్ష విధించారు. తిరునల్వేలి ఖైదులో ఆయన జీవితం ముగిసింది.

ఈ ప్రయత్నాలలో భాగంగా మహమ్మదీయ న్యాయశాస్త్ర అధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్న మౌల్వీ సయ్యద్ అజీజ్ హుస్సేన్ ఇంటింటికి తిరిగి తిరుగుబాటుదారుల కోసం ఆహారపదార్థాలు, డబ్బు సేకరించారు. తుపాకులకు పూసే గ్రీసులో పంది, ఆవు కొవ్వు ఉంటుందన్న విషయం ప్రచారం చేసి బ్రిటిషర్లకు వ్యతిరేకంగా సైనికులను రెచ్చగొట్టారు. ఫలితంగా కంపెనీ సైన్యాధికారులు ఆయనను అరెస్టు చేసి, ఆయన కార్యకలాపాలను రాజద్రోహ చర్యలుగా ప్రకటించి, పది సంవత్సరాల జైలు శిక్ష విధించి ఆయనను కూడా తిరునల్వేలి జైలులో నిర్బంధించారు.

**ప్రజ్వరిల్లిన కృష్ణా-గుంటూరు గోదావరి సీమలు**

నిజాం గడ్డ మీద తిరుబాటు ప్రకటించినవారు, సాహసోపేతంగా నిజాంకు, అంగ్లేయులకు హెచ్చరికలు చేసిన యోధులు, ఉత్తరాదిలో జరిగిన తిరుగుబాట్లలో పాల్గొన్న వారు స్వదేశాలకు తిరిగివచ్చి అక్కడి సాహసాలను వర్ణిస్తూ కథలు కథలుగా చెప్పటంలో స్థానికులైన సాహసులలో ఆంగ్లేయుల మీద తిరగబడాలన్న బలమైన కోరిక కలిగి అక్కడక్కడా తిరుగబడ్డారు. ఈ తిరుగుబాట్లలో ముస్లిం యోధులు ముందుడగా హిందూ యోధులు కూడా బహుళ సంఖ్యలో పాల్గొన్నారు.

ఈ మేరకు 1857 జూలై మాసంలో మచిలీపట్నంలోని సిపాయిలు పెరేడ్ జరుపు మైదానం ఎదురుగా ఆకుపచ్చని పతాకాన్ని ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు ఎగుర వేశారు. అంగ్లేయులను నరికి వేయండి అంటూ హిందూస్థానిలో నినాదాలు రాసిన ప్లేకార్డు కూడా ఆ జెండా కర్రకు కట్టి ఉంది. ఈ దృశ్యం ఆంగ్లేయాధికారులలో కలవరానికి కారణమైంది. నిందితులను పట్టుకున్న వారికి 500 రూపాయాల బహుమానం ప్రకటించారు. అధికారులు ఎంత ప్రయత్నించిన ఆ దృశ్యాన్ని రూపొందించిన సాహసుల ఆచూకిని ఏ మాత్రం కనిపెట్టలేకపోయారు.

1857 నవంబరు 7న కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలోని ప్రభుత్వ కచేరి మీద దాడి జరిగింది. ఆయుధాలు చేపట్టిన నాలుగు వందల మంది రోహిల్లాలు కచేరి ఆవరణలోకి దూసుకొచ్చారు. ఆసమయంలో కంపెనీ సైనికుల ప్రతిఘటన అంతగా లేకపోవటంతో కోశాగారంలోని నగదును, ఆయుధాగారంలోని ఆయుధాలను స్వంతం చేసుకున్నారు. ఈ సాహసకృత్యంలో హిందూ-ముస్లిం యోధులు పాల్గొన్నారు. ఈ ఆకస్మిక దాడికి కంపెనీ అధికారులు హడలిపోయారు.

1857 ఆగస్టు 21వ తేదిన ప్రథమస్వాతంత్ర్య సమరయోధుడు రహింబేగ్ ను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. మొహరం పండుగ సందర్భంగా రహింబేగ్ తిరుగుబాటుకు సిద్దమయ్యారు. ఆ రహస్యం బయటపడటంతో బేగ్‌ను ఆయన సహచరులు ఖాజీ మున్‌దార్‌దార్ అలీ, హుసైన్ బేగ్, షబిబ్ బేగ్, మీరా హుస్సేన్, సిలార్ ఖాన్, మీర్ లుబ్బా ఖాన్, మీర్ వజీర్ అలీ, గాలిబ్ బేగ్, ముస్తాబ్ సాహెబ్, ఖాద్ ముహమ్మద్ అలీ ఖాన్ అలియాస్ దాదా సాహెబ్ తదితరులను అరెస్టు చేశారు. ఈ తిరుగుబాటును ప్రస్తావిస్తు ఆగస్టు 22వ రాజమండ్రిలోని అధికారి మద్రాస్‌లోని ప్రధానకార్యదర్శికి రాసిన లేఖలో భారి కుట్రను మొగ్గలోనే తుంచగలిగామని చెప్పుకున్నాడు. ఈ తిరుగుబాటు కేవలం రాజమండ్రి వరకు పరిమితం కాలేదని, మచిలీపట్నం, గుంటూరు జిల్లాలను కూడా కలుపుకుని ప్రజలను రెచ్చగొట్టి ఒకేసారి తెల్లవారి మీద తిరుగబడేందుకు పెద్ద వ్యూహం పన్నారని, ముసల్మాన్లు ఇందులో ప్రధాన పాత్ర వహించారని ఆ అధికారి వివరించాడు.

ఈ వార్తతో గుండెలదిరిన అధికారులు ముప్పు కొద్దిలో తప్పిపోయిందని భావిస్తూ అప్రమత్తులై ఉండాల్సిందిగా ఇతర ప్రాంతాల అధికారులకు వర్తమానం పంపారు. అనుమానితుల పట్ల కర్కశంగా వ్యవహరిస్తూ దాడులు చేసి అరెస్టులను ముమ్మరంచేశారు. ఈ అరెస్టులలో 14 సంవత్సరాల సయ్యద్ లాల్ ఉండటం విశేషం. ఈ యోధుడు 7 సంవత్సరాల కారాగార శిక్షకు గురయ్యారు. ఈ విధంగా గుంటూరు, కృష్ణా గోదావరి మండలాలలో ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ప్రభావం తీవ్రంగా కన్పించింది.

**ఉత్తర హిందూస్థానం వెళ్ళిన యువకులు**

స్వస్థానంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొనటమే కాకుండా, ఉత్తరహిందూస్థానంలో యోధులు సాధిస్తున్న విజయాల గురించి విన్న రాయలసీమ యువకులు ఉత్తర హిందూస్థానం కూడా వెళ్ళారు. ఈ మేరకు రాయలసీమ ప్రాంతం నుండి పలువురు ముస్లింలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న తిరుగుబాటుదారులతో కలసి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో పాల్గొనేందుకు ఉత్తర హిందుస్థాన్‌కు వలస వెళ్లారని అప్పటి కడప మెజిస్ట్రేట్ మద్రాస్ గవర్నర్‌కు 1857 జూన్20న రాసిన లేఖలో పేర్కొన్నారు.

ఈ మేరకు స్థానికుల మీద నిఘాను పెంచిన ప్రభుత్వం ముస్లిం యువకుల పట్ల క్రూరంగా వ్యవహరించింది. ఈ విధంగా 1857 నాటి పోరాటంలో బ్రిటిషర్ల మీద తిరగబడిన జనులు, జవానులు అనేకులున్నారు. ఆ వీరులందరి చరిత్రలు నమోదుకు నోచుకోకపోవటంతో ఆ యోధుల వివరాలు కాలగర్భంలో కలసిపోయాయి.

**కలవరం కలిగించిన ఐక్యత**

ఆనాడు హిందూ-ముస్లిం ప్రజానీకం మధ్య నెలకొన్న బలమైన ఐక్యతను చూసి పాలకులు కలవరం చెందారు. ఈ ఐక్యతను విచ్ఛినం గావించనిదే తమ పాలనకు మనుగడలేదని గ్రహించి భారత దేశంలోని ప్రధాన సాంఘిక జనశ్రేణులైన హిందూ-ముస్లింలను మతం పేర వేరుచేయటానికి ఎత్తులను, కుయుక్తులను యదేచ్ఛగా సాగించారు. బ్రిటిష్ పాలకులు ఎంతవరకు వెళ్లారంటే ముస్లింల పాలనకంటే బ్రిటిష్ పాలన కడుమెరుగైనదన్న మానసిక భావన ముస్లిమేతర జన సముదాయాలలో కలుగజేసేందుకు చరిత్రను వక్రీకరించి రాసేందుకు పూనుకున్నారు. గత ముస్లిం పాలకుల వ్యతిరేకంగా చరిత్రను తిరగ రాయించుకున్నారు. చిత్రణకు గురైన చరిత్రకు బహుళ ప్రచారం కల్పించారు. ఈ మేరకు ఇలియట్, డౌసన్, మాల్కం, బ్రిగ్స్, ఎలిఫిన్ స్టోన్ లాంటి అధికారులను, చరిత్రకారులను చరిత్ర వక్రీకరణకు, తాము ఆశించిన లక్ష్యాలను సాధించుకునే విధంగా చరిత్ర రచనకు నియమించారు. ఆ సమయాన విలియం హంటర్ లాంటి అధికారులు 'ఇండియన్ ముస్లింలు' అను గ్రంథాన్ని రాసి ముస్లింలకు అనుకూలంగా ప్రభుత్వం చేపట్టాల్సిన పలు చర్యలను వివరిస్తూ, ముస్లింలు ప్రత్యేక జాతి జనులుగా పేర్కొన్నాడు.

ఆ విధంగా వక్రీకరణ, చిత్రీకరణలకు గురైన చరిత్ర ఆధారంగా ఆ తరువాత కాలంలో భారత చరిత్ర రచన సాగటం వలన సహజంగానే స్వదేశీ చరిత్రకారులు ఆ ప్రభావానికిలోనై, ముస్లింలు సాగించిన బ్రిటిష్ వ్యతిరేక వీరోచిత గాథలను విస్మరించారు.

ఈ ప్రయత్నాలు చాలా వరకు బ్రిటిషర్లకు అనుకూల ఫలితాలనిచ్చాయి. ఆనాడు బ్రిటిషర్లకు ఉపయోగపడిన ఆ రచనలు ఈనాడు కూడా ముస్లిం వ్యతిరేక శక్తులకు ఉపయోగపడుతున్నాయి. ముస్లిం జనావళికి వ్యతిరేకంగా అపోహలు, అపార్థాలు సృష్టించి ప్రచారంగావించే శక్తులకు, వ్యక్తులకు ఈ గ్రంథాలు ప్రధానంగా ఆధారం అవుతున్నాయి. ఈనాటికి కూడా ఆయా గ్రంథాలలోని అంశాలను ప్రధానంగా ఉటంకిస్తూ విద్వేష ప్రచారానికి ఉపయోగించుకుంటున్నారు. చరిత్రలో మంచి చెడు రెండూ ఉంటాయి. చెడును గురించి ప్రచారం చేస్తూ విభిన్న సామాజిక సముదాయాల మధ్య విద్వేషాలు రెచ్చగొట్టే కంటే, మంచి గురించి తెలిపి ఒకరి పట్ల మరోకరిలో గౌరవభావాలను ప్రోదిచేసి సద్భావన తద్వారా సదవగాహన, సామరస్యం, స్నేహభావం కలిగించటం అందరికీ శ్రేయస్కరం. ◆

# తెలుగు సినిమా వజ్రోత్సవం

– కాశ్యప్

తెలుగు సినిమా వజ్రోత్సవానికి, లండన్‌లో బిగ్‌బ్రదర్ రియాలిటీ షోలో శిల్పాశెట్టి విజయానికి సంబంధం లేకపోయినా రెండు చోట్లా వినోదం వెర్రి తలలు వేయడం వరకే పరిమితమైనా సమాజానికి సంబంధించి చర్చించాల్సిన అంశాలు చాలా ఉన్నాయి. మొదట వజ్రోత్సవం చూద్దాం.

ఎన్టీఆర్ పురుడు పోసిన తెలుగుదేశం పార్టీ ప్రస్తుత అధ్యక్షుడు చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉండగా ఇలాంటి వజ్రోత్సవం జరిగి ఉంటే అది కాస్తా ప్రభుత్వపండగగా మారి ఉండేది. మొదటిరోజు అక్కినేని నాగేశ్వరరావుతో పాటు తెలుగు పలకడం కూడా రాని కొత్త హీరోయిన్‌లు జ్యోతి ప్రజ్వలనానికి వేదిక మీద ఉన్నా, అక్కడే ముందు వరుసలో కూర్చున్న ఆంధ్రప్రదేశ్ ఫిలిం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ – ఎఫ్.డి.సి. అధ్యక్షుడు ఘట్టమనేని ఆదిశేషగిరిరావు పంక్తికి పనికి రాకుండాపోయారు. ప్రభుత్వం పట్టించుకోలేదు కాబట్టి సినీ పరిశ్రమ కూడా ప్రభుత్వాన్ని గుర్తించలేదు – చెల్లుకుచెల్లు కాబట్టి సరిపోయిందనుకోవాలి. నెత్తిన పద్మ అవార్డుల కీర్తి కిరీటాల కోసం ఇదే ప్రభుత్వంలో పెద్ద తలకాయల చుట్టూ ఎవరెన్ని ప్రదక్షిణలు, రాయబారాలు, వేడుకోళ్లు చేశారో లోకానికి, అందునా వీరాభిమానులకు తెలియకపోవడమే మంచిది.

ప్రభుత్వ దయాదాక్షిణ్యాల మీద సినీ పరిశ్రమ ఆధారపడి లేదు. పరిశ్రమ చల్లని చూపుల కోసమే చంద్రబాబు నాయుడంతటి వారు ప్రాధేయపడినప్పుడు రంగుల లోకానికి అలాంటి అభిప్రాయం ఉండడంలో తప్పులేదు. 75 వసంతాల తెలుగు సినీ పరిశ్రమ వెలుగు జిలుగులు సామాన్యమైనవి కావు. తెలుపు నలుపు తెరకాస్తా రంగులు పులుముకునేంత వరకు ఎవరూ వేలెత్తి చూపడానికి వీల్లేని దృశ్యకావ్యాలు మన సినిమాలు. తరువాత ఇమేజీ చట్రంలో ఇరుక్కపోయి హీరో క్రీనీడలో కథ మృగ్యమైన దయనీయ పరిస్థితిలో తెలుగు తెరలో వెలుగు లోపించింది. నిర్మాతకు గౌరవం డేలైట్లు వేసి వెతకాలి. హీరో ఒక్కడు ఆకాశంలో ఇక అందరూ అధఃపాతాళంలో. ఆ హీరోకు కాస్తా అలవిమాలిన రాజకీయ అభిప్రాయాలు. అవన్నీ కథలో, కథనంలో ప్రతిఫలించాలి. సదరు హీరో రాజకీయాల్లోకి వస్తే ఎన్టీఆర్ కూడా ఎందుకూ కొరగాడని మహాభారతాన్ని ప్రస్తావిస్తూ డైలాగులు రాయాలి. వంశ పురాణం, తాత, తండ్రులు వారి మీసాల సంపెంగ నూనె ఘుమఘుమలను కీర్తిస్తూ హీరో చేత తొడగొట్టించాలి. మద్యం కిక్కులో బయటపడ్డ ఒక్క తూటా దెబ్బకు నిమ్స్‌లో కాకర్ల దయవల్ల, ఎరగ్రడ్డ ఆసుపత్రి వైద్యుల అమేయ నైపుణ్యం వల్ల జైలు ఊచలు లెక్కపెట్టకుండా ఆసుపత్రి పరుపు మీది నుంచి నేరుగా ఇంటికెళ్లి పరువు దక్కిందనుకున్న హీరో కంటిచూపుతో విలన్‌లను నరికేలా కథనడపాలి. హీరో చిటెకె వేస్తే విలన్ వంట్లో ఎముకలు విరిగి ఏ ముక్క ఎక్కడుందో వెతుక్కోవడానికి వారం పట్టుదని కృష్ణా జిల్లా కులం యాసతో పాటు పలికించాలి.

ఎప్పటికైనా ఎన్టీఆర్ చరిత్రను తిరగరాయాలని పగలూ రాత్రీ పరితపించే కథానాయకుడి సామాజిక సేవకు స్తోత్ర పారాయణంతో తెలుగు చానెళ్లు రక్తం ధారపోయాలి. సూరిబావ, మొద్దుశీను లాంటి సమకాలీన అంశాలను ప్రస్తావిస్తూ ఎంతో కొంత ప్రభుత్వ వ్యతిరేకతను పెంచిపోషించి స్వామికార్యం, స్వకార్యం నెరవేరిందని సైనిక నిర్మాతలు పరస్పరం భుజం తట్టుకోవాలి. సినిమా ఎన్ని రోజులు ఆడిందని కానీ, సినిమాలో కథకు, కథనానికి, పాత్రలకు సంగీత, సాహిత్యాలకు ప్రేక్షకులు ఎన్ని మార్కులు వేశారని కాని పట్టించుకోకుండా ఎన్ని ప్రింట్లతో రిలీజైందన్న ఒకే ఒక్క కొలమానంతో తెలుగుతెర రోజురోజుకు కుంచించుకుపోతోంది.

ఇన్నాళ్లు హీరోయిన్‌లే బట్టల్లేకుండా బాధ్యతాయుతంగా నటించేవారు. కండలు తిరిగిన దేశముదుర్లు రంగం మీదికి వచ్చేసరికి హీరోల వంటిమీదకూడా నూలుపోగు ఉండడానికి వీల్లేకుండాపోయింది. పైగా సెన్సారు వారికి ఇన్నాళ్లూ కళ్లు మాత్రమే లేవనుకోవాల్సి వచ్చేది. తాజాగా వారి చెవులు కూడా పనిచేయడం లేదనడానికి లెక్కలేనన్ని ఉదాహరణలు. దేశముదురులో హీరోయిన్ తన మట్టి శరీరాన్ని ఎందుకు ప్రేమిస్తున్నావంటూ హీరోను అడుగుతుంది. మట్టి శరీరమే కదా రాత్రికి నా పక్కన పడుకుంటావా అని హీరో పరమ పవిత్రంగా, గుండె లోతుల్లోనుంచి, గంటకొట్టినట్లు టక్కున అడుగుతాడు. పక్కన పడుకుంటావా అన్న ప్రశ్న దగ్గర సెన్సారు వారు అభ్యంతరం చెబితే ఆడియో తగ్గించినట్లు ఏదో మాయ చేశారని స్పష్టంగా తెలుస్తుంది. పైరసీ మీద దాడులు చేసే హీరోలు ఇలాంటి మాటలను అందునా ప్రేమను వ్యక్తపరిచే తొలి సంభాషణలో ఎలా ఉపయోగిస్తారో వారి విజ్ఞతే చెప్పాలి.

హీరోల మధ్య అభిప్రాయ భేదాలు ప్రత్యక్ష ప్రసారంలో ప్రేక్షక దేవుళ్లందరూ చూశారు కాబట్టి ఆ అంశం చిరంజీవిగా ఉంటుంది. దాన్ని గురించి ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది.

తెలుగు తెరకు ఎన్టీఆర్ మకుటంలేని మహారాజు అనుకుంటే తప్పులేకపోవచ్చుకానీ, ఎస్వీయార్, సావిత్రి, జగ్గయ్య లాంటి వారిని పూచికపుల్ల కంటే హీనంగా చూడాల్సిన అవసరం లేదు. ఒక సన్నివేశంలో ఎన్టీఆర్ ఆవేశానికి "... ఛీ... బానిసలు... బానిసలకింత దురహంకారం" అన్న ఎస్వీయార్ ఒక్క మాటను మెడమీద తలకాయ ఉండి అభినయం, ఉచ్ఛారణ, సందర్భ శుద్ధి తెలిసిన తెలుగువారు ఎప్పటికైనా మరచిపోగలరా? సావిత్రి చరమాంకం ఎంత దయనీయమయిందయినా, ఆమె పేరు నుండి మహానటి అన్న మాటను ఎవరైనా తొలగించగలరా? తెరపైనా, తెరబయట కొంగర జగ్గయ్య ప్రతిభాపాటవాలను తక్కువ చేయడానికి వీలుందా? ఇంకా ఇలాంటి వారినెందరినో తెలుగువారు ఇప్పటికీ ప్రేక్షకులు తమ ఇంటి మనుషుల్లానే చూసుకుంటున్నారు. సినీ నిర్మాణ, దర్శకత్వం మొదలు నిష్పాక్షిక విమర్శ

దాకా నిఘంటువులనదగ్గ వారికి కనీసం వరుసగా పేర్లు చదివి అసెంబ్లీ లాగా సామూహిక నివాళి ఇవ్వడం కూడా మన పరిశ్రమ లెజెండ్లకు కష్టమైంది. ఎవరు సెలెబ్రిటినో, ఎవరు లెజెండో గింజుకోవడానికే మనవారికి సమయం సరిపోలేదు.

తెలుగు సినీ పరిశ్రమకు పొగడ్తలే తప్ప చిన్నపాటి నిర్మాణాత్మక విమర్శనైనా భరించే సహనం, బాధ్యత మరచిపోయి దశాబ్దాలు కావస్తోంది. ఏ ఛానల్‌లో అయినా, ఏ పత్రిక సినిమా పేజీ అయినా ఆకాశమే హద్దుగా పొగడ్తలే పొగడ్తలు. ట్రయిలర్లు, కలర్ యాడ్స్ కోసం కొత్త మార్కెట్ సూత్రాలు కనిపెట్టి సినిమాకు బాకాలు ఊదడంలో మీడియా బట్టలు చించుకుని పోటీ పడుతుంటే ప్రేక్షకులు, పాఠకులు పక్షపాతంతోనో, పక్షవాతంతోనో విలవిలలాడ్డం తప్ప చేయగలిగింది లేదు. అవతల హిందీ, ఇంగ్లీషు సినిమాలను దూదేకినట్లు విమర్శిస్తుంటే తెలుగు సినిమాకు మాత్రం కనీసం సద్విమర్శ కూడా అంటరానిదై పోయింది. అన్నీ తెలిసినవారు కూడా తెలుగును వదిలి అమితాబ్ కీర్తి ప్రభలు, హేమమాలిని ఔన్నత్యం గురించి పులకరించగలరే కానీ, తెలుగుతెర పోకడ గురించి పల్లెత్తు మాట కూడా అనలేరు. సినిమాను సామాజిక కోణంలో నిశితంగా, నిర్మాణాత్మకంగా విమర్శించిన ప్రముఖ జర్నలిస్టులు ప్రస్తుతం ఒక రకంగా అస్త్ర సన్యాసం చేశారు.

సినిమా జర్నలిస్టుల రిపోర్టింగ్ తీరుతెన్నుల గురించి మామూలు జర్నలిస్టులు చెబుతుంటే వినడానికి రెండు చెవులు చాలవు. హీరో, హీరోయిన్‌లు–దేవుళ్లు, దేవతలు; పరిశ్రమ దైవం; పరిశ్రమ పెద్దలందరూ మీడియాకు దగ్గరి బంధువులు, మహారాజ పోషకులు. అదంతా అందరికీ తెలిసినా ఎవరూ ఏమీ మాట్లాడుకోవడానికి వీల్లేని ఒక వింత ప్రపంచం. ఉద్యోగాన్ని రక్షించుకోవడానికి మించి జర్నలిజంలో పాటించదగ్గవిలువ ఇంకొకటి ఉండదానికి వీల్లేదు. అదంతే.

ఒక దర్శకుడు నటులను షూటింగ్ సెట్లోనే కొడతానని ప్రత్యక్ష ప్రసారాల తేజోవలయాల మధ్య సగర్వంగా చెప్పుకుంటూ ఉంటాడు. అతని తేజస్సు ఔత్సాహిక దర్శక, నిర్మాతలకు ఆదర్శం. ఇంకో నిర్మాత తను అభిమానించే హీరో ప్రసాదించిన తుపాకి తూటాను పొట్టలో దాచుకుని జన్మను చరితార్థం చేసుకుంటాడు. మరో ఎమ్మెల్యేకమ్ నిర్మాత అందరూ చూస్తుండగానే ట్యాంక్‌బండ్‌లో పట్టపగలు దూకి ప్లీజ్ ఏమడగవద్దు అని మీడియా కెమెరాలకు నమస్కారం పెడతాడు. కె. విశ్వనాథ్‌లు, శేఖర్ కమ్ములలు, ఆర్. నారాయణమూర్తుల సినిమాలకు విలువ తగ్గకపోవచ్చు కానీ వ్యాపారం గురించిపెద్దగా మాట్లాడుకోవడానికి ఏమీ లేదు. అలాగని కలెక్షన్‌లను అశ్వవేగాలతో వైజయంతి రాగాలతో దౌడు తీయిస్తామని భీష్మ ప్రతిజ్ఞలు చేసే మహా నిర్మాతలు కూడా వడ్డీలు కట్టడానికే కొత్తగా అప్పుల కోసం వెంపర్లాడుతున్నారనడానికి ట్యాంక్ బండ్‌లో ఆత్మహత్యా ప్రయత్నాలే ప్రత్యక్ష ఉదాహరణలు.

ఒక్కో మెగాసినిమాపై పాతిక, ముప్పయ్ కోట్లు పెట్టి మేఘాలయ లాటరీ మిస్ అయినట్లు నిర్మాత నెత్తిన గుడ్డవేసుకుని ఎందుకు దేశాలు పట్టుకుని తిరుగుతున్నాడన్న చర్చకు వజ్రోత్సవాల్లో చోటులేదు. ఇప్పటికీ చంద్రముఖి, అపరిచితుడు లాంటి సినిమాలకు బలం, ఆకర్షణ కథేనన్న కనీస జ్ఞానం పొరుగున తమిళ పరిశ్రమకుంటే మనం మాత్రం బొంబాయి నుండి తెల్లతోలు ఆపాదమస్తకం ప్రదర్శించగల వారి కోసం వెంపర్లాడుతుంటాం. హీరో తప్ప ఇక మిగిలిందంతా పిపీలికానికన్నా హీనంగా చూపాల్సిన గురుతర బాధ్యతను మీద వేసుకున్న తెలుగు పరిశ్రమలో ప్రయోగాలు చేయగల, చేవగల తలకాయలు లేక కాదు, వారిని ఒకరకంగా ప్రేక్షకులే దూరం చేసుకుంటున్నారు.

సమాజానికి కళ ద్వారా ఎంతో కొంత దిశానిర్దేశం చేయాలన్న తపనో, బాధ్యతో పరిశ్రమలో లోపించిందనిపించినప్పుడు, పరిశ్రమకు దారిచూపాల్సిన బాధ్యత ప్రేక్షకులది. లేకపోతే బ్లూఫిలింల బూతు మన సినిమాల కాలిగోటికి కూడా సమానం కాని రోజు త్వరలోనే వస్తుంది.

పవర్‌స్టార్ అనుకునే పవన్‌కళ్యాణ్ హైదరాబాద్‌లో డెక్కన్ క్రానికల్ కార్యాలయం ముందు సినీస్టయిలులో కుడి ఎడమల మీడియా వీడియో, స్టిల్ కెమెరాల సాక్షిగా ఎందుకు ధర్నా చేశారో లోకానికి తెలియనిది కాదు. మీడియా మీద ప్రత్యక్ష దాడినే హీరోయిజంగా భావించే స్టార్‌లు సహచరులతో ఎంత సంయమనంగా ఉంటారో, వృత్తిలో ఎంత ప్రజాస్వామికంగా ఉంటారో ఊహించవచ్చు. "రాస్తే రెండు మూడు రోజులు రాస్తారు... తరువాత ఏం చేయగలరు...", "వజ్రోత్సవం ప్రేక్షకులకు సంబంధించింది కాదు... లైవ్‌లో చూసుకోవాలంతే... లెక్కలు చెప్పాల్సిన పనిలేదు" లాంటి వజ్రోత్సవ నిర్వహణ కమిటీ కన్వీనరు మాటలు మచ్చుతునకలైనా, వజ్రోత్సవ వేదికపై మాటీవి కెమెరాల్లో మోహన్‌బాబు ప్రసంగం రికార్డయినా, చిరంజీవి ఆవేశం, ఆవేదన మాత్రమే ప్రసారం కావడమైనా తెలుగు సినీపరిశ్రమ తెగుళ్లను తెరలుతెరలుగా ప్రేక్షకులకు చెప్పకనే చెబుతున్నాయి. మర్రి చెట్టులా పాతుకుపోయి సినీ వ్యాపారంలోని అన్ని శాఖల్లోకి శాఖోపశాఖలుగా విస్తరించిన తెలుగు హీరో కళ్లు తెరవడు, అభిమానులు తెరవనీయరు– ప్రేక్షకులు కళ్లు మూసుకున్నారు. ప్రేక్షకుల చెమటతో చలువరాతి మేడల్లోకి మారిన సినీ దేవుళ్లు మరో సమాజంలో ప్రేక్షకులను ఇంతగా అవమానిస్తే పరిణామాలు ఇంకోలా ఉండేవి. మన చర్మం ఎద్దుకంటే మందం – అదే సినీ పరిశ్రమకు అందం–ఆనందం.

**మేరా భారత్ మహాన్**

లండన్ వేదికగా జరిగిన సెలెబ్రిటీ బిగ్‌బ్రదర్ రియాలిటీ షోలో శిల్పాశెట్టి గెలవకపోయి ఉంటే నూట ఎనిమిది కోట్ల మంది భారతీయుల ఆత్మగౌరవాన్ని బకింగ్‌హామ్ ప్యాలెస్ మెయిన్ గేటు ముందు తాకట్టు పెట్టినట్లయ్యేది. 1947 ఆగస్టు 15న ఢిల్లీ ఎర్రకోటపై బ్రిటిష్ పతాకం దిగి మనమువ్వన్నెల జెండా రెపరెపలాడిన క్షణం కటే శిల్పాశెట్టి గెలిచిందన్న వార్త మన మహానగరవాసులకు, భారతీయ న్యూస్ ఛానెళ్లకు మహోద్విగ్నక్షణం. పైగా పేజ్–3 (తాతలు, తండ్రులు సంపాదించిన దిక్కులేని ఆస్తిని లేదా తామే సంపాదించిన ఆస్తిని పార్టీల పేర హారతి కర్పూరం చేస్తూ మరుసటిరోజు ఉదయాన్నే తమ అర్ధనగ్న, మద్యం గ్లాసు సహిత ఫోటో ఇంగ్లీషు డైలీలో ప్రింట్ అయ్యిందో లేదో చెక్ చేసుకునే వారిని పేజ్ - త్రీ పక్షులు అందురు) నుండీ శిల్పాశెట్టి పేజ్–1 (పత్రికల్లో మొదటి పేజీకి) కు వచ్చినందుకు జాతీయ ఛానెళ్లు జాతీయతా భావంతో నిలువెల్లా పులకించిపోయాయి. మెట్రోయువత ఎవరెస్టును ఎడమకాలితో తన్నినంత గర్వంగా సంబరపడింది.

ఒకరకంగా బిగ్‌బ్రదర్ షోలో భారతీయతను కించపరుస్తూ

# స్త్రీల అస్తిత్వాలకు కొత్త సవాళ్లు

- వి. ప్రతిమ

*(గత సంచిక తరువాయి..)*

లైంగిక వేధింపులంటే ఇక్కడ కేవలం రేప్ మాత్రమే కాదు, బూతు జోకులతో కన్నుగీటడం, గిల్లడం, తడమడం, గుద్దడం ఇంకా లైంగికంగా మాటలతో వేధించడం, స్త్రీలను నీచంగా చిత్రించే అశ్లీల సాహిత్యం, వ్యాపార కార్యకలాపాలతో కూడిన వ్యభిచారం, రికార్డ్ డ్యాన్సులు, నగ్న ప్రదర్శనలు వంటి వన్నీ కూడ లైంగిక వేధింపుల కిందికే వస్తాయి.

ఇవన్నీ ఇదివరకటికంటే కూడ స్త్రీలు, పురుషులు సమానస్థాయిలో కలిసి పనిచేస్తోన్న ఇవ్వాల్టి కార్పొరేట్ ఆఫీసుల్లో మరింత సర్వసాధారణమై పోతున్నాయి. టూర్లకి వెళ్లాల్సి వచ్చినప్పుడు వెంటరమ్మని వేధించడం వంటివి కూడ చాల ఎక్కువగా ఉంటున్నాయి. కాదంటే బెదిరింపులుండనే ఉన్నాయి.

మరోవంక యాభైయేళ్ల వయసుల్లో కూడ స్త్రీలు భర్త వైవాహికేతర సంబంధాలను తట్టుకోలేక ఆత్మహత్యలు పాలవుతున్న పరిస్థితులివ్వాళ సమాజంలో ఉన్నాయి.

ఈ కార్పొరేట్ కంపెనీలలో యథేచ్ఛగా జీవితాన్ని అనుభవించగలిగే సౌకర్యాలు కల్పించడం, విదేశాలను అనుకరిస్తూ అపరిమితమైన స్త్రీ, పురుష మానసిక స్వేచ్ఛ, ప్రోత్సాహం, నిర్భీతి మూలంగా భర్తల వైవాహికేతర సంబంధాలు విపరీతంగా పెరిగిపోయి ఆ నిర్లక్ష్యాన్ని, మానసిక హింసనీ తట్టుకోలేక అనేక మంది స్త్రీలు ఒంటరి శోకదేవతలవుతున్నారు. మరికొందరు ఆత్మహత్యల నాశ్రయిస్తున్నారు.

స్త్రీల శారీరక మానసిక శక్తులన్నింటినీ పీల్చిపిప్పిచేసి వాళ్లని ప్రభుత్వ లక్ష్యాలకణుగుంగా ఆలోచించేలా చేయడం ప్రపంచీకరణ లక్ష్యం.

స్త్రీల వ్యక్తిత్వానికే కాక అవయవాలకు కూడ ఆంక్షలు విధించే క్రమంలో గర్భసంచులు కూడ మినహాయింపు కాదు.

"కణాలను భద్రపరిచిన కడుపుకోరేటు
నవమాసాల తిండికీ కుటుంబ జీవితానికి
దూరంగా ఉండడానికోరేటు
పొత్తిళ్లలోని పాపాయిని కత్తిరించిన పేగుముడిలా
నడిచివెళ్లిపోయే కాటు
టెస్ట్‌ట్యూబులు, అద్దె మాతృత్వాలు, క్లోనింగ్‌లూ
పేరేదైతేనేం?.. విజ్ఞానం రెండంచుల కత్తిలా కోసుకుపోతుంది
తల్లి బిడ్డల వేర్పాటు నాటకం మొదలయింది..." అంటూ స్త్రీలు తమ గర్భాశయాన్ని అద్దెకివ్వాల్సి వచ్చే ఒక పరిస్థితిని హృదయ విదారకంగా చిత్రిస్తోంది శిలాలోలిత ఒక కవితలో. మాతృత్వాన్ని కూడ అత్యంత సహజమయిన, మామూలు విషయంగా కొట్టిపారేయడమనే భావనలోకి స్త్రీలని నెడుతోంది ఈ వ్యాపార సంస్కృతి. ఇంతకుముందే చెప్పుకున్నట్లుగా స్త్రీలలోని సౌకుమార్యాన్ని దెబ్బతీసి రాటుదేల్చేస్తుంది.

స్త్రీలు ఒకప్పుడు పోరాడి సాధించుకున్న కొద్దిపాటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పునాది కూడ ఈ ప్రపంచీకరణ నేపథ్యంలో

---

మాట్లాడిన గూడీ లేకపోతే శిల్పాశెట్టికి విజయం దక్కేదే కాదు. ఆ తరువాత గూడీ క్షమాపణ చెప్పింది కానీ, శిల్పాశెట్టి మాత్రం అలాంటిదేమీ లేదు - ఒకవేళ అని ఉన్నా అదో పెద్ద విషయం కాదన్నట్లు మాటమార్చింది. రియాలిటిషోలో కన్నీళ్లతో శిల్పాశెట్టికి మార్కులకు మార్కులు. సానుభూతికి సానుభూతి; డబ్బుకు డబ్బు; విజయానికి విజయం. మధ్యలో భారతీయ ఆత్మగౌరవానికి అపచారం జరిగిందని గుండెలు బాదుకున్న వెర్రివెంగళప్పలు, వెంగళమ్మలు, ప్రభుత్వం తరఫున కూడా తీవ్రంగా స్పందించిన పెద్ద మనుషులే అమాయకులు. కందకు లేని దురద కత్తికి ఉండడమంటే ఇదే.

ఒక్క తిట్టును భరించినందుకు శిల్పాశెట్టికి అక్షరాలా మూడుకోట్ల ఎనభై లక్షల రూపాయలు వచ్చి ఒళ్లో వాలాయి. వాడకో పది టీవి ఛానెళ్లు పుట్టుకు రావడంతో సరికొత్త వినోద కార్యక్రమాలతో రేటింగ్స్ పెంచుకోవాల్సిన బాధ్యత యాజమాన్యాలపై పడింది. దాంతో ఇక నీతి, రీతి, నియమాలు, సంప్రదాయాలు, సమాజంలో విలువలు అన్నీ పాత చింతకాయ పచ్చడి పనికిరాదు. ఎంతగా అవతలివారిని గేలిచేయగలిగితే, అవమానించగలిగితే, ఇరుకున పెట్టగలిగితే అంతగా చప్పట్లు - టిఆర్‌పి రేటింగ్స్.

అత్తా కోడళ్ల మధ్య నిరంతర రోదనలతో సాగే సీరియళ్లయినా, ఇద్దరు ముగ్గురు భార్యల మధ్య తమిళ వేషభాషలతో దిగుమతి అయ్యే అనితర సాధ్యమైన డబ్బింగ్ సీరియళ్లయినా, రియాలిటీ షోలయినా... పళ్లూడగొట్టుకోవడానికి ఏరాయి అయినా ఒకటే.

ఇప్పుడే ఇలా ఉంది టివి వినోదం. మీడియాలో 26 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడికి తలుపులు బార్లా తెరవడంతో రామోజీరావు సంస్థ ఉషోదయాలో బ్లాక్‌స్టోన్ పెట్టినట్లే బాలాజీ టెలీఫిలిమ్స్‌లో స్టార్ టివి 26 శాతం వాటాను వందకోట్లకు కొనుక్కుంది. అత్తాకోడళ్ల పసుపుగొట్టు తరగని తుమ్మజిగురు సీరియళ్లు తీయడంలో తనకు తానే సాటి అయిన బాలాజీ టివి ఫిలిమ్స్ ఛానెల్‌ను బలపరుచు కోవాలనుకుంటోంది. సహజంగా బాలాజీలో స్టార్ భాగస్వామి కావడంతో బాలాజీ టెలిఫిలిమ్స్‌కు సన్‌టివి లేదా జెమినీటివితో సంబంధాలు తెగిపోతాయి. ఒక్కదెబ్బకు రెండు పిట్టలు. మీడియా వ్యాపారం ఇలా అఘోరిస్తున్నప్పుడు ఇన్నాళ్లూ తమిళవాళ్లు మనమీద సీరియళ్లు రుద్దడమేమిటని బాధపడేవాళ్లం. ఇప్పుడా బాధ్యత స్టార్‌టివి రూపర్ట్ మర్డోక్ మీద పడింది. ఇక మర్డోక్ దయ-మనప్రాప్తం. జై శిల్పా-జైజై మర్డోక్-మేరా భారత్ మహాన్. ◆

కదిలిపోయింది. ఈ స్వేచ్ఛా మార్కెట్ ఒప్పందాల్లో స్త్రీలు పోరాటం చేసినప్పటికీ కూడ దేన్నయినా సరే అవుననే హక్కు ప్రభుత్వం చేతుల్లో నుండి ఎప్పుడో జారిపోయింది.

మద్యపానం విషయంలో కూడ అంతే. ఒకనాడు దూబగుంటలో ప్రారంభమైన మద్యనిషేధానికి దారితీసిన మహిళల పోరాటం సాధించిన విజయం కూడ ఈ మార్కెట్ ఒప్పందాలలో రూపుమాసి పోయింది. ఈ స్వేచ్ఛా విపణిలో దేన్నీ కాదనే అవకాశం ఉండదు. ఒక ఉత్పాతంలా మన జీవితాల్లోకి సమస్త కోణాల్లోకీ విస్తరించిపోయి అనివార్యంగా మనుషులందరినీ ఆ ఊబిలోకి లాగుతోంది.

పురుషుల వ్యసనాలతోనే తలలు బట్టకట్టిపోతోంటే, స్త్రీలను కూడ వ్యసనపరులను చేసే ఒక కొత్త దిశగా వ్యాపార ప్రయత్నాలు సాగుతున్నాయి. స్త్రీల కోసం ప్రత్యేకమైన సిగరెట్లు, స్త్రీలకోసం ప్రత్యేకమైన మందు, వ్యభిచారానికి లైసెన్సులిస్తామనడం, రికార్డు డ్యాన్సులకి పర్మిషన్లు, ఇలా స్త్రీలు కూడ వ్యసనపరులయితే ఈ మార్కెట్‌కి మరిన్ని లాభాలు చేకూరే అవకాశముంది.

## 5

స్త్రీల శ్రమని వ్యవసాయంలో వినియోగించుకోవడమే తప్ప ఆమెకి పంటని అమ్ముకునే స్వేచ్ఛగానీ, ఆర్థికపరమైన వెసులుబాటుగానీ ఉండదు.

మన దేశంలో, ముఖ్యంగా మన రాష్ట్రంలో అయితే వ్యవసాయంలో ఎక్కువ భాగం స్త్రీల పనే ఉంటుంది. అయినా వ్యవసాయానికి సంబంధించిన ముఖ్య విషయాలలో నిర్ణయం తీసుకోగలిగే స్వతంత్ర్యం ఆమెకి ఉండదు. సామర్థ్యం లేదంటూ పక్కకి పెడతారు. నిజానికి ఈ సమర్థత, విజ్ఞానం, పురుషుడి సొత్తు మాత్రమే కాదు. అది స్త్రీకి కూడ చెందాలి. వారికి సాంకేతిక విజ్ఞానాన్ని అందించడం ద్వారా వ్యవసాయాభివృద్ధి జరగడమే కాకుండా స్త్రీలు ఆత్మవిశ్వాసంతో స్వీయనిర్ణయాలు తీసుకుని ముందుకు సాగగలరు.

ఇక శ్రామిక వర్గస్త్రీల విషయానికొస్తే నార్లు నాటడమైనా, గింజలు విత్తడమైనా, కలుపు తీయడమైనా ఒంగి చేయాల్సి ఉంటుంది. నిరంతరం చేతులు శ్రమిస్తూనే ఉండాలి. ఉదయం నుండి సాయంత్రం దాకా పొలం నీళ్లలో నాని నాని కాళ్లు పాచిపోతాయి. ఒల్లు నలగ్గొట్టినట్లుగా నొప్పి జలుబూ, జ్వరమూ.

ఇంత చేసీ ఇంటికెళ్లి ఇంటిల్లిపాదికీ నీళ్లు కాచి తోడి, పిల్లలుంటే నీళ్లు పోసి వండి వడ్డించాలి. తమ ఆరోగ్యాల గురించి అస్సలు పట్టించుకోరీ స్త్రీలు. ప్రతీ మహిళ జీవితంలో తప్పని సరిగా సంభవించే మెనోపాజ్ భయంకర స్థితిని మామూలుగా భరించుకుంటూ వెళ్లిపోతారీ స్త్రీలు.

హరిత విప్లవం మూలంగా అత్యంత ప్రియమైపోయిన వ్యవసాయాన్ని చేయనూలేక, వొదలుకోనూలేక కొత్త అప్పులు తెచ్చే పరిస్థితులు లేక అనివార్యంగా ఆత్మహత్యల అంచులకు నెట్టబడ్డాడు రైతు.

ఇలా వ్యాపార పంటలు రైతుల జీవితాల్లోకి ప్రవేశించి రైతులను అప్పుల పాలు చేసి ఆత్మహత్యలకు ప్రేరేపించిన వైనాన్ని తెలుపుతూ నల్లూరి రుక్మిణి 'బీటలెత్తిన బీళ్లశోకం' అన్న కథ రాశారు. ఆ కథలోని ప్రధాన పాత్ర తమ కాలానికి ఇప్పటికీ వ్యవసాయం మారిపోయిన తీరుని గురించి మదనపడతాడు. 'డబ్బు' మాయావిలా ఎలా మనిషిని ఆడించి విధ్వంసానికి దారి తీస్తుందో కూడా చర్చకు వస్తుందీ కథలో.

ప్రపంచీకరణ నేపథ్యంలో విధ్వంసమైపోయిన వ్యవసాయరంగం మీద, రైతుల ఆత్మహత్యల మీద చాల కథా సాహిత్యం వచ్చింది.

అయితే ఇది పైకి చూడ్డానికి కేవలం రైతుల సమస్యగా కన్పించినప్పటికీ లోతులకి వెళ్లి ఆలోచించినప్పుడు ఇది నూటికి నూరు పాళ్లు స్త్రీల సమస్యగా మనకి అర్థమవుతుంది. రైతుల ఆత్మహత్యల తరువాత మొత్తం ఈ అప్పుల సంక్షోభాన్ని, కుటుంబ భారాన్నీ, భర్తలేక దు:ఖాన్నీ అదనంగా మోయాల్సి వస్తోన్న స్త్రీల సంగతేమిటి?

పురుషుల్లాగా పలాయనవాదులు కాదు స్త్రీలు, పిల్లల కోసమైనా వాళ్లు బతికేతీరాలి. వస్తుందో, రాదో తెలీని ఎక్స్‌గ్రేషియాల కోసం కార్యాలయాల చుట్టూ తిరిగి కాళ్లరిగించుకోవాలి.

భర్త మరణానంతర స్త్రీల దుర్భర స్థితినీ, జీవిక కోసం వాళ్లు పడే సంఘర్షణనీ వస్తువుగా తీసుకుని ముదిగంటి సుజాతారెడ్డి "జవాబులేనీ ప్రశ్నలు" గీతాంజలీ "సంటిది" అన్న కథలు రాశారు.

రైతుల ఆత్మహత్యల తరువాత స్త్రీల జీవితాలన్నీ సమాధానం దొరకని ప్రశ్నలే కదా.

## 6

మహిళాసాధికారత, మహిళాసాధికారత అంటూ పెద్ద పెద్ద మాటలు విన్పించడమే తప్ప మహిళల్లో ఎంతవరకూ సాధికారత చేకూరింది అన్నది అనుమానాస్పదమే.

73వ రాజ్యాంగ సవరణ ద్వారా స్థానిక సంస్థల పదవులలో 33.3 శాతం మహిళలకు కేటాయించబడింది. దీని ముఖ్య ఉద్దేశ్యం స్త్రీలకు సాధికారత పెంపొందించి ఇటు సమాజంలోనూ, అటు ఇంట్లోనూ తమ స్థితిగతులు మెరుగుపరుచు కోగల్గడం.

అయితే ఈ పదవుల్ని మహిళలు ఎంత వరకూ సద్వినియోగ పరుచుకోవడానికి వీలవుతోంది, నామినేషన్ వేయడం మొదలుకుని చివరికి అధికారపగ్గాలు చేతిలోకి తీసుకునేదాకా మొత్తం పురుషాధిపత్యపు నిడలోనే కొనసాగుతూండడం మనందరికీ తెలిసిన విషయమే.

ఈ స్వయం నిర్ణయాధికారం లేకపోవడం మూలంగా తమ హక్కులను తెలుసుకుని వాటిని నిలువుకోలేకపోవడం, రాజకీయాలపట్ల, అనాసక్తి, దీని మూలంగా స్త్రీలు తమకుగానీ, ఇతర మహిళలకు గానీ సాధికారత కల్పించడంలో ఎక్కువగా విఫలమవుతున్నారు.

విపరీతంగా పెరిగిపోయిన ఎన్నికల ఖర్చు కనుగుణంగా ఆర్థిక వనరులు లేకపోవడం, ఆత్మన్యూనత, తమ రక్తంలో జీర్ణింపచేయబడిన పిరికితనం, తమ హక్కులను గుర్తెరిగి వాటిని నిలుపుకోడానికి ఎదిరించి నిలబడలేకపోవడం, వీటన్నింటి మూలంగా స్త్రీలకు రాజకీయాల పట్ల అనాసక్తి. పైపెచ్చు ఇనుపరజను వేసి అంటించుకున్నట్లుగా ఉన్న కుటుంబమూ, పిల్లలూ కూడ వారిని వెనక్కి లాగుతూంటాయి.

ఇకపోతే దళిత శ్రామిక వర్గ స్త్రీలు సర్పంచులుగా ఉన్న పరిస్థితుల్లో అయితే పురుషపెత్తనం అదనంగా కులవర్గ ఆధిపత్యాలు కూడ ఆమె మీద చెలాయించబడ్తాయి. ఆ నేపథ్యంలో వారు సాధికారత సాధించలేకపోగా, ఆర్థికంగా, సామాజికంగా కూడ నష్టపోతారు. దీనికి ముఖ్యకారణం అవిద్య, రాజకీయానుభవం, లోకానుభవం లేకపోవడం, కొండాకచో కుటుంబంనించిగానీ, గ్రామ పెద్దలనించిగానీ సరయిన మద్దతు

లభించకపోవడం. వెనుకబడిన కులానికి చెందడం వంటి అనేక కారణాల వల్ల వీరు సమర్థవంతంగా రాజ్యాధికారాన్ని నిర్వహించలేక పోతున్నారు.

స్థానిక సంస్థల విషయం ఇలాఉంటే, చట్టసభల్లో ఇంకా మహిళలకు రిజర్వేషన్లు కల్పించబడకపోవడం శోచనీయం. అక్కడ స్త్రీలు వీరమాతలుగానో, వీరపత్నులుగానో మాత్రమే చట్ట సభల నలంకరిస్తున్నారు. అక్కడ కూడ మళ్లీ అవగాహనలోపం, అనుభవరాహిత్యం, ఆధిపత్యత కృంగదీస్తున్నాయి.

తాము సమాజంలో భాగమైనపుడు రాజ్యాధికారం విషయంలో కూడ తమకు హక్కులున్నాయన్న విషయాన్ని గుర్తెరిగి, రాజకీయాలపట్ల ఆసక్తీ, అనుభవమూ, శిక్షణా తీసుకుని తమ గ్రామాలలోని ప్రజల మౌలిక అవసరాలేమిటో తెలుసుకుని వాటిని తీర్చే ఆలోచన చెయ్యాలి. స్త్రీల ఆరోగ్యం, ముఖ్యంగా గర్భిణీ స్త్రీలకు వైద్య, ప్రయాణ సౌకర్యాలు కల్పించడం, వితంతు పెన్షన్ విధానం, దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న పేదలకోసం ఉచిత వైద్యం, వారి పిల్లలకు ఉచిత విద్య, అంటే పాఠశాలలు ఏర్పాటు చేయడం వంటివి తాము స్వయంగా నిర్వహిస్తు మహిళా రాజ్యాధికారులు ముందుకు సాగాలి.

స్త్రీలు రాజకీయ, ఆర్థిక, సామాజికపరమైన విషయాలలో చురుకయిన పాత్రని నిర్వహించినపుడే గుణాత్మకమైన మార్పుని సాధించగలరు.

**7**

బాలికల్ని చిన్నప్పుడే పెళ్లిళ్లు చేసి అత్తవారిళ్లకు తరమడం మరో కన్నీటి సమస్య.

ఆర్థికంగా వెనుక బడిన ప్రాంతాలయిన రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, బీహార్ వంటి రాష్ట్రాలలో బాల్య వివాహాలు ఎక్కువగా జరుగుతున్నాయి. ఒకప్పుడు బాల్యవివాహాలను రద్దు చేయడానికి, వితంతు వివాహాలను ప్రోత్సహించడానికి ఎంతగానో పాటువడిన సంఘసంస్కర్తలున్న మన రాష్ట్రంలో మళ్లీ బాల్యవివాహాలిలా విజృంభించడానికి కారణాలేమిటి?

అన్వేషిస్తే ప్రపంచీకరణ దాడితో మరింతగా పెరిగిపోయిన పేదరికం దీనికి మూల కారణంగా కన్పిస్తోంది. పేదరికం మూలంగా కొడుక్కి పెళ్లి చేసేస్తే అదనంగా కూలికి వెళ్లి సంపాదించడానికి మరోమనిషి వస్తుందని తల్లిదండ్రులు ఆశపడుతున్నారు. ఇక ఆడపిల్లల విషయానికొస్తే చిన్నప్పుడే పెళ్లి చేయడం వల్ల కట్నకానుకలు తప్పించుకోవడం, పిల్ల పోషణభారం మరి కొన్నేళ్లు వహించే సమస్య తప్పిపోవడం వంటి అనేక కారణాలు తల్లిదండ్రులను ఇందుకు ప్రేరేపిస్తున్నాయి. కారణమేదయినా ఇబ్బందుల పాలవుతున్నది మాత్రం అమ్మాయిలే.

దీనిమూలంగా బాలికలు అవిద్య, సమాజ సదుపాయాలూ, సంతోషాలకు దూరమయి బాలకార్మికులుగానే మిగిలిపోతున్నారు. మళ్లీ వీళ్లు తమ పిల్లలకు కూడ అదే విధంగా చేయడానికి ప్రయత్నిస్తారు. బాల్య వివాహాలు విషవలయంలో తరతరాలుగా కుటుంబాలు నాశనమవుతున్నాయి.

అంతేకాకుండా ఈ బాల్య వివాహాల ద్వారా జన్మించే పిల్లలు బుద్ధి మాంద్యం, అంగవైకల్యం కలిగి, అనారోగ్యం పాలయి సమాజ సమస్యయి కూర్చుంటారు.

అయితే ఈ మధ్యన శ్రీకాళహస్తిలో దేవుడి పెళ్లితో పాటుగా జరిగే సామూహిక బాల్య వివాహాలను అడ్డుకోగలగడం, ఆపడం, ఒక విజయంగా మనం భావించవచ్చు. ఇందుకు మూల కారణమైన శాంతాసిన్హా మనందరి తరఫునా అభినందనీయురాలు.

పోతే ప్రపంచీకరణ మూలంగా దెబ్బతిని పోయిన వ్యవసాయం వల్ల కరువువాత పడ్డ సీమ ప్రాంతపు పల్లెల నుండి చాలామంది రైతు కూలీ స్త్రీలు బొంబాయి, పూనా వంటి చోట్లకు వెళ్లి పడుపువృత్తి జీవికగా కుటుంబాలను నెట్టుకొస్తోన్న పరిస్థితి ఇవ్వాళ ఉంది.

అట్టడుగు వర్గాల్లో కుటుంబ బాధ్యత చాలా ఇళ్లలో స్త్రీలమీదే మోపబడుతుంది. మగాడి బాధ్యతారాహిత్యం మూలంగా అదనపు పనుల భారం కూడ వీళ్లదే.

పనుల పేరుతో దూరప్రాంతాలకు తరలించబడి దళారీల మోసాలకు గురయి ఎటూకాని పరిస్థితుల్లో తప్పనిసరిగా వ్యభిచారపు ఉచ్చులోకి లాగబడుతున్నారు. అంతే కాకుండా రహదారులకు దగ్గరగా ఉన్న గ్రామాలలోని అనేకమంది పేద స్త్రీలు పొట్టకూటి కోసం వ్యభిచారులుగా మారిపోతున్న సందర్భాలున్నాయి ఇవ్వాళ.

వీరిలో ఎక్కువభాగం స్త్రీలు ఎయిడ్స్ బారిన పడి జీవితాలని కోల్పోతున్నారు. మధ్యతరగతి, శ్రామిక వర్గ స్త్రీలని కొండచిలువలా చుట్టుకుపోయిన మరో తీవ్రమయిన సమస్య ఎయిడ్స్.

మన యిష్టా యిష్టాలతో, మన అభ్యంతరాలతో ఏమాత్రం ప్రమేయం లేకుండా ఎచ్.ఐ.వి. వైరస్ చాపకింది నీరులా మన ఇంటి ముందుకు ప్రవహిస్తూ వచ్చేసింది. అయితే ఇది కేవలం సెక్స్‌తో మత్రమే ముడిపెట్టడం వల్ల దీని గురించి మాట్లాడ్డానికి సభ్య సమాజం వెనుకడుగు వేస్తోంది. నిజానికిది రక్తమార్పిడి వల్ల, డ్రగ్స్ వాడకం వల్ల, డిస్పోజిబుల్ సిరెంజీలు వాడకపోవడం మూలంగా, ఇంకా మంగలి కత్తి ఇలా అనేక మార్గాలలో ఎచ్.ఐ.వి. విజృంభిస్తుందనేది అవగాహన లేకుండా ఎచ్.ఐ.వి పాజిటివ్ వ్యక్తుల పట్ల వివక్ష, నిర్లక్ష్యం, అవమానం, వదిలించుకోవడం లాంటి పరిస్థితులు సమాజంలో ఏర్పడుతున్నాయి.

ఎయిడ్స్ వ్యాధి ఉందని తెలగానే కుటుంబంలో అందరి నుంచి మహిళలపై ఒత్తిడి, హింస ఎక్కువయిపోతాయి. ముఖ్యంగా ఎయిడ్స్‌తో భర్త మరణించాడంటే ఆ భార్యపై దీని సామాజిక ప్రభావం చాలా ఎక్కువగా ఉంటుంది. చాలా అవమానాలనూ, వివక్షనూ, ఒంటరితనాన్ని ఎదుర్కోవలసి వస్తుంది.

ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ నల్లూరి రుక్మిణి 'తప్పెవరిది?' అన్న హృదయవిదారకమైన కథ రాశారు.

స్త్రీల ఆరోగ్యాల గురించీ, వారి మీద జరుగుతోన్న అత్యాచారాల గురించీ పట్టించుకోక పోగా రకరకాల అవమానాలతో ఆమెని కృంగదీస్తుంది సమాజం.

స్త్రీల ఆరోగ్యం సమాజశ్రేయస్సుకు ఎంతో ముఖ్యమైనది. ఒక స్త్రీ చదువుకున్నట్టయితే ఆ కుటుంబం ఒక విశ్వవిద్యాలయంతో సమానమని ఎలా అనుకుంటామో, కుటుంబాల్లో ప్రధాన పాత్ర పోషించేటువంటి స్త్రీ ఆరోగ్యంగా ఉన్నట్టయితే సమాజమంతా ఆరోగ్యవంతంగా ఉంటుంది.

స్త్రీల ఆరోగ్యానికి సంబంధించి బాల్యం నుండి శ్రద్ధ తీసుకున్నందు వల్ల తర్వాత తర్వాతి దశల్లో స్త్రీలు వివిధ రకాల ఆరోగ్య సమస్యలను ఎదుర్కునే ఇబ్బంది లేకుండా ఉంటుంది.

# ప్రజాస్వామ్యం ఉంటేనే మానవ హక్కులా ?

– వాసిరెడ్డి భాస్కరరావు

*(గత సంచిక తరువాయి..)*

ప్రపంచ రాజకీయాలను ప్రజాస్వామికీకరణ చేయాలనుకోవటంలో ఐక్యరాజ్యసమితిని ఏర్పాటు చేయటం ప్రథమ చర్యగా భావించాలి. ఐతే మానవ హక్కుల పరిరక్షణలో ఐ.రా.స. పాత్ర వైపరీత్యంగా వుంది. మానవ హక్కుల రూపకల్పనలో ఐ.రా.స. పాత్ర జాతీయ, అంతర్జాతీయ చర్చను ప్రోత్సాహించింది. యావత్ ప్రపంచంలో మానవ హక్కుల ప్రాధాన్యాన్ని ఐ.రా.స. చాటిచెప్పింది. అంతర్జాతీయ సంబంధాల నిర్వహణలో మానవ హక్కుల అంశాన్ని గమనించాలని ఉద్ఘాటించింది. ఈ విధంగా మానవ హక్కుల భావ గుర్తింపుకు, ప్రచారానికి ఐ.రా.స. ఎంతగానో తోడ్పడింది. అయితే ఆచరణలో ఐ.రా.స. పాత్ర ప్రశ్నార్థకమైంది. ఐ.రా.స. డిమాండ్లకు స్పందించింది. కాని రాజ్యాలలోని ప్రజల సమస్యలకు, హక్కులకు, కడగండ్లకు ప్రతిస్పందించగల శక్తి లేనిది. కనుక ఐరాస పాత్ర నియమ నిబంధనలు, ప్రమాణాలు జారీ చేయటంతో సరిపుచ్చుకునే వింత పరిస్థితి ఏర్పడింది. సమాన సార్వభౌమాధికారం గల రాజ్యాల అంతర్గత విషయాలలో జోక్యం చేసుకోవటానికి ఐ.రా.స.కు అధికారం లేదు.

**ప్రజాస్వామ్యం – ప్రపంచ క్రమం**

ప్రజాస్వామ్యానికి మానవ హక్కులకు మధ్య దగ్గర సంబంధాన్ని ప్రోత్సహించాలని కొందరు వాదిస్తున్నారు. దీనికి సమాధానం తక్కువ అభివృద్ధి చెందిన దేశాలలో అభివృద్ధి జరగకపోవటంలో వుంది. వీరి వాదన ప్రకారం, ప్రచ్ఛన్న యుద్ధకాలంలో మాదిరిగా, సామాజిక అశాంతిని అదుపులో పెట్టటానికని పోలీసు, మిలటరీ ద్వారా అణచివేయదలిస్తే, అది ముడిసరుకుల సరఫరాలను కుంటుపరుస్తుంది, పెట్టుబడి అవకాశాలను పరిమితం చేస్తుంది, తక్కువ వేతన శ్రమను దోపిడి చేయటాన్ని నిరోధిస్తుంది. ప్రచ్ఛన్న యుద్ధకాలంలో కమ్యూనిజం వ్యాప్తి గాకుండా ప్రభుత్వాల నిరంకుశ ధోరణులు న్యాయబద్ధమైనవని భావించారు. సోవియట్ రాజ్య పతనం ఈ వాదానికి తెరదించింది.

అయితే ప్రస్తుత పరిస్థితులలో ప్రపంచీకరణకు తగిన స్థితిగతులను, స్థిరమైన పరిస్థితులను ఏర్పరచటానికి ప్రజాస్వామ్యాన్ని ప్రోత్సహించటం అవసరం వుంది కాని సామాజిక న్యాయం, మానవ హక్కులు, మానవ రక్షణ, మానవీయ విలువల భావాలకు సంబంధం లేదు. ప్రపంచీకరణ విజయానికి కావలసిన రాజకీయ – ఆర్థిక సంబంధాలను ఏర్పరచాలన్నదే ముఖ్యం. ఈ ముసుగులో అభివృద్ధి చెందిన దేశాలలో ప్రజాస్వామ్య వ్యవస్థలను కొన్నిటిని ప్రోత్సహించటమే కాని సామాజిక, ఆర్థిక పరిణామాల లక్ష్యాలను సాధించటం దాని ద్వారా పేద ప్రజలకు సాధికారం కలిగించటానికి యిది సాధ్యం కాదు.

---

ఇక సాహిత్యం విషయానికొస్తే ఈ ఇరవయ్యో ఒకటో శతాబ్దంలో కూడ స్త్రీలు రాస్తున్నపుడు ఎంత అదుపు ఉందంటే చెప్పడానికి సాధ్యం కానంత.

చాలమంది స్త్రీలు తాము రాస్తున్నందుకు ఎన్ని అవరోధాలు ఎదుర్కుంటున్నామో, ఎప్పుడయినా బహుమతులూ, పురస్కారాలూ వచ్చినందుకు ఎంత ఎద్దేవా చేయబడుతున్నామో, భర్త నుంచి, కుటుంబం నుండే కాక చుట్టూ ఉన్న సమాజం నుండి కూడ తమ సాహిత్యం మీద ఎంత పెత్తనం ఉంటుందో సంఘటనలు, సంఘటనలుగా వివరిస్తుంటే విని ఆందోళన, ఆశ్చర్యం, భయం కలిగింది.

అంటే పొంగి పొరులుతున్న అభిప్రాయాలనీ, ఒలికిపోతున్న దు:ఖాన్నీ కనీసం తెలుపు నలుపు చేసుకోవడానికి కూడ మనకిక్కడ స్వేచ్ఛ లేదన్నమాట.

ముందే చెప్పుకున్నట్లుగా పోరాటాలు చేసి సాధించుకున్న కొద్దిపాటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కూడ ఈ ప్రపంచీకరణ నేపథ్యంలో రూపుమాసిపోయాయి. కనీసం స్త్రీలకి తమ పోరాటాలనీ, ఉద్యమాలనీ ముందుకు తిసుకెళ్లగలిగే అవకాశాలు కూడా లేని పరిస్థితుల్ని ప్రపంచీకరణ తెచ్చిపెట్టింది.

సామ్రాజ్యవాదపు ప్రభావం అంతకుముందు నుండే ఉన్నప్పటికీ మరీ పది పదిహేనేళ్లుగా సామాజిక మార్పులన్నీ కూడ స్త్రీల జీవితాల మీద అత్యంత ప్రభావాన్ని చూపించి వారిని సంక్షోభంలోకి నెట్టివేస్తున్నాయి. స్త్రీలకు అంతకు ముందరి సమస్యలన్నీ అలాగే ఉండగా మరికొన్ని సమస్యలనీ, కొత్త అణచివేతనీ ఎదుర్కోవాల్సిన పరిస్థితి ఏర్పడింది.

రైతుల ఆత్మహత్యలయినా, వలసలయినా, కర్మాగారాలు మూతపడినా, కార్పొరేటయిపోయినా, చదువులయినా, ఖరీదయిపోయిన వైద్యమయినా, చివరికి ఆభారాన్ని మోస్తున్నది స్త్రీలే కావడం దురదృష్టకరం.

వ్యంగ్యంగా అనుకుంటాను "అమెరికాను వ్యతిరేకించనట్టయితే అమ్మను వ్యతిరేకించినట్లే" అంటూ మన కర్తవ్యాన్ని బోధిస్తారు ఎన్. గోపి ఒక కవితలో.

మార్కెట్ ప్రలోభాలలో పడి కొట్టుకుపోయి మనల్ని మనం సరుకులుగా మార్చుకునే స్థితిలోకి జారిపోకుండా వ్యక్తిత్వమున్న మనుషులుగా నిలబడ్డం ఇవ్వాల్టి అవసరం.

జపాన్ దేశపు దార్శనికత, ముందుచూపు లేక మార్కెట్ ఊబిలో రోజురోజుకీ కూరుకుపోతోన్న మనదేశం, మన రాష్ట్రాన్ని కలిసికట్టుగా కాపాడుకోవలసిన బాధ్యత మనందరి మీదా ఉంది.

గ్లోబలైజేషన్, ప్రైవేటైజేషన్, లిబరలైజేషన్ తప్ప మరో మార్గం లేనట్లుగా ప్రపంచమంతా తలలొంచుకొన్న నేపథ్యంలో లాటిన్ అమెరికా దేశాలు తలలు విదిలించి మల్టీనేషనల్ కంపెనీల దోపిడీ మీద పన్ను వేయడం, ప్రజలంతా వీథుల్లోకొచ్చి వాళ్లకి నచ్చని ప్రభుత్వాలని నిర్దాక్షిణ్యంగా దించి వేయడం ఆశాజనకమైన స్థితి.

మనం కూడ ఆ ఉత్సాహాన్నీ, ఉద్వేగాన్నీ అరువు తెచ్చుకుందాం కనీసం... ◆

ప్రజాస్వామ్య వాదన ఒకరకమైన జోక్యం కోసం వినియోగించబడిందే కాని ప్రజాస్వామ్య వృద్ధికోసం కాదు. అభ్యుదయ సంస్కరణలు, విప్లవాత్మక మార్పులు రాకుండా చేపట్టిన ముందు జాగ్రత్త చర్య మాత్రమే, యథాతథ స్థితిని చట్టబద్ధం చేయటమే యిది కోరుకుంది. ప్రజాస్వామ్యం లాంఛన ప్రాయమైన వ్యవస్థలను ఏర్పరచి కొద్ది మార్పులకు, సివిల్, రాజకీయ హక్కులకు స్థానమిచ్చినా ఆర్థిక, సామాజిక సంస్కరణలకు ప్రాధాన్యం ఎక్కువగా వుండదు. మానవ హక్కుల ఉల్లంఘన కొనసాగుతూ ఉంటుంది. మామూలుగానే కార్మికులు, విద్యార్థులు వామపక్షాల కార్యకర్తలపై అణచివేత వుంటుంది. ఈ దేశాలన్నిటిలో ప్రజాస్వామ్య తీవ్రత తక్కువగా వుంటుంది. ఈ దేశాలకు ప్రపంచదేశాల, వ్యవస్థల ఆర్థిక సహాయం ప్రపంచీకరణ విధించిన షరతులకు లోబడి యివ్వటం జరుగుతుంది. ప్రజాస్వామ్య ప్రోత్సాహం వుండదు. ఒకవేళ దేశంలోని ప్రజాస్వామ్య వర్గాలు, సామాజిక న్యాయ పోరాటాలు, సాంఘిక సంస్కరణ ఉద్యమాలు షరతుల గీతదాటి తీవ్రమైతే ఆర్థిక సహాయం మద్దతు వెనక్కు తీసుకోబడుతుంది. మిలటరీ జోక్యం కలుగ చేసుకుంటుంది. ప్రజాస్వామ్యం నినాదం ప్రపంచీకరణ కోరుకున్న ఆర్థికాభివృద్ధి జరగటానికై క్రమబద్ధం చేయబడిందిగా గమనించాలి.

ఈ దేశాలలో బలహీనమైన కార్మిక సంఘాలు, తక్కువ వేతనాలు వుంటాయి. ప్రభుత్వేతర సంస్థలకు తగు స్థానముండదు. పత్రికలపై, మీడియాపై నిబంధనలుంటాయి. దేశంలో శాంతి-భద్రతల క్రమ రక్షణకై రాజ్య వ్యవస్థలైన పోలీసు, మిలిటరీ శక్తివంతం చేయబడుతాయి. సామాజిక న్యాయం, మానవ హక్కులకు గౌరవముండదు. అక్కడి ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ప్రపంచ వ్యవస్థల, జాతీయ పెట్టుబడుల ప్రయోజనాల నెరవేర్పు నిర్వాకం చేయటానికై వున్నాయి.

ఈ వాదనలను తిరస్కరిస్తూ ప్రజాస్వామ్య హక్కు మానవ హక్కులకు హామీనిస్తుందని, అంతర్జాతీయ న్యాయం దీనిని గుర్తించిందని అన్ని రాజ్యాలు పార్లమెంట్‌కు నియతికాల ఎన్నికలు జరిపించటం ఆచరించటం ప్రజాస్వామ్య వ్యవస్థలను రూపొందిస్తున్నాయని కనుక ప్రపంచీకరణ శక్తులు, జాతీయ ప్రజాస్వామ్యాన్ని, మానవ హక్కులను కుదించలేవని, అలా చేయటం సరికాదని కొందరు వాదిస్తున్నారు. వీరి ప్రకారం, ప్రపంచీకరణ న్యాయబద్ధతకు ఉదార ప్రజాస్వామ్య పెంపుదల మానవ హక్కుల పరిరక్షణ చాలా అవసరమని కనుక భవిష్యత్‌లో ప్రజాస్వామ్యానికి, మానవ హక్కులకు మంచి రోజులున్నాయని, ప్రపంచీకరణలో ఏ రాజ్యమూ తన బాధ్యతనుండి తప్పించుకోజాలదనీ, రాజ్యం తన పరువు ప్రతిష్ఠలను, శక్తులను ప్రపంచీకరణకు కుదువ పెట్టకూడదనీ, యిది ప్రపంచీకరణ శక్తులకు కూడా మంచిది కాదని వాదిస్తున్నారు. వీరి దృష్టిలో ప్రజాస్వామ్య పాలన ప్రపంచమంతటా వ్యాపించాలని, ప్రపంచ క్రమంపై సంప్రదాయక రాజ్య సిద్ధాంతాలకు తిలోదకాలివ్వాలని అంటున్నారు. ప్రపంచక్రమాన్ని ప్రజాస్వామికీకరణ చేయగలగిన నాడే ప్రపంచీకరణ శక్తుల ప్రయోజనాలు కూడా నిర్విఘ్నంగా కొనసాగుతాయని భావిస్తున్నారు.

**అభివృద్ధి, ప్రజాస్వామ్యం - మానవ హక్కులు**

ప్రజాస్వామ్యాన్ని ప్రోత్సహించటం అన్న నిర్వచనంలో మానవ హక్కుల పరిరక్షణ ఉంటుందన్న భావన, విదేశ విధానాల జోక్యానికి మద్దతు పలికే ప్రభుత్వాలకు హేతుబద్ధత కలిగించి ప్రపంచ సరళీకరణ లక్ష్యాలకు దోహదం చేయవచ్చు. ప్రజాస్వామ్యాన్ని ప్రబలవంతం చేసే ప్రదర్శన, ప్రపంచీకరణ శక్తుల ఆర్థిక ప్రయోజనాలను కాపాడేదే కాని, మానవ హక్కుల భద్రత కావలసిన జనం ప్రయోజనాలకు ప్రమాదకారి. ప్రజాస్వామ్య హక్కును జనం కోల్పోకుండా యిది చూడలేదు. ఉదార ప్రజాస్వామ్యం, స్వేచ్ఛా విపణికి వ్యతిరేకంగా వచ్చే ప్రత్యామ్నాయ దృక్పథాన్ని వ్యక్తీకరించే వారి పట్ల బలప్రయోగం చేయబడుతుంది.

మామూలుగా ప్రతి రాజ్యం ఆర్థికవృద్ధి, అభివృద్ధికి కృషి చేస్తుంది. కాని ప్రస్తుత ప్రపంచీకరణ కాలంలో అటువంటి కృషి ప్రయత్నం లక్ష్యం చాలా వరకు ప్రజాస్వామ్యానికి వ్యతిరేకమైనవి. దేశీయ సందర్భంలోనూ ప్రపంచ దేశాల సందర్భంలోనూ యిదే కనపడుతుంది.

**దేశీయ సందర్భం**

అభివృద్ధి హక్కు ప్రతి వ్యక్తికి, జనాలందరికీ వుంది. దీనిలో ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, రాజకీయ అభివృద్ధి, మానవ హక్కులు, ప్రాథమిక స్వేచ్ఛలను పూర్తిగా సాధించుకొనే అవకాశం పాలుపంచుకోవటం, ఆనందించటం వున్నాయి. (అభివృద్ధి హక్కు ప్రకటన 1986) అయినా కూడా ఆర్థికాభివృద్ధికే అధిక ప్రాధాన్యాన్నిచ్చి, మిగతా అభివృద్ధిని చిన్నచూపు చూడటం జరుగుతున్నది. దీనికి సాక్ష్యం ఆర్థిక వృద్ధి రేటును, జిడిపి రేటును, అభివృద్ధికి సూచికగా చూపిస్తున్నారు గాని, మానవ అభివృద్ధి సూచికను చూపించటం లేదు. దీనిలో మానవ హక్కులు, ప్రజాస్వామ్యం, సామాజిక న్యాయం ముఖ్యంగా వున్నాయి. కనుక ఆర్థిక శాస్త్రం, దాని అభివృద్ధి నిర్వచనంలో ఈ మానవాభివృద్ధికి తావులేదు. దీనిని ఆర్థిక అశ్వం ముందు ప్రజాస్వామిక బండిని పెట్టినట్లుగా వర్ణించారు. దీని 367 అభివృద్ధి చెందుతున్న నాయకుల వాదన ప్రకారం, ముందుగా ఆర్థికంగా అభివృద్ధి చెందిన తర్వాత మధ్య తరగతివర్గం బలపడి సంప్రదాయక అసమానతలు తొలగిన సందర్భంలో ఆర్థిక పరిస్థితులు ప్రజాస్వామ్యానికి, మానవ హక్కుల పెంపుదలకు మార్గం వేస్తాయని అంటున్నారు. దీని కోసమని కొంతకాలం పాటు బలమైన, స్థిరమైన ప్రభుత్వాలు అవసరమని అవి సాంఘిక సంస్కరణల ద్వారా తరతరాల సామాజిక వ్యవస్థ వల్ల ఏర్పడిన పేదరికం తొలగడానికి ప్రయత్నం జరుగుతుం దంటున్నారు. కాని తూర్పు ఆసియా 'అద్భుతం', చూసిన తర్వాత అనుభవం ప్రకారం ప్రజాస్వామ్యం - ఆర్థికాభివృద్ధి రెండు జోడు గుర్రాలు కావని తేలింది. కనుక ఎట్టి పరిస్థితుల్లో కూడా ఆర్థికాభివృద్ధి కుంటుపడకుండా వుండటానికని 'మార్కెట్‌ను నిలబెట్టే ఆధిపత్యం' కొనసాగాల్సిందేనని తేలింది. కనుక ప్రజాస్వామ్యం, మనవ హక్కులు వెనక్కి తగ్గాల్సిందే.

**ప్రపంచ సందర్భం**

దేశీయ సందర్భంలోనే ప్రజాస్వామ్యానికి, సాంస్కృతిక హక్కులకు భంగం ఏర్పడితే, ప్రపంచ సందర్భంలో వాటికి స్థానం చాలా నిరుత్సాహంగా వుంటుంది. ప్రజాస్వామిక పాలన మరింత బలహీనమౌతుంది. ప్రపంచ బ్యాంకు మీద ఆధారపడ్డ దేశాలలో యిది మరింత అసాధ్యం. మద్దతు యిచ్చే ప్రపంచ బ్యాంకు పెద్ద ప్రాజెక్టులన్నీ సాధారణంగా మానవ హక్కుల ఉల్లంఘన కిందే వస్తాయి. ఉదా. ప్రజలను ప్రాజెక్ట్ స్థలాలనుండి తరలించటం, అక్కడి పర్యావరణాన్ని నాశనం చేయటం, సంప్రదాయకమైన వారి వ్యవసాయానికి, వేటకు వారిని దూరం చేయటం లాంటివి. ఇలా కోల్పోయిన వారందరూ ప్రతిఘటిస్తారు. వారిపై హింస, దౌర్జన్యం ప్రభుత్వాలు చేపడతాయి.

# స్వాతంత్ర్యానంతరం టెక్నాలజీ, గ్రామీణాభివృద్ధి

- డా. తోట సత్యనారాయణ

*(గత సంచిక తరువాయి..)*

నూతన వ్యవసాయ వ్యూహం ఫలితంగా, అభివృద్ధి చెందుతున్న దేశాల్లో రెండు అంతర్జాతీయ పరిశోధన కేంద్రాల ద్వారా అనగా కన్సల్‌టేటివ్ గ్రూప్ ఫర్ ఇంటర్నేషనల్ అగ్రికల్చరల్ రీసెర్చ్ సిస్టమ్ ఐఎఆర్ఎస్, మెక్సికోలో సిఐఎంఎం, ఫిలిప్పీన్స్‌లో ఐఆర్ఆర్ఐ ద్వారా గోధుమలు, మొక్కజొన్నలు, బియ్యంపై పరిశోధన కేంద్రాలను నెలకొల్పినారు. 1971లో సి.జి.ఐ.ఏ.ఆర్. పద్ధతి ద్వారా అంతర్జాతీయ సహాయం కొరకు అభివృద్ధి చెందుతున్న దేశాల్లో జాతీయ వ్యవసాయ పరిశోధన సంస్థలను నెలకొల్పినారు.

1966-80 మధ్య కాలంలో హరిత విప్లవం వచ్చింది. అధిక దిగుబడుల నిచ్చే నూతన వంగడాలు వచ్చాయి. పంజాబ్, హర్యానా, ఢిల్లీ, రాజస్థాన్, పశ్చిమ, ఉత్తర ప్రదేశ్‌ల్లో కొత్త మెక్సికన్ వెరైటీలు అనగా లెర్మారోజో, సోనారా-64, కళ్యాణ్, పి.వి-18. అంతేకాకుండా, వరి వంగడాల్లో టి.ఎన్-1, ఐ.ఆర్-8, టీఎన్-3, ఏ.డి.టి-17 మొదలగు వంగడాలు ప్రయోగశాలల ద్వారా పరిశోధనలు చేపట్టి ఉపయోగంలోకి తీసుకురావడం జరిగింది.

సంప్రదాయ వ్యవసాయ విధాన స్థానంలో ఆధునిక టెక్నాలజీతో పంటలకు అవసరమైన రసాయనిక ఎరువులు, పోషక పదార్థాలు అందుబాటులోకి వచ్చాయి. క్రిమికీటకాలను నివారించే మందులు, వ్యవసాయ పనిముట్లు, భారీ యంత్రాలు వచ్చాయి. భూగర్భ జలాలను వెలికి తీసి వాడుకోవడానికి ఆయిల్ ఇంజన్లు, కరెంటు మోటార్లు ఉపయోగంలోకి తీసుకురావడం జరిగింది. రైతులకు సంస్థాగత రుణాలు, పరపతి సౌకర్యాలు, బ్యాంకుల జాతీయీకరణతో రుణాలు మరింత సులభతరమైనాయి. ఫుడ్ ప్రాసెసింగ్ సౌకర్యాలు, రైతులకు ప్రోత్సాహకరమైన గిట్టుబాటు ధరలు ఉత్పత్తిని పెంచడానికి హరిత విప్లవం దోహదం చేసింది.

విత్తనాలు, ఎరువులు, నీటిపారుదల అనే మూడు అంశాల ప్యాకేజీకి సంబంధించిన హరిత విప్లవ అనుభవాన్ని ఈ సందర్భంగా విశ్లేషించడం ఎంతో అవసరం.

---

పైగా ప్రపంచబ్యాంకు వ్యవహారాలు నిర్ణయీకరణలు రహస్యంగా ప్రభుత్వంలో ముఖ్యులైన కొందరి మంతనాల ఆధారంగా ఆమోదం చెందుతాయి. ప్రజలు, వారి ప్రాతినిధ్య సంస్థలు నిర్ణయీకరణలో పాల్గొనవు. కనుక ప్రజాస్వామ్యం - ప్రపంచ బ్యాంకు ప్రాజెక్టులకు సంబంధం వుండదు. ప్రపంచ బ్యాంకుకు ఆర్థిక పరమైన విషయాల్లోనే ప్రమేయం వుంది. ప్రజాస్వామ్యం, మానవ హక్కులు లాంటివాటితో సంబంధం లేదు. ప్రజల అవసరాలైన విద్య, ఆరోగ్యం, సంక్షేమం, ఉద్యోగాలు, మానవ భద్రత వీటితో బ్యాంకుకు సంబంధం లేదు కనుక ఆర్థిక ప్రయోజనాలు మానవ హక్కుల మధ్య స్పష్టమైన తేడాను మనం ఎప్పుడైనా గమనించవచ్చు.

వీరి దృష్టిలో కొనుగోలు శక్తి వున్న వినియోగదారులు మాత్రమే ప్రజలు-మిగతా వారందరూ పనికిరాని కోట్లమంది సరళీకరణలో, స్వేచ్ఛా మార్కెట్‌లో వినియోగదార్లుగా పనికిరాని వ్యర్థజీవులు. భవిష్యత్ ప్రపంచ వ్యవస్థ నిర్మాణంలో పాత్రధారులు కావటానికి అర్హతలేనివారు. కనుక పేదవారు, వారి ప్రయోజనాలు ప్రపంచ ఆర్థిక సంస్థలకు సంబంధం లేనివారు - మానవ హక్కులు వారి ప్రయోజనాలకు బలి కావల్సిందే. అంటే ప్రపంచంలోని అత్యధిక సంఖ్యాకులకు వారి దేశాలలో, వారి జీవితాలకు సంబంధించిన విషయాలను నిర్ధారించుటలో వారికెటువంటి ప్రజాస్వామిక పాత్ర లేకపోవటమే, వారి జీవన స్థితిగతులను నిర్ధారించే హక్కును వారు కోల్పోయారు. ప్రపంచీకరణ యొక్క ఆర్థిక నిర్ణయాలు యిప్పుడు ప్రపంచవాణిజ్య సంస్థ తీసుకొంటుంది. ఆయా నిర్ణయాల చర్చల్లో పాల్గొనటానికి కూడా చాలా దేశాలకు వారి ప్రతినిధులు లేరు. ఆయా దేశాలు ప్రతినిధులను కూడా భరించగల ఆర్థికశక్తి లేదు. కనుక కొన్ని దేశాలు ముఖ్యంగా అమెరికా ప్రతినిధులు ప్రపంచ వాణిజ్య సంస్థ నిర్ణయాలు తీసుకొంటుంటే, రహస్యంగా జరిగిన మంతనాల ద్వారా వాటి లోతుపాతులు తెలియకుండా మిగతా దేశాలు వారి ఆర్థిక అవసరాల నిమిత్తం ప్రపంచ వాణిజ్య సంస్థ నిర్ణయాలను శిరోధార్యంగా ప్రవర్తిస్తున్నాయి. ప్రపంచదేశాల మార్కెట్లను క్రమశిక్షణతో ప్రపంచ వాణిజ్య సంస్థ నడుపుతున్నది.

**ముగింపు**

ఇప్పటిదాకా జరిగిన చర్చ, మనం ఈ వ్యాసం మొదటిలో అనుకున్నట్లు ప్రజాస్వామ్యం, మానవ హక్కుల మధ్య పరస్పర ఆధార సంబంధత్వం తప్పకుండా వుండాలన్నదిగా కనపడుటలేదు. ప్రజాస్వామ్యం పేరు యిటీవల బాగా ప్రచారంలోకి వచ్చినా, మానవీయ పరిస్థితులను ప్రోత్సహించే, రక్షించే మార్గంలో ప్రజాస్వామ్యం లేదని యిక్కడ జరిగిన చర్చ సూచిస్తుంది. పైగా ప్రజాస్వామ్య ప్రచార ఆర్భాటం ప్రపంచీకరణతో ముడిపడివున్న ఆర్థిక ప్రయోజనాలకు మట్టుకు యిది బాగా తోడ్పడినట్లుగా, వారి ప్రయోజనాలకు న్యాయబద్ధత తెలిపే మద్దతు లభించేటట్లు ప్రజాస్వామ్య ప్రతిమ ప్రవర్తించింది. కనుక ప్రజాస్వామ్యం పేరుకు ఎన్నికలు, పార్లమెంట్‌లు చట్టాలు వుంటేనే సరిపోదు. ప్రజాస్వామిక ఫలితాలను గురించి ఆలోచించాలి. ఇపుడు జరుగుతున్న పెట్టుబడి ప్రయోజనాలను, ప్రపంచ సంస్థల ప్రయోజనాలను కాక అందరి ప్రయోజనాలను ముఖ్యంగా పేద ప్రజల అవసరాలను తీర్చేందుకు యిపుడు అవకాశాలు తక్కువ.

కనుక ఇపుడు జరుగుతున్న ప్రజాస్వామ్య భావన వ్యాప్తి ప్రపంచీకరణకు చెందిన ప్రపంచ పెట్టుబడి, విత్తము, ప్రపంచీకరణ పరిస్థితులను మెరుగుపర్చేదే కాని మానవహక్కులు, మానవ భద్రతకు సంబంధించింది కాదు. కనుక అందరూ అనుకున్నట్లుగా 'ప్రజాస్వామ్యం వుంటే (నే) మానవ హక్కులు' వుంటాయన్న దానిని ప్రశ్నించాలి. అది సందేహించదగింది. ◆

మొదటి కారణం, నూతన వ్యూహంతో హరిత విప్లవంలో మొదట్లో పరిమిత చొరవతో ముఖ్యంగా గోధుమలు, మొక్కజొన్న, సజ్జ పంటల్లో కొన్ని మార్పులు తీసుకొచ్చారు. భారతదేశంలో ప్రధాన పంటయైన వరిలో అధిక దిగుబడి రకాలు. ప్రధాన వాణిజ్య పంటల్లో ఆయిల్ విత్తనాలు, కాటన్, జూట్ (జౌళి) పంటల్లో నెమ్మదిగా పురోగతి సాధించినారు.

1960లో పంజాబ్, హర్యానా, పశ్చిమ, ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ఎంపిక చేయబడిన జిల్లాల్లో, మహారాష్ట్ర, తమిళనాడు రాష్ట్రాల్లో ఆహారధాన్యాల ఉత్పత్తిలో పేర్కోదగిన పెంపు చోటు చేసుకున్నాయి. కానీ ఈ రాష్ట్రాల్లో ఉత్పత్తిని మొత్తం భారతదేశానికి చెందినదిగా పేర్కొనడానికి వీలులేదు. ఇది రెండో కారణంగా చెప్పుకోవచ్చు. ఇది కొంత వరకు అసమతౌల్య వృద్ధి ప్రక్రియ అయినా, అన్ని ప్రధాన రాష్ట్రాల్లో హరిత విప్లవం ప్రక్రియలు కొనసాగినట్లయితే అభివృద్ధిని సమతౌల్యంగా భావించవచ్చు.

మూడో కారణం, నూతన టెక్నాలజీని అవలంబించడం అనేది రైతుల అక్షరాస్యత స్థాయిపై ఆధారపడుతుంది. డి.పి. చౌదరి భారతదేశంలో విద్యా, వ్యవసాయ ఉత్పాదకత అనే అధ్యయనంలో ఎక్కువమంది రైతుల్లో దిగుబడి పెంపు, ఖర్చు తగ్గింపు, నవీనకల్పన మొదలగు విషయాల్లో కొన్ని జాగ్రత్తలు తీసుకొంటున్నారు. కానీ, చిన్న, సన్నకారు రైతుల్లో ఇది సాధ్యం కావడంలేదు. ఎందుకనగా వారిలో నిరక్షరాస్యత నెలకొంది. నూతన టెక్నాలజీని వ్యాపింపచేయడానికి వారికి తగిన సమాచారం కల్పించాలంటే వారి అక్షరాస్యత స్థాయిపై ఆధారపడి ఉంటుంది. హరిత విప్లవ ప్రధానోద్దేశ్యంలో రైతుల్లో నిరక్షరాస్యతను తొలగించాలని అని చౌదరి అధ్యయనం వెల్లడించింది.

ప్రస్తుతం గ్రామీణ ప్రాంతాల్లో ఏర్పాటు చేయబడిన సహకార సంస్థలు, గ్రామీణ బ్యాంకుల ద్వారా తక్కువ వడ్డీతో రుణ సౌకర్యం కల్పించబడుతుంది. కాని, ఇందులో అధిక శాతం పెద్ద రైతులే లబ్ది పొందుతున్నారనే అపోహలు వెల్లడవుతున్నాయి. కానీ అసలు లబ్దిపొందే చిన్న రైతులు మాత్రం గ్రామాల్లోని వడ్డీ వ్యాపారుల వద్ద అధిక వడ్డీతో అప్పులను (24 శాతం నుండి 36 శాతం) తీసుకొంటున్నారు. ప్రభుత్వ పరంగా కేవలం 40 శాతం మాత్రమే రుణ సౌకర్యం కల్పిస్తుంది. ఇది నాలుగో కారణంగా చెప్పుకోవచ్చు.

అయిదో కారణం నూతన టెక్నాలజీని అవలంబించడంలో నీటి సరఫరా నియంత్రణ – రైతు దాన్ని తగిన సమయంలో క్రమబద్ధీకరించక పోవడం, దాన్ని సాధించాలంటే ట్యూబ్‌వెల్స్ లేదా డీజిల్ పంపు సెట్స్‌లపై అధిక పెట్టుబడులను హెచ్చించాల్సి ఉంటుంది. ఇక్కడ పరిశీలించాల్సిన విషయం ఏమిటనగా, ట్యూబ్‌వెల్స్ కలిగిన రైతులు పరిమిత సంఖ్యలో ఉండడం, కేవలం వారికి 10 ఎకరాలు అంతకన్న ఎక్కువ కలిగిన వారు ఉన్నారు. కాబట్టి, నీటి సరఫరా కొరకు రెంటల్ మార్కెట్‌ను అభివృద్ధి పర్చవలసిన అవసరం ఉంది.

ఈ హరిత విప్లవ నూతన వ్యూహంలో మూడు రకాలైన ఘర్షణలు సృష్టించబడ్డాయి. మొదటిది, వ్యవసాయపరమైన ఫర్మ్‌లో యాజమాన్య, ఉద్యోగుల మధ్య ఘర్షణలు, రెండవది. భూ యాజమాన్యులకు, కౌలు రైతులకు మధ్య ఘర్షణ మూడోది, పెద్ద రైతులకు, చిన్న రైతులకు మధ్యన ఘర్షణలు చెలరేగుతున్నాయి.

### ప్రపంచ దేశాలల్లో వ్యవసాయ పరిశోధనలు

ప్రభుత్వ హరిత విప్లవం పేరుతో ప్రవేశపెట్టిన ఆధునిక వ్యవసాయంలో పెట్టుబడికి కీలకమైన పాత్ర సంక్రమించింది. ఎందుకంటే, అధికోత్పత్తిని సాధించాలంటే ఆధునిక వ్యవసాయంలో అధిక దిగుబడి నిచ్చే విత్తనాలను, రసాయనిక ఎరువులను, క్రిమి సంహారక మందులను విధిగా ఉపయోగించాలి. ఈ ఉత్పత్తి కారకాలు స్థానికంగా దొరకవు. వాటిని మార్కెట్‌లో కొనుక్కోవాల్సిందే. కనుక డబ్బు అవసరం బాగా పెరిగిపోయింది. గతంలో హరిత విప్లవం కొన్ని ప్రాంతాలకే పరిమితమైంది. కానీ క్రమంగా హరిత విప్లవం ప్రవేశపెట్టిన వ్యవసాయ పద్ధతులు అన్ని ప్రాంతాలకూ విస్తరించాయి. ముఖ్యంగా, పెత్తందారీతనం బలహీన పడిపోయి స్వతంత్ర్యంగా వ్యవహరించడానికి అవకాశం కలిగిన చోట ఆర్థిక ఎదుగుదలకు చిన్న రైతులు ఆధునిక వ్యవసాయ పద్ధతులను అవలంబిస్తున్నారు.

మన దేశంలో అనేక సంస్థలలో వ్యవసాయ పరిశోధనలు జరుగుతున్నాయి. ముఖ్యంగా భారత వ్యవసాయ పరిశోధనా మండలి, వ్యవసాయ విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు అత్యధికంగా జరుగుతున్నాయి. కొన్ని శాస్త్ర సాంకేతిక సంస్థల్లో, ప్రభుత్వ శాఖల ద్వారా కూడా పరిశోధనలు జరుగుతున్నాయి. విశ్వవిద్యాలయాల్లో, స్వచ్ఛంద సంస్థలు ప్రైవేట్ సంస్థల్లోను పరిశోధనలు కొనసాగుతున్నాయి. అయితే, మన దేశంలో 95 శాతం వ్యవసాయ పరిశోధనలు ప్రభుత్వ రంగంలోనే జరుగుతున్నాయి. కొన్ని ప్రైవేట్ విత్తన సంస్థలు రసాయనిక ఎరువులు, క్రిమికీటకాల నిరోధక మందుల కంపెనీలు, వ్యవసాయ పరికరాలు, పనిముట్లు, యంత్రాలు తయారు చేసే కంపెనీలు కూడా కొంత మేరకు పరిశోధన చేయిస్తున్నాయి. వ్యవసాయ పరిశోధనల్లో అద్భుతమైన ప్రగతిని మన శాస్త్రవేత్తలు సాధించారు. ఎన్నో విజయాల్ని సాధించిపెట్టారు.

ఆ పరిశోధనల ద్వారా దాదాపు 2500 అధిక దిగుబడినిచ్చే వంగడాల్ని రూపొందించారు. కొత్త సేద్య పద్ధతుల్ని సూచించినారు. వ్యవసాయ యంత్రాలు, పనిముట్లను కనిపెట్టారు.

- మెట్ట సేద్యంలో భూసార సంరక్షణకు పద్ధతుల్ని సూచించినారు.
- రసాయనిక ఎరువుల వినియోగానికి సిఫారసులు చేశారు.
- పైర్లపై వచ్చే రోగాలు, పురుగుల్ని తెల్సుకోవడం, సస్యరక్షణ చర్యల్ని గురించి కూడా సిఫారసులు చేశారు.

పై వ్యవసాయ పరిశోధనా ఫలితాల్ని రైతులు వినియోగించుకుని, ఆచరణలో పెట్టి, తమ పైర్లు ఉత్పాదికతను, ఉత్పత్తిని పెంచుకున్నారు. 17వ శతాబ్దంలో వృక్ష శాస్త్రానికి సంబంధించిన తోటల్ని అభివృద్ధి చేశారు. అది నేటి వ్యవసాయ పరిశోధనలకు మూలం. వలస పాలిత దేశాలు ఈ తోటల్ని పెంచారు. వారికి కావల్సిన వృక్ష సంతతిని ఎన్నిక చేసుకుని వాటిని వలస దేశాల్లో ప్రవేశపెట్టడానికే ఈ తోటల్ని అభివృద్ధి చేశారు.

ఉదాహరణకు, బ్రెజిల్ లోని క్యూ తోటల్లోని కృషి ఫలితంగానే దక్షిణ, తూర్పు దేశాల్లో రబ్బరును శ్రీలంకలో టీని, భారతదేశంలో క్వినైన్‌ను ప్రవేశపెట్టారు. యూరప్, జపాన్ దేశాల్లో పరిశోధనా కేంద్రాలు ఎగుమతులకు పనికి వచ్చే ఆహార పదార్థాలు (ఉదా. అరటి, చక్కెర,

కొబ్బరి) పానీయాలు (కాఫీ, టీ, మొదలగు) యూరప్‌లోని పరిశ్రమలకు ముడి సరుకులు (పత్తి, వేరుశనగ, రబ్బరు) మొదలగు వాటిపైనే కేంద్రీకరించాయి.

వలస దేశాలు స్వాతంత్ర్యం పొందిన తర్వాతనే ఆహార పంటలపైన పరిశోధనలు ముమ్మరమైనాయి. ఇప్పటికి కూడా వలసవాదం మన పరిశోధనా ప్రాధాన్యతల్ని అస్తవ్యస్తం చేస్తోంది. మన పరిశోధనా కార్యక్రమాల్లో బీద ప్రజానీకం వినియోగించే జొన్న, సజ్జ, కొర్ర, వరిగ, సామ, రాగి మొదలగు తృణధాన్యాలకు ప్రాధాన్యతలేదు. ఎగుమతులకు పనికి వచ్చే పైర్లపైనే విశేషమైన పరిశోధనల్ని జరపడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అలాగే, సాగు నీటి యాజమాన్య సామర్థ్యం పైన కూడా పరిశోధనలు ఎక్కువగా లేవు. సన్న, చిన్నకారు రైతులకు పనికి వచ్చే లేదా వారు ఉపయోగించగల సాంకేతిక శాస్త్రం అభివృద్ధి కాలేదు. పువ్వులు, పండ్లతోటలు, చేపలు, రొయ్యలు, జీవ సాంకేతిక శాస్త్రం మొదలగు వాటిపైన పరిశోధనలు ఎక్కువగా చేస్తున్నారు.

మరో పక్క వ్యవసాయ పరిశోధనల్ని ప్రైవేటీకరించే ప్రయత్నంలో ప్రభుత్వాలున్నాయి. ప్రభుత్వ రంగంలో ఉన్న క్షేత్రాల్ని ప్రైవేట్ సంస్థలకిచ్చే సూచనలున్నాయి. పరిశోధల్ని ప్రైవేటీకరిస్తే, మౌలిక పరిశోధనలు ఆగిపోతాయి. తత్ఫలితంగా వ్యవసాయ పరిశోధనలు దెబ్బతింటాయి. విత్తన కంపెనీలు, పురుగుమందుల కంపెనీలు పరిశోధనలు చేస్తున్నాయి. ఈ పరిశోధనలు సమస్యలు పరిష్కరించే దిశలో కాకుండా, ఆయా కంపెనీలకు అత్యధిక లాభాలను సమకూర్చే అప్రకటిత లక్ష్యంతో కొనసాగుతున్నాయి. ఈ కంపెనీలు తయారు చేసిన విత్తనాలు, పురుగు మందులను వాడి రైతులు విపరీతంగా నష్టపోయారు. మోన్‌సాంటో కంపెనీ, బోల్‌గార్డు, టర్మినేటర్ విత్తనాలు ప్రవేశపెట్టాలనీ ప్రయత్నిస్తోంది. అలాంటి ప్రమాదాలు ప్రైవేట్ పరిశోధనల్లో పొంచి ఉన్నాయి. డబ్ల్యు.టి.ఓ. సూచనల ప్రకారం ఇకపై విత్తనాలన్ని రిజిస్ట్రేషన్ చేయాలనీ సూచించింది. వ్యవసాయ విశ్వవిద్యాలయ యాజమాన్య మండలికి వ్యవసాయ పరిశ్రమలు, వాణిజ్య వర్గాల ప్రతినిధుల్ని నియమించాలనీ సూచించారు. అదే జరిగితే, వ్యవసాయ పరిశోధనా విధానాల్ని వారు శాసించగలరు.

పరిశోధనా ఫలితాల్ని, వ్యవసాయ సాంకేతిక విజ్ఞానాన్ని రైతాంగానికి అందించడమే విస్తరణ ముఖ్యోద్దేశ్యం. విస్తరణ ప్రభుత్వ రంగంలోనే ఉంది. ఇటీవల కాలంలో కొన్ని విత్తనాల కంపెనీలు, పురుగు మందుల కంపెనీలు, డీలర్లు, దుకాణాదారులు కొన్ని వ్యవసాయ సూచనలు రైతులకిస్తున్నారు. దీనికి తోడు వ్యవసాయ విస్తరణను ప్రైవేటీకరించాలనీ ప్రభుత్వం ప్రతిపాదించింది. పదవీ విరమణ చేసిన శాస్త్రజ్ఞులకు అధికార్లకు లైసెన్స్ ఇస్తామంటున్నారు. విజ్ఞానాన్ని రైతాంగానికి ఉచితంగా అందించడానికి బదులుగా, రైతులు విజ్ఞానాన్ని కొనాలనడం దారుణం. ఇది సాంకేతిక విజ్ఞానాన్ని రైతులు ఆచరించడానికి ఏమాత్రం దోహదపడదు. వ్యవసాయ విస్తరణను ఉత్పాదకాలు సరఫరా చేసే సంస్థలకు అప్పచెబుతామని చెబుతున్నారు. అంటే, విత్తనాలు, రసాయనిక ఎరువులు, పురుగుల మందుల కంపెనీలకు లైసెన్స్‌లిచ్చి, రైతాంగానికి సలహాలివ్వండని చెబుతోంది. ఇది చాలా ప్రమాదకరమైన ప్రతిపాదన. రైతాంగం పూర్తిగా నష్టపోతారు. వ్యవసాయాభివృద్ధి జరగదు.

### టెక్నాలజీ బదిలీ

భారతదేశంలో విస్తరణ దృక్పథం అతి పురాతనమైనది ముఖ్యమైనది కూడా. గ్రామీణాభివృద్ధి వ్యూహాలలో ప్రత్యేకంగా వ్యవసాయ సంబంధిత సమాచారంలో ప్రధాన పాత్ర నిర్వహిస్తున్నది. ప్రపంచ బ్యాంకు వారి నూతన సరళీకృత దృక్పథంలో శిక్షణ, సందర్శన పద్ధతిలో టెక్నాలజీని బదిలీ చేస్తూ, దాంతోపాటు పేదరికాన్ని పారద్రోలేందుకు వ్యూహాన్ని రచించింది. దీంతో భారతదేశంలోని అనేక ప్రాజెక్టుల ద్వారా శీఘ్రగతిన ఉత్పత్తిని పెంచడం, పేదరికాన్ని గుర్తించి దాన్ని కనిష్ట స్థాయికి తగ్గించడం లక్ష్యంగా పెట్టుకుంది.

ప్రపంచబ్యాంకు ఆర్థిక సహాయంతో కమాండ్ ఏరియా డెవలప్‌మెంట్ ప్రాజెక్టుల కింద రాజస్థాన్, మధ్యప్రదేశ్‌ల్లో 1974లో శిక్షణ, సందర్శన పద్ధతిని మొట్టమొదటి సారిగా ప్రవేశపెట్టడం జరిగింది. ఆ తర్వాత భారత ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు యొక్క సలహా, ఆర్థిక సహభాగస్వామ్యంతో ప్రాధాన్యత ప్రాతిపదికపై దేశ వ్యాప్తంగా ఈ కార్యక్రమాన్ని విస్తరింపజేసినారు.

ఈ దృక్పథ ప్రధానోద్దేశ్యం పర్యవేక్షణ, నిర్వహణతో రైతు బృందాలకు ప్రతిపాదింపచేయడం, 'దిగుబడి, అంతరం' గురించి, ఉత్పాదకత పెంపుదలకు సంబంధించిన సమాచారాన్ని చిన్న రైతులకు తెలియపర్చడం. ఈ దృక్పథంతో ఉద్దేశ్యాలు, విధానపరమైన మార్పులను లక్ష్యంగా రైతు బృందాలను గుర్తించి భారత ప్రభుత్వ, వ్యవసాయ మంత్రిత్వశాఖ ఉమ్మడిగా అమలు బాధ్యతలు చేపట్టాయి. రాష్ట్ర ప్రభుత్వాలు శాఖాపరమైన మార్గదర్శక సూత్రాలను, అమలు బాధ్యతలను విస్తరణ సంచాలకులకు అప్పగించింది. రాష్ట్రస్థాయిలో, ఒక అదనపు డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ (విస్తరణ అధికారి), రీజినల్, డైరెక్టరేట్ ఆఫ్ అగ్రికల్చర్ సహాయకులు, అదనపు డైరెక్టర్, జోనల్ విస్తరణ అధికారి ఈ శిక్షణ, సందర్శన వ్యవస్థలో విధులను నిర్వహిస్తారు.

ఇకపోతే, జిల్లా స్థాయిలో, జిల్లా వ్యవసాయ అధికారి (డి.ఎ.ఓ) లేదా అదనపు జిల్లా వ్యవసాయాధికారి (ఎ.డి.ఎ.ఓ) పర్యవేక్షణ విధులను నిర్వహిస్తారు. వీరికి సహాయపడేందుకు విషయపరమైన ప్రత్యేక నిపుణుల బృందమొకటి ఉంటుంది. వీరికి అదనంగా సబ్ డివిజనల్ స్థాయిలో విస్తరణాధికారులు (ఎన్.డి.ఇ.ఓ) క్షేత్రస్థాయిలో పర్యవేక్షణ సందర్శకులుగా వ్యవహరిస్తారు. వీరి కింద ముగ్గురు లేదా నలుగురు విషయ నిపుణుల బృందాలు ప్రత్యేకంగా అగ్రానమీ, ప్లాంట్ ప్రొటెక్షన్ మొదలగు వాటిలో సహాయ పడుతుంటారు. ఎన్.డి.ఇ.ఓ. కింద ఆరు నుంచి ఎనిమిది మంది వరకు వ్యవసాయ విస్తరణ అధికారులుంటారు.

క్షేత్రస్థాయిలో, గ్రామ విస్తరణ పనివారు (వి.ఇ.డబ్ల్యు) ఉంటారు. ప్రతి వి.ఇ.డబ్ల్యు 530 నుండి 800 ఫార్మింగ్ కుటుంబాలకు నీటిపారుదల, వర్షాభావ ప్రాంతాలలో బాధ్యత వహిస్తారు. రైతు బృందాలను 7 నుంచి 8 బృందాలుగా విభజించి ప్రతి బృందంలో కాంట్రాక్ట్ రైతులను కలుసుకొని సరైన సమయంలో సమాచార నిర్వహణతో కావలసిన విజ్ఞానాన్ని, దాన్ని సరైన విధంగా అనుసరించడం, ఇంతే కాకుండా, భూమిని ఏ విధంగా సాగు చేయాలో విత్తన క్షేత్రాలు, నర్సరీ నిర్వహణ, విత్తన రకాలు, టిల్లింగ్, వీడింగ్ ఆపరేషన్స్, ప్లాంట్

# భగత్‌సింగ్

*- యశ్‌పాల్ 'సింహావలోకనం' నుంచి*

భగత్‌సింగ్ అశాంతికి రెండవ కారణం తండ్రి ప్రవర్తన; భగత్‌సింగ్ చాలా కాలం ఢిల్లీ కాన్పూర్ పట్నాల్లో ఉండి వచ్చాడు. ఇంటి నుండి మాటిమాటికీ మాయమైపోతున్నాడు. ఎక్కడికి పోతున్నాడో, ఎక్కడ ఉంటున్నాడో – కిషన్‌సింగ్ గారికి తెలియదు. తెలియక పోయినప్పటికీ, కొడుకు యొక్క ఈ ప్రవాస జీవితాన్ని గురించి తండ్రి ఆందోళన పడుతూనే ఉన్నాడు. కొడుకు చెప్పకుండా ఇంట్లో నుండి వెళ్లిపోతూండడం సిఐడి పోలీసులు అతడి వెనకా వెంబడి తిరుగుతూండడం కిషన్‌సింగ్ గారు గమనిస్తూనే ఉన్నారు. ఒక్కోమాటు కొడుకును దగ్గరకు పిల్చి నచ్చచెప్పేవారు 'సిఐడిలకు అనుమానం కలగకుండా ఉండాలంటే, నువ్వు ఇంటి దగ్గర ఉండాలి. ఈ కుర్ర చేష్టలు దేశభక్తి అనిపించుకోవు. కొంచెం తెలివి తెచ్చుకో.' అనేవారు.

అప్పటికీ వినకపోవడంతో భగత్‌సింగ్ ఇంటి దగ్గరే ఉండేటట్టు చేయడానికి సర్దార్ కిషన్‌సింగ్ గారు ఓ ఉపాయాన్ని ఆలోచించారు. అది కొత్తదేం కాదు. భగత్‌సింగ్‌కు వివాహం చేసెయ్యాలనుకున్నారు. సంపన్నమైన ఓ సిక్కు పరివారంలోని కన్యను నిశ్చయం కూడా చేశారు. కానీ భగత్‌సింగ్ వివాహం చేసుకోవడానికి అంగీకరించలేదు. దీంతో కిషన్‌సింగ్ గారికి పుండు మీద కారం చల్లినట్టయింది.

"పెండ్లి ఎందుకు చేసుకోవు?" తండ్రి ప్రశ్న.

"ఆర్థికంగా నాకాళ్ల మీద నేను నిలబడేవరకూ పెండ్లి చేసుకోదలచలేదు" కొడుకు సమాధానం.

"నువ్వు తాతకు దగ్గులు నేర్పుతున్నావేరా? పెండ్లి చేసుకో, నీ కాళ్ల మీద నిలబడడానికి ప్రయత్నించు, నేనేం వద్దనడం లేదే? వివాహం చేసుకున్న మాత్రాన నీనెత్తిన వచ్చిపడే బాధ్యతలు ఏమున్నాయి" తండ్రి అడిగేవాడు.

ఒకమాటు తను ఇంకా చిన్న వయసులోనే ఉన్నానన్న సాకును చెప్పాడు భగత్‌సింగ్. తండ్రి మండిపడ్డాడు "మిగిలిన అన్ని విషయాలకూ ఆరిందావి కదా? పెండ్లికే చిన్నవాడివి... ముందు పెండ్లి చేసుకో, అవసరం అనుకున్నప్పుడే భార్యను తెచ్చుకుందువుగాని" అన్నారు కిషన్‌సింగ్ గారు. ఈ సంబంధం చేసుకుంటే పెద్ద మొత్తంలో కట్నం లభించే అవకాశం ఉంది. భగత్‌సింగ్ పెండ్లికి అంగీకరించకపోవడంతో కిషన్‌సింగ్ గారు మానసికంగా జ్వరం పడ్డ వాడిలా ఉంటున్నారు.

భగత్‌సింగ్ తండ్రితో స్పష్టంగా చెప్పేశాడు. "మెట్రిక్ ప్యాసయిన పిల్లనుగాని వివాహమాడను" అన్నాడు. దీంతో కిషన్‌సింగ్ గారి కోపం పరాకాష్ఠనంటింది.

భగత్‌సింగ్ విప్లవసంఘ కార్యక్రమాల గురించి తిరుగుతూండడం వల్లా ఇంటికి పోవడం లేదు. తండ్రి కోపానికి జడిసీ ఇంటికి పోవడం లేదు. నా దగ్గరగానీ, భగవతీచరణ్ ఇంట్లో గానీ ఉండేవాడు. ఒక్కోప్పుడు ఇతర స్నేహితుల దగ్గరా ఉంటూండేవాడు. మేము అతడికి ఆశ్రయం ఇస్తూండడం వల్ల కిషన్‌సింగ్ గారికి మా మీదా కోపంగానే ఉండేది. వారి కోపానికి మేమూ జడిసేవారం. నలుగురు మిత్రులం కూచుని సరదాగా, నవ్వుతూ మాట్లాడుకుంటున్న సమయాల్లో కిషన్‌సింగ్ గారు వస్తే మేము మా మాటల్ని, నవ్వుల్ని చప్పున ఆపి మౌనాన్ని వహించేవాళ్లం. మరి పెద్దవాళ్ల ముందు ఎలా పరిహాసంగా మాట్లాడుకోగలం? మేమలా మౌనాన్ని వహించడంతో కిషన్‌సింగ్ గారికి మా మీద మరీ కోపం వచ్చేది. మేము విప్లవాన్ని గురించి మాట్లాడుకుంటున్నామనీ తనను చూసి మౌనాన్ని వహించామనీ అనుకునేవారు.

సర్దార్ కిషన్‌సింగ్ గారు నేను ఉన్న చోటికి ఎన్నడూ రాలేదు. ఒక రోజున నలుగుర్నీ అడుగుతూ నేను ఉన్న ఇంటి అడ్రసు తెల్సుకుని వచ్చారు. చేతిలో బారాటి లాటీ ఉంది, ముఖం కందగడ్డలాగుంది. వారి వాలకం చూస్తేనే చాలా కోపంగా ఉన్నారని తెలుస్తున్నది. వస్తూనే

---

స్పేసింగ్, ఇతర నిర్వహణ ప్రాక్టిసెస్‌లలో మంచి దిగుబడులకు సంబంధించిన సమాచారాన్ని అందివ్వడం.

- ఈ వి.ఇ.డబ్ల్యు లకు 15 రోజుల కొకసారి విషయ నిపుణుల చేత శిక్షణ ఇప్పిస్తారు. వ్యవసాయ విస్తరణాధికారి నియంత్రణ కింద 8 మంది వి.ఇ.డబ్ల్యు లు సాంకేతిక పరమైన మార్గదర్శకాలను తీసుకొంటారు. శిక్షణ, సందర్శన పద్ధతిని విశ్లేషించినట్లయితే శాస్త్రీయ నిర్వహణకు దోహదపడుతుంది.
- ఈ పద్ధతిలో, అమలులో అనేకమంది రైతులు పక్షపాతంగా వ్యవహరించే ప్రమాదముంది దాన్ని నివారించాలి.
- ఈ దృక్పథం ఒక విధంగా టెక్నాలజీతో ఉత్పాదకతను పెంచేందుకు సహాయపడుతుంది.
- ఈ దృక్పథంతో అనేక విషయాలను విస్తరణాధికారుల చేత తెలుసుకోవడమే కాక, స్నేహితుల, బంధువుల లేక ఇరుగుపొరుగు వారి చేత చిన్న, సన్నకారు రైతులకు సమాచారాన్ని చేరవేసేందుకు తోడ్పడుతుంది.
- గ్రామీణ పేదల్లో, రైతుల్లో వస్తుపరమైన విజ్ఞానాన్ని పొందడానికి డిమాండ్ ఉన్న పరికరాల వినియోగం పై సమాచారాన్ని అందించవచ్చు.
- ప్రధానంగా వాణిజ్య పంటలకు సంబంధించిన వాటిల్లో చిన్న, ఉపాంత రైతుల భాగస్వామ్యంతో అధిక దిగుబడులు, లాభాలకు సంబంధించిన విషయ సమాచారం తెలుస్తుంది.
- బహుళజాతి సంస్థలకు, పారిశ్రామిక వర్గాలకు అధిక లాభాలిచ్చే సీడ్స్, ఫర్టిలైజర్స్, పెస్టిసైడ్స్ మొదలగు ఈ విస్తరణ కార్యక్రమానికి మరెంతో ఉపయోగపడుతుంది. ◆

కోపమూ, ఆత్మీయతా కల్సిన స్వరంలో "నువ్వు భగత్‌సింగ్‌కు పెండ్లి చేసుకోమని ఎందుకు చెప్పవు? వాడు అసలు ఎందుకు పెళ్లి చేసుకోడు? మీరంతా ఒకటే జట్టు, మహా విప్లవకారులైనట్టు, బ్రహ్మచర్యాన్ని వహించేవాళ్లలా మాట్లాడుతున్నారు ఇప్పుడు. నాలుగు రోజులు పోతే ఆడపిల్లల కొంగు పట్టుకుతిరుగుతారు" అన్నారు. వారు ఇంకా కూడా కొన్ని కటువైన బూతు శబ్దాల్ని ప్రయోగించారు. వాటిని రాయడం సంభవం కాదు.

నేను ఇలా అన్నాను "అతడు పెళ్లి వద్దనడం లేదు. చదువుకున్న పిల్ల కావాలంటున్నాడు".

"చదువుకున్న దాని దగ్గర ఏం ప్రత్యేకత ఉంటుందేంటి? దాని సంతానం పుట్టుకతోనే చదువు నేర్చుకొని పుడతారా?" అన్నారు.

ఉన్న కొద్దీ వారి కోపం వృద్ధవుతూనే ఉంది. చివరకు తిట్టడం మొదలు పెట్టారు. "నువ్వూ, జయచంద్ర – వట్టి నీచులు, మీరేమో హాయిగా ఉద్యోగం చేసుకుంటున్నారు. ఇతర్లని నాశనం చేస్తున్నారు. మీరు మహామోసగాళ్లు. నువ్వు వాడికి చెప్పలేవుట్రా?" అన్నారు. 'అతడికి నేనేం చెప్పగలను? అతడే నాకు చెప్తున్నాడు' అందామనుకున్నాను. పైకి ఇలా అన్నాను "ఇంటి పనిపాట్లు చూసుకోమని నేను అతడికి ఎప్పుడూ చెప్తుంటాను. నేను చూడండి ఎలా ఉద్యోగం చేసుకుంటున్నానో".

తరువాత భగత్‌సింగ్ ఎక్కడికి వెళ్లాడని అడిగారు. నాకు తెలియదన్నాను.

"వాడు మీ దగ్గరే ఉంటున్నాని చెప్పాడే" అంటూ ఓ పెద్ద మనిషి పేరు చెప్పి "ఆయన ఇవ్వాళ ఉదయం భగత్‌ను ఇక్కడ చూశాడట, వాడు ఎక్కడికి పోయింది నీకు తెలియక ఇంకెవరికి తెలుస్తుంది?" అని గద్దించి, బలువైన బూతు మాట నొకదాన్ని నా మీదకు విసరి "సంకరజాతి ముండాకొడుకా, నీకు తెలియక ఇంకెవరికి తెలుస్తుందిరా?" అన్నారు.

ఎక్కడున్నాడో నాకు తెలియదని ఒట్టు పెట్టుకున్నాను. ఊరకా బజార్లో కనుపించాడనీ, నా దగ్గరకు రాలేదని చెప్పాను.

"మరి సుఖదేవ్ ఎక్కడ ఉన్నాడు?" అని అడిగారు.

సుఖదేవ్ ఉండే ప్రదేశాన్ని చెప్పడం కష్టం, అతడూ, జయగోపాల్ ఇద్దరూ కన్హయ్యాలాల్ బిల్డింగ్‌లో ఓ గదిలో రహస్యంగా ఉంటున్నారు. అడ్రసు ఇవ్వడానికి వీల్లేదు. నాలుగయిదు తప్పుడు అడ్రసులు ఇచ్చాను. "ఆ అడ్రసులకు వెళ్లండి, బహుశా ఎక్కడయినా ఒకచోట భగత్‌సింగ్ ఉండవచ్చును" అన్నాను.

సర్దార్ కిషన్‌సింగ్ గారు నేను ఇచ్చిన తప్పుడు అడ్రసులన్నింటికీ వెళ్లారు. దురదృష్టవశాత్తూ ఒకచోట భగత్‌సింగ్ దొరకనే దొరికాడు.

తరువాత భగత్‌సింగ్ నా దగ్గరకు వచ్చి తండ్రి తనను కొట్టిన దెబ్బలను చూపించాడు. మోకాళ్ల మీద, మోచేతుల మీదా, భుజాల మీదా లాటీ దెబ్బలు కనుపిస్తున్నాయి. పకపకా నవ్వుతూ తండ్రి తిట్టిన కొత్త కొత్త తిట్లను వినిపించాడు. నేను మనస్సులో చాలా బాధపడ్డాను. "నువ్వు అక్కడ ఉండవనే ఉద్దేశ్యంతో ఆ అడ్రసులు చెప్పాను" అన్నాను.

1927 దసరా పండుగ సందర్భం లాహోరులో ఎవరో ప్రజల మీద బాంబు విసిరారు. సాధారణ మనస్థితి కలవాళ్లు ఎవరూ అలాంటి పనిచేయరు. దట్టమైన ప్రజా సమూహంలో బాంబు పేలడం వల్ల చాలా మంది గాయపడ్డారు. కొందర్ని హాస్పిటల్లో చేర్చారు. సేవాసమితి తరఫున క్షతగాత్రులకు సేవచేయడానికి నేను హాస్పటల్‌కు వెళ్లాను. దసరా పండుగ సమయంలో బాంబు పేలడం వల్ల ముస్లింలే ఈ పని చేసి ఉంటారని హిందువులు ఊహించారు.

పోలీసులు అనుమానం మీద కొందరిని అరెస్టు చేశారు. వాళ్లల్లో భగత్‌సింగ్ ఒకడు. మా కాలేజిలో చదువుకుంటున్న మరో విద్యార్థి బాబూసింగ్‌ను కూడా అరెస్టు చేశారు. భగత్‌సింగ్‌ను దాదాపు రెండు వారాలు జైల్లో ఉంచారు. అతడి వ్యవహారాన్ని న్యాయస్థానానికి పంపమని వత్తిడి చేశాం. పోలీసులు అతడి మీద ఏ నేరాన్నీ మోపలేకపోతున్నారు. చివరకు జామీను మీద వదిలి పెడతామన్నారు. ఐతే, జామీను ఉండేవారు నలభై వేలు ధరావతు కట్టాలి. అంత పెద్ద మొత్తాన్ని ఎవరు కడతారు? లేని పక్షంలో భగత్‌సింగ్ ఇంట్లో నుండి కదలడానికి వీల్లేదు. సిఐడి పోలీసులు నీడలా అతని వెంటాడుతున్నారు. సిఐడి పోలీసుల కన్నుకప్పడం ఏమంత పెద్ద కష్టమైన పనికాదు. ఐతే, అలా చేయడం వల్ల పోలీసుల అనుమానం ధృవమవుతుంది.

నేను చెప్పడం వల్ల గోపీచంద్ భార్గవ్‌గారు పంజాబ్ అసెంబ్లీలో భగత్‌సింగ్‌ను అకారణంగా ధరావతు కట్టమనడాన్ని గురించి ప్రశ్నించారు. డాక్టర్ గారికి నా మీద ఎంతో విశ్వాసం. వారికి ఎప్పుడూ తీరికవుండేది కాదు. రోగుల తోటి, కాంగ్రెస్ కార్యక్రమాల తోటీ సరిపోతూండేది. అసెంబ్లీకి సంబంధించిన సమస్త కార్యక్రమాలను నేనే చూసిపెడతూండేవాడిని. అసెంబ్లీ ప్రశ్నల్ని నేనే తయారు చేస్తుండేవాణ్ని. డాక్టర్‌గారు అసెంబ్లీలో ప్రశ్నించడంతో ప్రభుత్వం ధరావతును రద్దుచేసింది. భగత్‌సింగ్‌కు స్వేచ్ఛ లభించింది. కొన్నాళ్లు ఏ కార్యక్రమాల జోలికి పోకుండా ఇంటి పట్టున ఉన్నాడు. ఉన్నట్టుండి అకస్మాత్తుగా పరారయ్యాడు. అసెంబ్లీలో బాంబు పేల్చిన తరువాతనే అతడు మళ్లీ ప్రజలకు కనుపించాడు.

అలా పరారయిన భగత్‌సింగ్ ఢిల్లీ, ఆగ్రా, కాన్పూర్, పాట్నా, కలకత్తా – మొదలైన పట్నాల్లో నిరంతరం తిరిగి వివిధ ప్రాంతాల విప్లవకారుల ఐక్యత కోసం కృషి చేశాడు. అన్ని ప్రాంతాల్లోనూ విప్లవసంఘాలు బలహీనస్థితిలోనే ఉన్నాయి. అలా ఉండడానికి ముఖ్య కారణం – తగిన సాధన సంపత్తీ, బలమైన ఉద్యమం లేకపోవడమే. విప్లవోద్యమాలు సాధారణ ప్రజల కోసమే ఉద్దేశింపబడతాయి. ఐతే, సాధారణ ప్రజల సహాయ సహకారాలను పొందడానికి విప్లవోద్యమాలకు అవకాశం ఉండదు. ఈ ఉద్యమాలు ప్రజల కోసం ఉద్దేశింపబడినవే అయినప్పటికీ, ప్రజల సహాయ సంపత్తులకు దూరంగా ఉంచి, ఏ కొద్దిమంది అభిమానుల సహాయంతోనో వీటిని నడపవలసి ఉంటుంది. మేము మా సంఘంలోని సభ్యులకు గానీ, లేక కొద్ది మంది విశ్వాసపాత్రులైన సానుభూతిపరులకు గానీ – మా కష్ట సుఖాలనూ, అవసరాలనూ చెప్పగలం. మా బాధల్ని లేక అవసరాల్ని ప్రజల ముందుంచడం, వారి నుండి సహాయాన్ని ఆశించడం – అసంభవం అయిన విషయం.



సంకలనం : **రాంకి**

# అసహజ మరణాల సూచి

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంభైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 26.1.07 నుండి 1.2.07 | 22 | – | 18 | – | – | – | 14 | – | – | – | 11 | 20 | 9 | 2 | 1 | – | 3 | – |
| 2.2.07 నుండి 8.2.07 | 10 | – | 19 | – | – | – | 10 | 5 | – | 7* | 18 | 22 | – | – | 1 | – | 11 | – |
| 9.2.07 నుండి 15.2.07 | 13 | – | 16 | 2 | – | – | 11 | 7 | – | 2* | 15 | 8 | 2 | – | 2 | 1 | 6 | – |
| 16.2.07 నుండి 25.2.07 | 33 | – | 20 | – | – | – | 8 | 2 | – | 3* | 32 | 21 | – | – | – | 1 | 3 | – |
| మహబూబ్‌నగర్ రవికుమార్ | 8 | | 2 | – | – | – | 4 | 13 | – | 2 | 44 | 31 | 16 | – | – | – | – | – |
| మెదక్ కె. రాజు | 10 | – | – | – | – | – | – | – | 4 | 5* | – | 1 | – | – | – | – | – | – |
| కడప ఎన్.ఎస్.ఖలంధర్ | 1 | – | 12 | 2 | – | – | 7 | – | – | 3 | 43 | – | – | – | – | – | – | – |
| **మొత్తం** | **97** | **–** | **87** | **4** | **–** | **–** | **54** | **27** | **4** | **22** | **163** | **103** | **27** | **2** | **4** | **2** | **23** | **–** |

**గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.**

*** రాత్రి కరెంట్ వలన 13 మంది రైతులు చేనులో ప్రమాదానికి గురయ్యారు.**

PRINTED BOOK
RNI Regn. No. APTEL/2003/11482 Published on 27-02-07. Postal Regn. No. LII/RNP/H-HD 1029/2004-06



Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 66843495. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. For Nutan Art Printers, Hyderabad. Working Editor : N. Venugopal

VEEKSHANAM
301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayatnagar, Hyd-29.